# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1959

సంపుటము 36 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1959



## డిసెంబరు సంచికలో

# మనవి మాటలు

మనసు మరుగున తారాడే తలపులను వెలువరించడానికి మాటలే రాచబాటలు. ఈమాటలకు పలుకుబడి-నుడికారం- ప్రాణం. నుడికారం తెలీక ప్రయోగించిన నుడువులు నిర్జీవాలు, పరమార్థనివేదనా సమర్థలూ అవుతాయి. రచయిత విధి పాఠకుని అభిముఖీకరణమే కాని విముఖీకరణం కాదు. కనుక పలుకుబడితో పెనవారిమదిని చూరగొనడం అవసరం.

అయితే, మానవవర్గం అన్యోన్యాశ్రయంతో నే ఆదికాలంనుంచి అభివృద్ధి చెందుతున్నది. ఈ శతాబ్దంలో ప్రజానుబంధం విస్తరించి భాషలకూ పరస్పర సాన్నిహిత్యం ఏర్పడింది. ఈ కారణంగా భాషల వికాసానికి సాంకర్యం తప్పదేమో - అనేవాదం ఉంది.

“అతడు గ్రంథమును వ్రాసినాడు...అనుట తెలుగు పలుకుబడి కాదు. కమ్మ వ్రాసినాడు. జాబు వ్రాసినాడు అనుటే కాని గ్రంథము వ్రాసినాడు అనుట ప్రాచీనుల పలుకుబడి కాదు. వ్రాయుట లిపికరుని పని. అందు రచనాచమత్కృతి లేదు. గ్రంథము రచించినాడు, కబ్బము కట్టినాడు, కబ్బము చెప్పినాడు అనుట ప్రాత తెలుగు పలుకుబడి. అయినా, నేడు అనేకులు గ్రంథము వ్రాయుచున్నాడు అని వ్రాయుచున్నారు. ఇది ఇంగ్లీషు పలుకుబడి. తెలుగులో రూఢికెక్కినది. ఇక తొలగింప కుదురదు. తొలగింపనక్కలేదు.

“గ్రామాధికారిని కరణమని పిలుతురు అనుట తెలుగుపలుకుబడి కాదు. కరణ మందురు. కరణమని పేర్కొందురు అనుట తెలుగుపలుకుబడి. కరణమని పిలుతురు అనుట ఇంగ్లీషు పలుకుబడి. తెలుగుభాషలో రూఢమైనది. ఇక తొలగింపసాధ్యముకాదు. రూఢికెక్కినతర్వాత తప్పుగా భావించడం తొలగిపోతుంది” అన్నారు భాషాతత్త్వవేత్తలు.

నిజమే. ఇలాటి సాన్నిహిత్యం, సామరస్యం భాషావికసనానికి అవసరమైనవే. కాని, ఆలోచనల అలలను అరికట్టి, భావనా వైభవాన్ని బీటలు వారచేసే సాయుజ్యం, సమైక్యం సమాదరణీయాలా! బుద్ధిని మొద్దుబారచేసి, భావదాస్యానికి పట్టంకట్టి చేతను చితుకగొట్టే చిత్తవృత్తి ఆకాంక్షణీయమా? ఈ భావదాస్యంవల్లనే కాబోలు కొన్నిరచనలు కొన్నికలలకాలమో, వికలలకాలమో చమత్కారాపాదకాలు అవుతాయికాని, కలకాలం — కనీసం కొంతకాలం—మని మననంచేసుకొనే స్థాయిని అందుకోవడంలేదు!

సంస్కృతిదాస్యంతో నవకళభావాలు కొన్ని మోడుబారిపోలేదా? ఒక ప్రాంతంలో ‘మణిప్రవాళం’ మనే కృత్రిమభాషే పుట్టుకురాలేదా? అని ఆక్షేపిస్తారుకదూ! ఔను. కొంతవరకూ ఇది వాస్తవమే. కాని, రచనా రహస్యాన్ని, నిర్మాణ మర్మాన్ని ఎరిగినవారెవరూ ఇతర భాషాభావప్రవాహంలో కొట్టుకుపోలేదు. తమభావమూలబంధాన్ని, పలుకుబడి పట్టును, ఆలోచనల ఆలవాలాన్ని కోల్పోనూలేదు. వాటిని గట్టిపరచుకొనే ఇతరవాఙ్మయాల భావకుసుమాలను ఏర్చి కూర్చి తమరచనలను అలంకరించుకొన్నారు.

ఏ సాహిత్యంలో ఎక్కడ ఏమంచి కొనవచ్చినా, భ్రమరనీతితో స్వీకరించడం భాగ్యమే. అయితే, ఆగాలిపాటుకే పడిపోవడం, ఆ తావులకే దిమ్మతిరిపోయే మనస్తత్వం తగదు. ఈ మనస్తత్వం అనువాదాలలో మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఉదాహరణకు : సమ్మిట్ టాక్స్ అంటే, శిఖరాగ్రచర్చలు. అగ్రనాయకుల చర్చలు అంటే ఎంతసులువు? శిఖరాగ్రంలో చర్చలు అనే అపార్థానికి అవకాశంలేదూ? స్పేస్ షిప్-రోదసీనౌక. నౌక అనేమాట ఎందుకు? నీఞ్ ధాతువునుంచి పుట్టిందికదా అంటారేమో! యోగాద్రూఢిర్బలీయసీ! విమానంమీద వెళ్లాడు. మీద అనేది మన పలుకుబడా! విమానంమీద ఎక్కి ఆ రెక్కమీద ఈ రెక్కమీద చేరి ఒక కాలువేసుకొని ప్రొపెల్లరును తిప్పడమా? విమానంలో అంటే సరిపోదూ? భూమి సంస్కరణలు- ఇది పూర్తిగా ల్యాండ్ రిఫార్మ్స్ అన్నదాని మక్కీకి మక్కీ కాదూ? భూమిస్వామ్యంకదా సంస్కరించబడేది! ఇలాగే హిందీ సంప్రదాయదాస్యంకూడా. ఈ హిందీ అభిమానులు “మేరాకహనా యహ్ హైకి” అన్నరీతిలో నే “నేను చెబుతున్నది ఇదికదా” అని ఎత్తుకుంటారు మాట. ప్లేగ్ నివారణ నిపుణునికి ప్లేగ్ శాస్త్రి అని హిందీలో వ్రాశారు. ఇది ఎలా ఉంది?

భావం భాష అన్యోన్యాశ్రయాలు కనుకనే సంప్రదాయంలో, సముదాచారంలో వేళ్ళూనిన, పలుకుబడిని పట్టుగొమ్మచేసుకొని, ఆలోచనలను అల్లుకున్నప్పుడే మౌలిక రచనలు మొలకెత్తుతాయి. పలుకుబడిని పరిహరించడం- పరిమార్చడం వద్దనే ఈ మనవి.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

అన్నియుం జక్కఁగా జరుగుచున్నప్పు డభవ! యా మృత్యు
వన్నది సహజమైనట్లు దానిభయంబు లేనట్టు
లున్నది యది వచ్చినప్పు డీరీతినుండఁగాఁ జేయు
సున్నితంబుగను శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నీవు లింగాకార మూనుటే ధారుణికి నీ యథార్థ
భావంబు వ్యాఖ్యానపరచునట్టులు పరమ పూర్ణతయు
నావఁ గోలగా జ్యోతి వగుట నిరాకార పరిధి
సూపె నీవగుట శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నను నే విచారించుకొనిన నవ్వుగా నాకె యున్నయది
నిను సమభ్యర్థించు పద్ధతి సుకృతి నీరేజ మధువ
ధుని సముద్రునిఁ గోరవచ్చుఁ బెనుకొండ తూగుటేలో వ
రుణ దేవుగూర్చి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నాబిడ్డ యీకైతపాప మిది కూడ నగజాతస్వామి
జాబాలిమైత్రావరుణి మొదల్ ఋషుల్ సంబంధమాడ
రాఁబోరు నా మాటమీఁద దీనిని గ్రహియింపు మిదియె
సోబానకూడ శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

వియదాదికబృహత్తనూ శివా పట్టువిడుపులు గల్గు
దయయేమి దను భవా సతత సురవారిధారాభిషేక
మయమైనఁగాక యీ కరుణ యేరీతి మన్నింతు నభవ
సువహ కాదయ్యె శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఆలోల కల్లోలితామ్మకూకృతి యా రెంటునాళ్ళు
నీలలోహిత తీసిపోయెను గదయ్య నీ దయాతటిని
సీలమండలలోతు లేదు ముంచఁ దడిపొడి చేయదు సామి
శూలమ్ము చివర శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

తుదిదాఁకఁ దోడవువాని పోలికఁ దూగి వచ్చితిప
పదిబారలేగిన యంతలోఁ జప్పఁబడిపోయి తభవ
ముదిసిన నాకంటెఁగూడ మిక్కిలి ముదిసినయట్లు
చోదుగుమాలితివి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నీవు నామనసులోనుండి యెపుడు కంతేకాల తొలఁగి
పోవను నొక తృప్తివిడఁచి నీవల్ల పొందినదేమి
పావనంబైన నీ వెగ్గుచూపించు పాపానఁబోవు
సూవె యం చనన శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

రెంమభావా లోకేసారి యుండనికీతిగాఁ దర్క
పండితుల్ చెప్పఁగు రేమి చెప్పట పరమ మహేశ
గండిలో నోడియు నివ్వోట గుండమై కదంపిం దమర
శుండాలమూర్తి శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

కాలువగా జాలువారి యింతలో గడ్డకట్టెడవు
నాలోనఁ బొనుగార్చుచుంటి యగ్గికణంబు వేఁపుగ
కాలాంతకున కైనవాడు నొక్కఁడే కానివాఁ డొకటి
పోలింపఁజేయ శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

చిత్తము లాగుచున్నయవి యెట్టనిచేగులై వ్రేలు
గుత్తులు గుత్తులై ప్రిదిలుకొన్నవి గుండియలెల్ల
బత్తుల పో వేల్పుచెట్ట నీమొడ పట్టుకోనివె
సొత్తేమిపోదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఓసామి నీవు నా గుండెలోపల నుంటివా పెద్ద
లా సాము లన్నాగటంచు నిది భ్రాంతియా నాకు నభవ
మానసమ్ముగ నింతపైకిఁ బొక్కవా మసలిన నచట
నూనరివాడు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఒకటి యథార్థమా నంబికాజాని యుర్వి నెందేని
నొకదొట్టి యుండె నీ తత్త్వ మయ్యది యెంతైనఁగాని
కొంకిబికి యీ ధరాతత్త్వముం ద్రవ్వకొలఁదిఁ గన్పడెడు
సుకమందునట్లు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

# ఎఱ్ఱమండ భూపతి చేబ్రోలు శాసనము

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

పూర్వచాళుక్య నృపతియైన రాజరాజనరేంద్రుని కుమారుడు మొదటి కులోత్తుంగచోడ చక్రవర్తి తన రాజధానిని వేంగిదేశమునుండి చోళదేశమునకు మార్చినపిదప వేంగీరాజ్యపరిపాలనము నిమిత్తము తన కుమారులను రాజప్రతినిధులుగా పంపుచువచ్చెను. వీరికి బాసటగా నుండుటకై తమ చాళుక్యవంశమును ప్రాచీనకాలమునుండియు భక్తివిశ్వాసములతో గొలిచిన భృత్యకుటుంబములలోని సమర్థులైన నాయకులను మొదట సేనానులను, దళనాయకులను జేసి పిదప వారిలో కొందరికి సామంతరాజచిహ్నముల నిచ్చి మండలేశ్వరులను గావించెను. ఈ రీతిని మొదటి కులోత్తుంగుని రాజ్యపరిపాలనము కడపటి వత్సరములలో వేంగీదేశమున పెక్కు సామంతమాండలిక రాజ్యము లేర్పడినవి. కులోత్తుంగచోడ చక్రవర్తి చివరి రాజ్యకాలమునుండి కాకతీయులు జయించువరకు ప్రాగాంధ్ర (వేంగీ) దేశచరిత్రము సామంతమాండలికరాజ్యచరిత్రమే. ఇట్టి మాండలికవంశములలో కొండపడుమటిదేశము నేలిన నాయకవంశ మొకటి.

కొండపడుమటిదేశమనగా కొండవీటికొండలకు పడమట నున్న నరసారావుపేట, సత్తెనపల్లి (గుంటూరుజిల్లాలోని) ప్రాంతములు. ఈ దేశమును మొదటి కులోత్తుంగుని, అతని సంతతివారి కాలమునందు పాలించిన మాండలికులకు శైలపశ్చిమ వసుంధరాధిపతులని, గిరిపశ్చిమశాసనులని, గిరిపశ్చిమదేశాధిపతులని వ్యవహారముండెను. ఇక్కడ శైలము, గిరి యనగా, కొండవీటికొండ. ఈ గిరిప్రతీచి త్రిసప్తతి, అనగా డెబ్బదిమూడుగ్రామముల దేశము. ప్రాచీనకాలములో దేశపరిమితి గ్రామముల లెక్కను తెలుపబడుచుండెను. (ఉదాహరణము: వేంగి పదారువేలు; వెలనాడు ఆరువేల దేశము; పాకనాడు ఇరువదియొక్క వేయి గ్రామముల దేశము.) గ్రామమున్న నెంత పరిమితిగల ప్రదేశమో ఇంతవరకు తెలియరాలేదు.

గిరి పశ్చిమదేశాధిపతులు తాము దుర్జయుని సంతతివారమని చెప్పుకొనియున్నారు. వీరు చతుర్థకులులు. దుర్జయాన్వయుడైన బుద్ధవర్మనరేంద్రుడు వేంగీపూర్వచాళుక్యరాజ్యస్థాపకుడైన కుబ్జవిష్ణువర్ధన భూపుని యనుంగుభృత్యుడు. మధుకైటభవైరియైన విష్ణువు విహంగరాజువలెను, రావణవిజేతయైన శ్రీరామచంద్రుని మరుత్సుతునివలెను భక్తితాత్పర్యములతో గొలిచినందుకు ఆ చాళుక్యమహారాజు సంతుష్టుడై రాజలాంఛనముల నొసంగి గిరిప్రతీచికి (గిరిపశ్చిమదేశమునకు) అధిపతిని గావించెను.

కుబ్జవిష్ణువర్ధనుని కాలమునుండి మొదటి కులోత్తుంగచోడచక్రవర్తి కాలమువరకు కొండపడుమటి దేశాధిపతుల చరిత్ర యేమియు తెలియదు. కులోత్తుంగచోడచక్రవర్తి రాజ్యకాలము చివరినుండియే ఈ గిరిపశ్చిమశాసనుల శాసనములు కాన్పించుచున్నవి. వీని మొట్టమొదటి శాసనము గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా పాకాలపాడు గ్రామమునందలి కేశవస్వామి ఆలయము ముందరి శిలమీద కానవచ్చినది. త్రిభువనచక్రవర్తి కులోత్తుంగచోడదేవుని నలువదియైదవ రాజ్యవత్సరమునకు సరియైన శకవర్షము 1036 (క్రీ.శ. 1114) నాటి ఉత్తరాయణ పుణ్యకాలమునందు చక్రవర్తి సామంతుడైన కొండపడుమటి దేశాధిపతి ఒక దేవాలయమునకు పాకలపాటి గ్రామములోని భూమిదానమిచ్చిన విషయమును తెలుపుటకు పుట్టిన శాసనమిది. కాని శాసనమున ఏ దేవాలయమునకు చేసిన దానమో, దాతయైన కొండపడుమటి దేశాధిపతి యెవరో ఆ విషయములు గల శాసనపంక్తి భాగములు శిథిలమైనవి. ఈ కారణము వలన శకవర్షము 1036 నాటి కొండపడుమటి దేశాధిపతి పేరు తెలియవచ్చుట లేదు.

కొండపడుమటి భూవరుల తరువాతి శాసనమే ఈ చేబ్రోలు శాసనము. ఈ శాసనమున పేర్కొనబడిన మాండలికుడు ఎఱ్ఱమండ భూవరుడు. ఇది శకవర్షము 1040 (క్రీ.శ. 1118) నాటిది. పాకలపాటి శాసనమునకును, దీనికిని నాలుగేండ్ల యెడము. గిరిప్రతీచి శాసనుల వంశవృక్షమునందు బుద్ధవర్మకుపిదప పేర్కొనబడిన మొదటి మాండలిక ప్రభువు ఇతడే యగుటచేత

పాశలపాటిలో భూదాన మొసంగిన కొండపడుమటి ప్రభువు కూడ ఈ యెఱ్ఱమంచరాజే కావచ్చునని తోచుచున్నది.

## 2

ఈ యెఱ్ఱమంచినృపతి చేబ్రోలు శాసనము చరిత్రకు చాల ముఖ్యమయినది. ఇది 1928 లో దక్షిణ హిందూదేశ శాసనములు, ఆరవ సంపుటమునందు 117 వ నెంబరు శాసనముగ ప్రకటితమయినది. దీనినే పూజ్యులైన శ్రీ జయంతి రామయ్యపంతులుగారు తమ 'శాసనపద్యమంజరి' యను పుస్తకములో 7 వ నెంబరు శాసనముగను, దక్షిణహిందూదేశ శాసనసంపుటము లోని ఈ శాసనమునందు శాసనశిలకు ప్రక్కనున్న ముప్పది పంక్తులలో 15 పంక్తులను ఆరవనెంబరు శాసనముగను ఇచ్చి, వచనములోనున్న కొంత శిథిలమైన మిగిలిన 15 పంక్తులను తమ గ్రంథమునందీయక వదలి పెట్టినారు.

శాసనపద్యమంజరిలోని ఏడవనెంబరు శాసన పద్యపాఠ మిది :

1. క. శ్రీరమ (ణీయు)ండు గులని
స్తారకుండు న...శ్యచంద్రు(ండు) సుజ (నా)
ధారుండు గన్నయపుత్రుండు
నూరండు(నూ)...పత్తికొండనూరక పేర్మిని.

2. చ. జితరిపు(చే) త వణ్డలిక
సంఘము జేగిరి పశ్చిమ(ంబు)న
పతి యగు(వె)ఙ్గిమణ్డజన
పాలకు లేక మహాప్రధానిక
స్థితియును నం(ద)లంబును వి
శేష విభూతియుం(బే)ర్మ్మితోడ ప్ర
స్తుతి(మ)గ చుణ్డం గండ డని
నూర(ణ్డు) పౌరుషధర్మ్మ పారుణ్డై.

3. చ. తన...లోకవిధి
తిరంబుగా బొప్పిచిన పణ్డరుణీ
జనపతి మస్తవంబున బ్ర
శస్తితి నబ్బెజవాడ నయ్యపా
ధవసుభటావలిం దున్మి
తమ్ములు దానునుం బోరిలోనం జే
కొక్కని గెలిపించె వా(డు)నధి
కుణ్డగు నూరణ్డు శౌర్య్య పారుణ్డై.

4. ఉ. విరుదు నూడలుం జెనదె
పెద్దు(ను) విం త్రియకాని(త)మ్ములో
పారయ లేని పందల దు
రాత్ముల గుర్వ్వవపాయులను దురా
చారులం జెప్ప వేణ్టిక ల
సద్గుణధీరు...వీరదు
ర్వ్వార(ణు)విశ్వకర్మ్మకుల
వల్లభు నూరనిం జెప్పశేమ్మహిని.

5. అనుపమసాహస స్ఫురణ
నమ్మ మెయిం దలపోయ వా(లిం?) జే
కొక్కని కసుపిరులై నెగడు
కన్నులు బొం(ద్ద)ల తోడి యూపనం
జను నసహాయసాహసగ
సప్రియు మణ్డ మహీతలేసు క
ట్టనుంపు ను ద్రగణౌర్య్య సుధ
టాగ్రణిం బ్రోలము పుత్రు నూరణిని.

6. రాజవిభూషణుండు సుర
రాజవిలాసుణ్డవన్త కీర్తి వి
భ్రాజితుం డెఙ్గిమణ్డజన
పాలకు నచ్చిన వజ్రదండక
న్నోజ సుతుణ్డు నూరని మ
హోర్వ్వపసన్నిధిం చెక్కు రాజస
త్పూజితు విశ్వకర్మ్మకుల
భూషణు వైరినరేంద్ర భీషణు.

7. గొడుగులు నందలంబును న
గు(ర్వ్వ)గుచున్న మహావిభూతియుం
బ్బదసెను విశ్వకర్మ్మ ముని
భావ్వతివల్లభుచేత విన్యమెయి
గొడుగులు నందలంబును న
గుర్వ్వగుచున్న మహావిభూతియుం
బ్బదసెను వెఙ్గిమండజన
పాలకుచేతను నూరం డమ్మ మెయి.

శాసనపద్యమంజరిలోని ఈ శాసనపద్య పాఠమునకును, దక్షిణహిందూదేశ శాసనములు ఆరవసంపుటములోని శాసనపద్యపాఠమునకును భేదములేదు. రెండును ఒక్కటే. ఆరవసంపుటములోని శాసనపద్యపాఠమునే శ్రీ పంతులుగారును గ్రహించియుందురు. ఆంధ్ర యూనివర్సిటీలోను, ప్రాయికముగా మద్రాసు యూనివర్సిటీలోను బి. యే. పరీక్షకు వెళ్లు తెలుగు విద్యార్థులు శాసన పద్యమంజరిలోని మొదటి పది, పండ్రెండు శాసనములను ప్రాచీనాంధ్రభాషాతత్త్వము తెలియుట కొరకు అధ్యయనము చేయవలసియున్నది. ఆ పది పండ్రెండు శాసనములలో నీ చేబ్రోలు శాసన మొకటి.

# ఎఱ్ఱమంద భూపతి చేబ్రోలు శాసనము

శాసనపద్యములందలి భాషావర్ణక్రమాదులను గురించియే కాని బి. ఏ. తెలుగు విద్యార్థులు అందలి చరిత్ర విషయము తెలిసికొన నక్కరలేదు. ఈ శాసనములోని పద్యములన్నియు దోషభూయిష్ఠముగ నుండుటచేత శాసనపద్యముల నిచ్చి శ్రీ పంతులుగారు అధోజ్ఞాపికలలో (ఫుట్ నోట్సు) స్పష్టముగ దోషములని తెలిసిన వానికి, వ్యాకరణగుణములయిన వానికి సవరణలు సూచించి అర్థము సుస్పష్టముకాని పట్టుల 'ఇట్లుండవచ్చును, ఈ పద మిట్లుండె నోపును' అని ప్రత్యేక సూచనలు చేసినారు. నాలుగవపద్యము మొదటి గణము తప్పినదని 'మెయి''మై' అని చదువవలెనని సూచించిరి. శాసన పద్యములలో ఎనిమిదవది కందపద్యము.

శ్రీ పంతులుగారు సూచించిన మార్పుల ప్రకారము సవరించినచో ఈ శాసనమునందలి రెండవ, మూడవ, నాలుగవ పద్యము లీక్రింద చూపిన విధమున నుండును.

2. జితరిపు(చే)త మణ్డలిక
సింహము శ్రీగిరి పశ్చిమంబునం
బతి యగు(చె)ఱ్ఱమణ్డజన
పాలకుచేత మహాప్రధాని క
స్థితియును సం(ప)దంబును వి
శేష విభూతియుం(బే)ర్మితోడం బ్ర
స్తుతి(మ)పదుణ్ణం గండె పెని
మూరి(ణ్డు) పౌరుషసమ్మణ సాగరుణ్డై.

3. తన......లోక విది
తంబుగం బ్రోచిన పణ్డభారుణే
జనపతిసంస్తవంబున భృ
శస్థితి నబ్బెజవాడె నన్యపా
ధవసుభటావలిం దునిమి
తమ్ములు దానునుం బోరిలోనం బే
ర్కొనని గెలిపించె నా(డు)వధి
షుణ్డగు నూరణ్డు శౌర్య సాగరుణ్డై.

4. ఓరుదు మాడలుం జెవద
పెష్ల(ను) నిం త్రియకాని (త)మ్ములో
పారయలేని పంచల గు
రాత్ముల దుర్వ్యసనసాయులను దురా
చారులం జెప్పనేర్చికి ల
సద్గుణధీరు......వీరగు
వ్యాకర(ణు)విశ్వకర్మణుల
వల్లభు నూరనిం జెప్ప డిమ్మహిన్.

పై విధముగ ఆ పద్యములను సవరించినను 'జితరిపుచేత' యను పద్యమునకు అర్థము గాని, యన్వయము గాని కుదురుటలేదు. ఎఱ్ఱమండజనపాలుడు శ్రీగిరి పశ్చిమదేశమునకు పతి-ప్రభువు కాడు. అతనిరాజ్యము కొండవీటి కొండలకు పశ్చిమమున నున్నది.

నేను మద్రాసులో నున్న యప్పుడు ఒక కళాశాలలోని తెలుగు ఉపన్యాసకు లొకరు నా యొద్దకు వచ్చి ఈ పద్యములను జూపి వీని కర్థము చెప్పుమని కోరినప్పుడుకాని నేను వీనిని పరిశీలనగ జూచలేదు. వేరువేరు కళాశాలలలోని తెలుగు ఉపన్యాసకులు వీని నెట్లు సమన్వయించి యర్థము చెప్పుచున్నారో నాకు తెలియదు. నా కీ పద్యములను జూడగనే ఎఱ్ఱమండభూపతి రాజ్య మేదో అదివరకె తెలియుటచేత 'శ్రీగిరి'కి శ్రీ పంతులుగారు సూచించిన 'శ్రీగిరి' యను సవరణ సరియైనది కాదనియు, పద్యము సుబోధము కాకుండుటచే నిది దోషభూయిష్ఠముగ నున్నదనియు తోచి శాసనమున నిట్లేయున్నదా యని కనుగొనవలయునను ఆత్రము కలిగి శాసన ప్రతిబింబము చూడవలెనను బుద్ధి పుట్టినది. అప్పటికి—ఇప్పటికి నేమో నాకు గుర్తులేదు—శాసనశాఖవారి ఆఫీసులో కొంతభాగము అదృష్టవశమున మద్రాసు సెంటుజార్జి కోటలోనే యుండెను. దక్షిణహిందూదేశ శాసనసంపుటములలో నదివరకు ప్రకటితములైన శాసనముల ప్రతిబింబములు కొన్ని యచ్చటనుండినట్లు తెలిసి యచ్చటి కరిగి ఈ శాసన ప్రతిబింబమును దీయించి చదివితిని.1

శాసనము చెక్కిన శిల ఇసుకరాయి యగుటవలన నేమో శాసనాక్షరములు పరిస్ఫుటముగ లేవు. శాసనమందలి కడపటిభాగము బొత్తిగా పాడుగా నున్నది. అక్షరములు దగ్గరదగ్గరగ నుండి వ్రాత పాడగనుండుటచేత సరిగ పాఠము విడదీయుటకు కుదురలేదు. ఈ కారణముచేత ఈ శాసనమునందలి పద్యములలోని కడపటి కందపద్యము నీ వ్యాసములో పొందుపరచుట మానితి.

కొన్ని దినములపాటు ఈ శాసన ప్రతిబింబమును పఠించి పరిశీలింపగా పరిశీలింపగా తుదకు ఈ శాసనపాఠము ఇదివరకున్న దానికంటె కొంత మెరుగుగా కుదిరినది.

1. దయతో నా కీ శాసనప్రతిబింబమును పరిశీలించుకొననిచ్చిన గౌర్నమెంటు శాసనశాఖాధిపతులకు అందుముఖ్యముగా శ్రీ వెంకట. వి. నరసింహస్వామి గారికి నా కృతజ్ఞతాపూర్వకవందనములు.

పద్యములు కొంతవఱకు సుబోధములైనవి. పూర్వ దానపత్రపద్యములలో రెండవదాని యందలి చేగిరి శ్రీ గిరి కావచ్చునది యూహ్యమైనది. నేను విపిదీసిన శాసన పద్య పాఠమును ఈ దిగువ పొందుపరచుచున్నాను.

1. శ్రీరమణీయుండా ఘలని
    ష్టాదకుండా న...శ్యచంద్రుండా సుజనా
  ధారుండా గన్నయపుత్రుండా
    సూరుండా నూ...పతికోప నూరక పేమ్మిర్గాని.

2. జితరిపుసేత మర్దలిక
    సంగముచే గిరిపచ్చిమాదనీ
  పతియగు వెల్లనుణ్డజన
    పాలకుచేత మహాప్రధానిక
  స్థితియును వంవలంబును వి
    శేవవిభూతియుం బేమ్మిర్గాలోవ ప్ర
  స్తుత మగుచుండెగా బవెసె
    నూరణ్డు పౌరుషధర్మ సారుడై.

3. తన...లోకవిధి
    తంబుగబ్బొప్పిచిన మణ్డపాగుణే
  జనపతి ప్రస్తవంబున శ్రీ
    శిస్తితి నవ్బెజవాడ నన్యసా
  ధనసుకీటాగలిం గురిమి
    తమ్ముల దానమున్ బోరిలోనం బే
  ర్కొ్ర్గాని గెలిపించె నాను నధి
    కుణ్డకు నూరణ్డు శౌర్యసారుడై.

4. బీరపుమాటలుం జెనటి
    పేన్ల(ను*) నింత్రియ కాని తమ్ములో
  పారయులేని పండల గు
    రాత్ముల గుర్వ్గావపాయులను దురా
  చారులం జెప్ప నేణ్టికి ల
    సద్గుణ ధీర...వీరగు
  వ్వార్గారణు విస్వకమ్మ్గాకుల
    వల్లభు నూరనిం జెప్ప ణ్డిమ్మహిని.

5. అనుపమసాహస స్ఫురద
    నమ్మిర్గామెయిం దలపోయ నా[జిం] చే
  కొ్ర్గాని కవువీరులై నెగడు
    కున్నలు బొంద్దంతోడ యీాడనం
  జను ననహోయ సాహసర
    సప్రియు మణ్డమహీతలేశు క
  ట్టనుంగు నుదగ్ర శౌర్యుర్గా సుధ
    టాగ్రణిం బ్రోలుపుత్రు నూరణిని.

6. రాజవిభూషణుణ్డు సుర
    రాజవిలాసుణ్డన స్తకీర్తిర్గా వి
  భ్రాజితుం డెల్లమంచెజన
    పాలకు నచ్చిన వజ్రదండ క
  న్నోజా సుతుణ్డా నూరని మ
    హోర్వ్గాప సన్నిధిం చె(?)న్గ్రా రాజ స
  తోవ్జి[ర్గా]ను విశ్వకమ్మ్గాకుల
    భూషణు వైరికేంద్ర భీషణున్.

7. గొడుగులు వంవలంబును న
    గుర్వ్గానుమున్న మహావిభూతియుం
  బ్బసెను విశ్వకర్మ్గాముని
    బార్వ్గాతి వల్లభు చేత విద్యమెయి
  గొడుగులు వన్దలంబును న
    గుర్వ్గానుమున్న మహావిభూతియుం
  బ్బసెను వెల్లనుణ్డజన
    పాలకు చేతను నూరం డెమ్మిర్గామెయి.

## 3

ఈ శాసనము వెల్లమంచెనృపతి భృత్యుడును, కన్నోజా ప్రోలముల కుమారుడును, విశ్వకర్మకుల వల్లభుడును అయిన నూరడు చేబ్రోలి కుమారస్వామికి అఖండదీపమునకై గొఱ్ఱెలను దానము చేసిన విషయమును దెలుపుటకు పుట్టినది. ఈ విషయమును దెలుపు సీసపద్యము శాసనపద్యమంజరిలో ఆరవసంఖ్య శాసనముగ నీయబడినది. ఆ పుస్తకములో ఆరవ, ఏడవసంఖ్యలవి రెండును గలిసి ఒకటే శాసనము. ఈ శాసన కాలము శకవర్షము 1040 (శకమహీపాలకసంవత్సరంబులు గగ నాబ్ధి వియ దింగుగణన దనర). ఈ సీస పద్యమున నూరడు "శూద్రక ప్రభృతులతోడికులము వాడ(?ను)ను కలితనమువా" డనియు, "మంచ భూపాలకు మహనీయ సామ్రాజ్యరాజ్యాభివృద్ధిపరాయణు"డనియు, "అతులశౌర్యసాగు" డనియు, "గుంద్రయసు" డనియు వర్ణితుడయినాడు. ప్రాచీనకాలములో విశ్వకర్మకులజులు కూడ మహీపతుల కొలువులో చేరి సంగ్రామరంగమునం దనుపమ శౌర్యసాహసములను జూపి విక్రమించి తమ ప్రభువులకు విజయము చేకూర్చి వారివలన అనేక గౌరవమర్యాదలను పొందుచువచ్చిరి. అట్టివారిలో ఈ నూర డొకడు.

# ఎఱ్ఱమండ భూపతి చేబ్రోలు శాసనము

క్రీ. శ. 1118 (శకవర్షము 1040)లో మొదటి కులోత్తుంగచోళభూపతి తన కుమారుడైన విక్రమచోళ నరేంద్రునికి యౌవరాజ్యపట్టము కట్టెను. నాటినుండి యువరాజు తండ్రితో గలసి రాజ్యవ్యవహారములను చక్కబెట్టుచు వచ్చెను. వేంగిని రాజప్రతినిధులుగ పాలించుటకు చక్రవర్తి తనయులైన రాజకుమారులింకెవ్వరును లేకైరి. అందువలన పూర్వచాళుక్యుల వేంగీరాజ్యము మాండలికుల పరిపాలనక్రిందనే యుండి పోయెను.

అంతవఱకు పూర్వమువలెనే వేంగిని వశపఱచు కొనుటకు అనేక ప్రయత్నములు చేసి విఫలులైన పశ్చిమచాళుక్య చక్రవర్తులలో కులోత్తుంగచోళ చక్రవర్తికి సమకాలికుడును, ప్రబలశత్రువును, త్రిభువనమల్ల బిరుదాంచితుడును అయిన ఆఱవ విక్రమాదిత్య చక్రవర్తికిపుడు మంచి యవకాశము లభించినది. కులోత్తుంగ చోళునికి సరియైన ఉజ్జీ విక్రమాదిత్యుడు. ఈతని యాస్థానకవియైన బిల్హణకవీంద్రుడు విక్రమాంకదేవ చరితమను పేర నతని జీవితచరిత్రము సంస్కృతమున రచియించెను. విజ్ఞానేశ్వరీయమను పేర యాజ్ఞవల్క్య స్మృతికి వ్యాఖ్యానమును రచించిన విజ్ఞానేశ్వరుడు కూడ విక్రమాదిత్య చక్రవర్తి యాస్థానకవే. విక్రమాదిత్యుని యాస్థానములో బిల్హణుని వంటి కవిచక్రవర్తులే కాక సాహసవిక్రమాఢ్యులనేకులు. గడిచిపోయిన కులు కూడ నుండెడివారు. అట్టివారిలో నొక, యింకొ దండనాయకుడు అనంతపాలుడను ఒకడు. విక్రమేంద్ర చక్రవర్తినియోగమున అనంతపాలదండనాయకుడు సేనలను గూర్చుకొని వేంగిదేశముపై దండెత్తివచ్చెను. వేంగిదేశములోని దుర్గములొక్కొక్కటిగ శత్రువులకు వశమగుచు వచ్చినవి. ఈ దండయాత్రాసందర్భమున పశ్చిమచాళుక్య సేనకును, మాండలిక సేనకును పోరు జరిగిన ప్రదేశములలో బెజవాడలో జరిగిన పోరిలో ఎఱ్ఱమండభూపతిని పంపున అతని కట్టనుంగు సూరడు దండుగూర్చుకొని శత్రువులతో తలపడెను; శత్రుభటావలిం దునిమి తన ప్రభువునకు గెలుపు చేకూర్చెను. జనపాలుడందుకు మెచ్చి యతనికి 'మహాప్రధానిస్థితియును, అందలమును, విశేషవిభూతియు' ననుగ్రహించెను. విశ్వకర్మకులతొల్లి పార్వతీవల్లభుని చేత 'విశ్వమై' 'గొడుగులు, అందలము, మహావిభూతియు' బడసిన విధమున అనన్తకీర్తి విభ్రాజితుడు 'ఎఱ్ఱమండజనపాలకు నచ్చిన వజ్రదండు' సూరడు 'అర్కమై' ఆ జనపాలునిచేతను 'గొడుగులు, అందలంబును, మహావిభూతియు' బడసెను. 'శాసనపద్యమంజరి' ఏకశతసంఖ్యశాసనములోని విషయము ప్రధానముగ విశ్వకర్మకులవిభూషణుడైన సూరడి ప్రశస్తి.

# ఘ ట న

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

...ట్టు పంతులుగారు! కన్యా
...ల విప్పించండి" అనడిగాడు మొగపెళ్లివారి పురోహితుడు.

"అది మా మామగారితో మనవి చెయ్యండి మీరు" అని మాత్రం అని వూరుకున్నాడు, పెళ్లికొడుకు తండ్రి, కొండుభొట్లు.

"వీరప్ప యాజులుగారితో మనవి చేసుకుంటున్నా" నన్నాడు, పురోహితుడు.

ఆజానుబాహువు మనిషి యాజులు.

పంచె కట్టాడు; కాని లాంగ్‌కోటు తొడిగి, పాగా చుట్టుకుని వున్నాడు అతను.

జానెడేసి పొడుగున్నాయి మీసాలు, వెండి తీగల్లా. సహజంగా లౌక్యుడతను, చదువుసంధ్యలు తక్కువయినా, వేషానికి మాత్రం లౌక్యుల్లాగే వుంటాడు, స్వప్రయత్నంగా.

ప్రతిభావంతుడని పేరూ వుందతనికి, దానికి మాటున రాజసం చిన్న బిగువూ వుంది.

"జరిగించెయ్యండి" అన్నా డతను, చెయ్యూపుతూ.

పురోహితుడు సభాపతికేసి చూశాడు.

"గ్రామత్త్వేనా పదిరూపాయ లిప్పించండి" అన్నాడు సభాపతి.

పురోహితుడు తనకేసి తిరక్కముందే "పెద్దలకు అణాచొప్పున ఇప్పించండి" అన్నాడు యాజులు.

ఇది విని, సభాపతి, కళ్లు మూసుకుని తలఅడ్డంగా వూపుకున్నాడు.

"సభాపతిగా రంగీకరించడం లేదు యాజులు బాబుగారూ!"

"ఏమో?"

"కన్యావరణలూ, సభాకట్నాలూ వూరుమ్మడి మీద పుచ్చుకోడం వుంటుంది, కొన్ని వూళ్ళలో."

"అయితే?"

"ఎంతో కొంత మొత్తం సభాపతిగారి కందించాలి, ముందు మనం."

"తరవాత?"

"గౌరీపూజామంటపం దగ్గిరికి, పెళ్లి ప్రవర పూర్వకంగా వగాని పేరు చెప్పి పిల్ల నడగడానికి, ముగ్గురికో, అయిదుగురికో, మరికొందరికో, ప్రత్యేక ప్రత్యేకంగా కన్యావరణ లిచ్చి పెద్దలను కూడా పంపాలి, మనం."

"అదంతేసి?"

"వరహా లివ్వవచ్చు, రూపాయ లివ్వవచ్చు, అర్ధలు - పావులాలు - బేడలు - అణాలు - అర్ధణాలు కానులు చివరికిప్పటి మానం ప్రకారం కొత్తపైసలున్నా యివ్వవచ్చు"అని బదులు చెప్పాడు సభాపతి పురోహితుడికేసి చూస్తూ.

యాజులు మొగం చిట్లించుకున్నాడు.

ఈ మర్యాదలు తెలియనివి కావతనికి.

కాని, సభాపతి సూటిగా తన్నెక్కపోడం.

తనకేసి చూడకపోడం, తరవాతి దైనా.

పోనీ అంటే, కొత్తపైసల మాటయెత్తడం.

ఆయన తనని లోభికింద కట్టాడనుకున్నాడు.

అది పరాభవంగా భావించుకున్నాడు.

అభిమానం తెచ్చుకున్నాడు.

ఆగ్రహం కూడా? పెంచు న్నాడు, చివరికి.

దీంతో "రెండువిధాలా యివ్వలేమని చెప్పండి" అన్నాడు, తానున్నా పురోహితుడికేసే చూస్తూ, యాజులు.

"ఇవ్వం అనే చెప్పండి"అని కూడా అన్నాడతను, కొంచెం దురుసుగా.

సభాపతి మాట్లాడలేదు.

సాలోచనగా పక్కకి చూశాడతను, కొంచెం కిందుగా.

అలా వుండే కళ్ళుమూసుకున్నా డొక్కమాటు.

చివరికి, తన దాపులే వున్న వృద్ధపండితుడి కేసి పులుకూ పులుకూ చూసి వూరుకున్నాడు.

"తరతరాలుగా వస్తున్న ఆచారం యిది మావూళ్లో. ఇవాళ హఠాత్తుగా మారవలసిన అగత్యమూ లేదు. మారనూ మారదు" అన్నా డా వృద్ధపండితుడు సభాపతికేసి చూస్తూ.

# ఘ ట న

"మావూరి మర్యాదలు వేరు. మేము పాటించు కోవలసిన పని."

వీరప్పయాజులిలా అన్నాడు, కాని అతను మాట ముగించక పూర్వమే "కాదుకా" దన్నాడు, మరో పెద్దమనిషి.

"ఏమి కాదు?"

"మా గ్రామంలో — అంటే పెళ్ళికొడుకు స్వగ్రామంలో కూడా రెండు విధాలా యిద్దేమే ఆచారం."

"కావచ్చు. వ్యవహారం నడుపుతున్నవాణ్ణి నేను. ఈవూరి మర్యాదలతో నాకు ప్రసక్తి లేదు."

మరెవరూ మాట్లాడలేదు.

వ్యవహారం నిలిచిపోయింది.

గడియారమే ఆగిపోయినట్టయింది.

పులుకూ పులుకూ చూశాడు పెళ్ళికొడుకు, తండ్రికేసి.

"అబ్బాయి—" అన్నాడు కొండుభట్లు పురోహితుడితో.

"పెళ్ళికొడుకే కాదు, నేనూ తొందరపడుతున్నాను, కాని వ్యవహారం నావశం తప్పింది. దిగ్గంతులవంటి పండితులు కూచుని వున్నారు సభలో. లోకంలో నేను తలెత్తుకుని తిరగాలంటే నా బాధ్యత కూడా వుందిక్కడ. సభాపతిగారూ మీమామగారూ కూడా అనుజ్ఞ దయచేయిస్తేనే, ముందు కడుగు వెయ్యగలం నేను" అని స్పష్టంగా చెప్పాడు పురోహితుడు.

"మాకు తోచింది మేమిస్తాం" అన్నాడు యాజులు, బెట్టుగా.

"తమ కౌమార్త పాణిగ్రహణం సంవర్భంలో ఆశీర్వచనం చేసి, వెళ్ళవలసిందన్న కన్యాదాత పిలుపు మీద వచ్చాం మేము. మావిధి మేము మరిచిపోలేదు. తప్పదు కూడా. అయితే, ఈవూరి మర్యాదలతో తమకు ప్రసక్తి లేదన్నవారి వూరి మర్యాదలతో మాకూ లేదు, ప్రసక్తి."

సభాపతి యింగితం గుర్తించి వూరి వృద్ధపండితుడిలా అనగా, అందరి చూపులూ యాజులుమీద పడ్డాయి, గోదావరిజల్లులాగ.

ఆలోచించాడు యాజులు.

వివహం తప్పించాలనుకున్నాడు.

"సుముహూర్తం దగ్గిరపడుతోంది, కానివ్వా" లన్నాడతను, కొంచెం గట్టిగా.

"నా అభ్యంతరం యేమీ లేదు. గడిచిపోయిన కాలం నేను కూడతీసుకోగలను. కనక, యింకో మాటు చెబుతున్నాను. ఊరివారి అనుజ్ఞ లేకుండా తంతు నడిపించుకోనివ్వడం అతి సాహసం అవుతుంది" అని మళ్ళీ చెప్పాడు, పురోహితుడు.

"మరి తంతుమాట? సుముహూర్తం—దాటిపోతే దాని కెవరూ బాధ్యులు?"

అందరూ వులిక్కిపడ్డారిది విని.

చూడగా, అయిమూలమొగం పెట్టుకుని నిలవ తీస్తున్నట్టు చూస్తున్నాడు కొండుభట్లు.

అసల్లో రెవెన్యూ తహాసీల్దారతను.

తాను పనిచేసిన తాలూకాల్లో చండశాసనుడనే పేరుం దతనికి.

కాని యిది అతను పనిచేసిన వూరు కాదు.

ఇది సభ కాని తాలూకా కచేరీభవనమూ కాదు.

తన పట్టు కయినా తహాసీల్దారూ కాదత నిప్పుడు.

నిజానికిది అతనికొడుకు పెళ్ళి.

అయితే, మొగపెళ్ళివారిలో భోజనాలకు పిలుపు వస్తే యెవరిముట్టుకి వారే ముడికట్టుకుంటారు, తక్కినవారు.

అతను మాత్రం యాజులు కూడా పిలిస్తేనే సిద్ధపడ్డం.

ఏమయినా, అతని చేవ్రాలుతో వున్న ఆహ్వాన పత్రిక. అందుకునే వచ్చారు, చాలామంది పెద్ద మనుష్యులు.

వారిలో కొందరతనిలాగే "రిటైర్డు" బాపతువారయినా, ఇప్పుడు పనిచేస్తున్నవారూ వున్నారు, చాలామంది.

కొన్ని తాలూకాకచేరీల గుమాస్తాలూ వున్నారు.

మరి, తాను కూడా వారిలాగే శ్రోతా ద్రష్టా అయిమాత్రమే కూచోవడమా?

ఇదిగో, యీ తపనతో తన పెత్తనం యిలా చూపించుకున్నాడతను.

"ఒక్క సంగతి మనవిచేసుకుంటా" నంటూ అందుకున్నాడు, పొరుగూరు ప్రౌఢవిద్వాంసుడొకడు—ఇది తెలియక.

"లౌక్యాన్ని పట్టిలాగే వైదికాన్ని పట్టీన్నీ వొక్కొక్క వూరి కొక్కొక్క పద్ధతి యేర్పడి వుంటుంది—"

"అయితే, యేమిటండీ?" అంటూ గద్దించాడు యాజులు.

"ఏమిటో వినతలుచుకున్నారా మీరు?" అని ముదలకించాడు పండితుడు.

"చెప్పండి చూతాం."

"అయితే, నేను చెప్పేదంతా వినండి ముందు."

"చెప్పమన్నాగా?"

"ఈవూరు వచ్చారు మీరు. ఇక్కడివారికే మీరు కన్యావరణ లివ్వడం. కనక, సభాపతిగారి మాట విశ్వసించడమూ అంగీకరించడమూ మీకు ధర్మం."

"ధర్మం అంటే యెక్కడికి? మేమివ్వడానికి సిద్ధంగా లేమనా మీ వూహ, పోనీ?"

"మరి, సాహసించకపోడానికి కారణం?"

పక్కకి చూస్తూ వూరుకున్నాడు యాజులు.

"ఇంకొకటి కూడా వుంది" అంటూ అందుకున్నాడు వూరి యువకుడు.

"పదు లడిగితే పాతికలూ, పాతిక లడిగితే నూట పదార్లూ ఇచ్చినవారు కూడా వున్నారు, ఈవూరి విద్వాంసులు."

కళ్లు మూసుకుని, సభాపతి, తలతాటించుకున్నాడామాటకి "అవు" నన్నట్టు.

"అడిగింది యివ్వనివారు లేరంటారా?" అనడిగాడు యాజులు, అవ్యవధానంగా అందుకుని.

"ఉండరూ? ముఖేముఖే సరస్వతీ కదా?"

"సరస్వతి మాటకి తల వూపవలసిందేగా అందరూ?"

గభీమని లేచాడొక యువకుడు.

మంచి వర్చస్వి అతను.

మెరుపు దీపాల వెలుగులో కళ్ళు జిగాల్ జిగాల్మనిపించేస్తోంది అతను కప్పుకుని వున్న వూదారంగు జరీ కాశ్మీరుశాలువ.

మొదట చాలా చురుగ్గా చూశాడతను.

సభ అంతా సావధానం అయినట్టు తోచగానే వొక్కటే మాట అన్నాడతను, అతిఖండితంగా "మీరడిగినంతా ముందే పుచ్చుకుని వచ్చారు మీ రీవూరు, కనక, మే మడిగినంతా కూడా మాకిచ్చి మావూరి పిల్లను చేసుకుని వెళ్లండి మీవూరు" అని.

సభ అంతా చకితం అయిందామాట విని.

గుసగుసలు రేగాయి, అంతటా.

బహుముఖాల తాండవం ప్రారంభించింది, చివరికి సరస్వతి.

రెండే మాటలు వినపడ్డా యీ కోలాహలంలో అందరికీ "ఇవ్వం" అని వొకటీ "అలా యిస్తేనేగాని పుచ్చుకోం" అని వొకటీని.

## 2

"అదేమే, పిల్ల మొగాన సంబరమే కనబడదేమే?" అనడిగిందొక ముత్తయిదువ, అపవారించి పెళ్ళికూతురి తల్లిని.

"వయసు వచ్చిన పిల్లగదా, పెళ్ళిలో సిగ్గుపడదూ పిన్నీ, నా బిడ్డ?"

"ఏమో, నవ్వు మందకొడిగానే కనపడుతున్నాదే."

"నెత్తిమీద యింత బరువెత్తుకున్నాను గదా—"

"లక్షలు పోసి పెట్టి కొనుక్కుంటున్నాడు నీ మొగుడు, బాధేమిటే నీకు?"

"లక్ష లుంటే తీరిపోయిందా, మొగపెళ్ళివారిలో పిల్లా మేకా కాక, పేరంటాళ్లే యాభైమంది వున్నారు. తగిన మర్యాదలు చేసి వారిని సాగనంపడం యెలాగో, ఆందోళన కలుగుతోందమ్మా నాకు?"

గౌరీపూజ ముగిసింది.

సభక్తికంగా నాందీ దేవతారాధన పూర్తిచేసుకుని, పీటలమీదినుంచి లేచివెళ్ళి యెందుకో యెవరితోనో మంతనాలు సాగిస్తున్నాడు కన్యాదాత.

"పెసరట్లు లేకపోతే తెల్లవారదేమే గాని పొద్దు గడవదుట వియ్యపురాలికి. కొంపతీసి మరిచిపోలేదు గదా తమ్ముడూ!" అనుకుంటూ కొట్టు పెత్తనదారు కోసం వంటపందిటిలోకి బయలుదేరింది పెళ్ళికూతురి తల్లి.

"మరదలా," అని పిలుస్తూ ఆమె వెంటబడింది మరో ముత్తయిదువ.

"ఏమే, మా చెల్లెలి కొడుకు కిరీటి పనికివచ్చాడు కాదూ నీ చిన్నకూతురికి?" అని కూడా అడిగిందామె, కంఠం నొక్కుకుంటూ.

"అదేమిటి వదినా అలా అడుగుతావూ నువ్వు? కిరీటివంటి పెళ్ళికొడుకుని సంపాదించుకోగలమా మేము? పిల్ల చూపంతా అతనిమీదే వుందమ్మా యిప్పటికీని?"

"మరి, యిలా యెందుకు జరుగుతోందీ?"

"మా పెద్దల్లుడు వుద్యోగస్థుడు, నువ్వెరుగుదువు. చిన్నల్లుడు కూడా వుద్యోగస్థుడే అయి వుండాలిట మీ తమ్ముడుగారికి. శతపోరాన్నేను, వినిపించుకుంటేనా?"

"నలభై యకరాల మాగాణి—ముద్దులుమూటకట్టే మేడ—యాభై అరవై వేలకు తక్కువలేని నగ—"

"మే మెరగమటమ్మా? ఘటన లేదనుకోవాలి."

"పెళ్ళికి రమ్మని పిలిచారు కామోసు మీరు, సభలో కూచుని వున్నాడు మా నాయన. వాడియెదట మీరు తెచ్చిన పెళ్ళికొడుకు—"

"తీసికట్టు, సరా?"

"రెండో పెళ్ళివాడని సంకోచించి వస్తున్నాడు, మా తమ్ముడు. పాతికేళ్ళు నిండలేదు నాయనకు."

"అదేమీ కాదమ్మా, రెండో పిల్లనయినా యీ వూళ్లో యిచ్చుకుందామని మహావుబలాటపడ్డాన్నేను. పిల్ల రాతా నా రాతా యిలా వున్నా యేమి చెస్కోనూ?"

"పద్దెనిమిదేళ్ళు నిండిన పిల్లగదా, సంబంధమే కనపడకే మొగానా? నే నెరగనివా దాని మురుకుదనమూ, దాని వుబలాటమూ—"

"పీటలమీదకి వెళ్ళాక యేమవుతుందో నా బిడ్డ, మతి పోతోందమ్మా నాకు."

"మెడలు వంచారు కామోసు మీరు, అడ్డం చెయ్యగలదులే, పసిపిల్ల పాపం?"

"పిలవడానికి వెళ్ళగా 'నేను రాలేను వదినా, మరోలా? అనుకోకు' అంది మీ చెల్లెలు. కిరీటికి తండ్రి లేకపోవడం నిజమే అనుకో, నే నర్థంచేసుకోలే దనుకున్నావా మీ చెల్లెలి వూహ?"

"తనకి కట్నం అక్కర్లేదన్నాడు కిరీటి 'ఆ మహాలక్ష్మి తన యింట్లో అడుగు పెడుతుం' దనుకుంది నా చెల్లెలు."

"మూడువందల రూపాయల జీతగాడిని పెళ్ళికొడుకుని చూసి మురిసిపోతున్నారు మీ తమ్ముడు, నిన్న తెల్లవారింది మొదలు అన్నం ముట్టంలేదు, నా బిడ్డ తెలుసా?"

"పదివేలు పోసి కొని తెచ్చుకున్న మొగుడు, కాఫీ వుపమాలూనే గాని అన్నం ముట్టుతుందా యేమిటది యింక?"

## 3

"ఏమి టేమిటి?" అని ఆత్రంగా అడుగుతూ వచ్చాడు గౌరీపూజా మంటపం దగ్గిరనుంచి కన్యాదాత.

"కన్యావరణం దగ్గిర ఆగిపోయివుందండి తంతు" అని బదులు చెప్పాడు తన పురోహితు డతనికి.

"కారణం?"

"గ్రామస్థు లడిగిన మొత్తం వరపక్షంవా రివ్వరట. వరపక్షం వారిచ్చేది గ్రామస్థులూ పుచ్చుకోరట"

"ఇంత అని నిర్దేశం—"

"పదిరూపాయ లడిగారు గ్రామస్థులు. తమకు తోచిం దిస్తారట వరపక్షంవారు. అదయినా గ్రామస్థ్వేనా కాదుట, అణా చొప్పున యిస్తారట."

అటు చూసి యిటుచూసి "బావగారూ" అని పిలిచాడు కన్యాదాత, పెళ్ళికొడుకు తండ్రిని.

"మీరు చెప్పదలిచిందేదో నాతో చెప్పండి" అన్నాడు యాజులు వ్యవధానంగా, కళ్ళు పెద్దవి చేసుకునీ, తర్జనితో తనని నిర్దేశించుకుంటూను.

కన్యాదాత తన మామగారికేసి చూచి వూరుకున్నాడు.

ఆవూరి కరణమే అతని మామగారు.

అసలీసంబంధం కోరి కుదిర్చినవాడే ఆ కరణం.

అటూ యిటూ మాతామహు లయివున్నా రిద్దరూ చూసుకున్నారు గంభీరంగా,

"నేను మీకు చెప్పవలసినవాణ్ణి కాను" అన్నాడీ మాతామహుడు.

"నేను మీచేత చెప్పించుకోవలసినవాణ్ణీ కాను" అన్నా డామాతామహుడు.

"వ్యవధి లేదు మరి" అన్నాడు కన్యాదాత పురోహితుడు.

"మన కా ఆందోళన అక్కర్లేదు, మిథునం కూడా తారాబలచంద్రబలయుక్తంగానే వుంది" అని బదులుచెప్పాడెందుకు వరపక్షంవారి పురోహితుడు, యాజు లందుకోకుండానే.

"నా కనుష్ఠానసమయం అవుతోంది, మరి" అంటూనే లేచాడు సభాపతి.

"మిథునమే స్థిరపరిచారా?" అనడుగుతూ తానుకూడా లేవడాని కుద్యుక్తు డయినాడు, పొరుగూరి వృద్ధపండితుడు.

"ఆందోళన అక్కర్లేదన్నా నంతే" అని మళ్ళీ బదులు చెప్పాడు వరపక్షం పురోహితుడు.

"ఏమి సెలవు?" అనడిగాడు కన్యాదాత, చేతులు దోయిలించుకుని యాజులుని.

"చెప్పానుగా?"

అసంతృప్తి—విసుగు—నిరసనభావం - అసహనం—ముంగోపం—మూతిముడుపులు—ఇన్ని ప్రతిఫలించాయి, సభాముఖాన.

"మనం వైదీకులం, ఇది వైదికతంతుకి సంబంధించిన విషయం. మీరు కొంచెం ఆలోచించాలి" అంటూ వేసుకున్నాడు, గ్రామకరణం.

"ఎంత దూరం ఆలోచించాలో అంత దూరమూ ఆలోచించే స్థిరపరిచా న్నేనీ విషయం" అంటూ తివాసీ సర్దాడు యాజులు.

## 4

ఉత్తరప్రతసారాలో పై:స్వామి సన్నాయి ఆగిపోయింది.

దక్షిణపు తెంపిలో అమ్మాణ్ణి మేజువాణీ కూడా నిలిచిపోయింది.

"ఏమిటేమి?" టనకుగుతూ దూసుకువచ్చారు చాలామంది పెళ్ళిపెద్ద లుభయపక్షాలవారూ.

వారిలో వొక సబ్‌మాజిస్ట్రేటున్నాడు.

ఒక సర్కిల్ ఇనస్పెక్టరున్నాడు.

ఏ డెనమండుగురు అడ్వకేట్లున్నారు.

అయిదారుగురు డాక్టర్లున్నారు.

పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లే వున్నారు పదిమందికి పైగా.

ఒక బుగ్గమీసాల ముస్నద్దీ కూడా వున్నాడు.

"దయచెయ్యండి రాజాబాబూ" అంటూ వచ్చాడా ముస్నద్దీ, ఒకక్షత్రియ ప్రముఖుడికి తహజీమిస్తూ.

ప్రశ్నలు—ఆందోళన—జిజ్ఞాస—ఆత్రం—అభావం—కంగారు—అసంతృప్తి—వెటకారం—ఇన్ని చిత్తవృత్తులు లాస్యం చేస్తున్నాయి వారందరి మొగాలమీదా.

వరుని వూరి పెద్దకరణం ఆ ముస్నద్దీ.

ఆవూరి మున్సబా క్షత్రియప్రముఖుడు.

కానయితే మూడో వరసలో కూచున్నాడు ముస్నద్దీ, కాని, కొంకుభట్లు, ముందటు మామగారిని చూసి, తరవాత తనకేసి చూసిన చూపందుకుని "ఏ స్థితిలోవున్నాం బ్రహ్మగారూ మనం?" అనడిగాడు పురోహితుణ్ణి, ముందు తానాసనశుద్ధిగా కూచుని.

పురోహితుడు చెప్పాడు.

"ఊరివారికీ మొగపెళ్ళివారి పక్షం పెద్దలకూ మాటపట్టింపులు వచ్చాయి కన్యావరణల దగ్గిర, మరి" అనిన్నీ వివరించా డతను.

"అలాగా?" అన్నట్టు తల పంకించుకున్నాడు ముందు ముస్నద్దీ.

"దుంపలు దంపలుచేసుకుని తరలివచ్చాక—మంగళస్నానాలయినాక—ధర్మప్రజాసంపత్తికోసం ఒక స్త్రీని పెళ్ళిచేసుకుంటా నంటూ వరుడు సంకల్పం చేసుకున్నాక—పిల్లను చూసిపెట్టం డని కోరి పెద్దలను రాయబారం పంపవలసిన స్థితిలో—వరుడు మాకుమున్ను వెయ్యాగలిగేటట్లు సన్నివేశాలు కల్పించుకోవలసిన మొగపెళ్ళివారికి పట్టింపులు."

"చిత్రం" అన్నాడు పొరుగూరి విద్వాంసుడు.

"ఆడపెళ్ళివారితో నయినా కాదు, వూరివారితో పట్టింపులు."

"చిత్రం—చిత్రం"

సభ అంతా చలితం అయిం దీయుక్తగట చూసి.

ఎగిసిపడి విరగబడి మాటాడు యాజులు.

అది గుర్తించాడు ముస్నద్దీ.

"సద్దుకోవం ధర్మం" అన్నా డతను, తాపీగా.

"తమరు చాలా ధర్మంగా సెలవిప్పించారు" అన్నాడు విద్వాంసుడు.

"మరి. తరవాయి?" అని మళ్ళీ అడిగాడు ముస్నద్దీ.

"ముందడుగు వెయ్యవలసినవా రెవరో గమరు నిర్ణయించడం."

"మరి ముందడుగు వెయ్యాడం అంటే?"

"వెనకతీత అన్నమాట."

"అదీ మాట. వెనకతీత వున్నచోటే సాచి అడుగు పడుతుంది ముందుకి"

"పోనీ అంటే వూరివిద్వాంసులు—"

"వారు బాగా తెలుసు. ఈవూరి విద్వాంసులు పుంభావసరస్వతులు. ఇక సభాపతిగారా, సాక్షాత్తూ బృహస్పతే. కనుక వారు సెలవిప్పించినట్లు నడుచుకోవలసినవాణ్ణే కాని, వారికి చెప్పవలసినవాణ్ణి కానేను."

"చిత్రం" అన్నాడు మళ్ళీ పొరుగూరి విద్వాంసుడు సాగతీసుకుంటూ.

గతుక్కుమనిపోయాడు యాజులు.

తమపక్షంగా వచ్చిన పెద్దమనిషే తమమీద—ముఖ్యంగా తనమీద దోషారోపణ చెయ్యడం.

కొట్టినంత పనయింది యాజులుకి దీంతో.

పైగా, ముభావంగా మాట్టాడుతున్నాడు ముస్నద్దీ.

కనక?

"వా రడిగినంతా? యివ్వవలసినదేనా?" అనడిగా డతను, తానూ ముభావంగానే.

"వా రడిగినంతా యివ్వవలసిందేనా? అని కాదు, చూడుకోవలసిం దిక్కడ, వారిచేత అడిగించుకోవలసిందేనా?" అని.

"పండితులకు సంభావన యివ్వడం అంటే నాకెంత యిష్టమో—"

"కన్యావరణ లివ్వడం అంటే పండితులకు సంభావన యివ్వడం కాదు యాజులుబాబుగారూ" అన్నాడు పురోహితుడు.

"మరేమిటండీ కాకపోతే?"

చాలా గట్టిగా అడిగా డతనీమాట.

గద్దించి మరీ అడిగాడు.

"ఏమిటీ వుమ్మడిస్సు?" అన్నట్టు చూశాడు ముస్నద్దీ, యాజులుకేసి వోరకంట.

"అయ్యా, యాజులుబాబుగారూ, మీ మనమడు పెళ్ళిచేసుకోబోతున్నా డిప్పుడు. అందుకో పిల్ల కావాలతనికి. మంచిపిల్లను చూసిపెట్టండని రాయబారాలు నడపగల సుహృదులను ఏరుకుని ప్రార్థించాడు వారిని. ఎక్కడి కక్కడికో వెళ్ళమని అతని ప్రార్థన. దారిఖర్చులు కావాలి వెళ్ళాలంటే వారికి. మీ మనమడే యివ్వాలందుకొంత డబ్బు. నేను కన్యావరణ లిమ్మన్నానే, అది. అలా యివ్వవలసిన డబ్బన్నమాట. అది సంభావన యెలా అవుతుంది? డబ్బేమో మీ మనమడిదీ, మీ మనమడే యివ్వవలసిందీని. అది మీ చేతిలో వుంది మరి, యిప్పుడు. అంచేతనే మిమ్మల్ని అడగవలసివచ్చింది నాకు."

చిరునవ్వు కనపరుస్తూ చెప్పాడు పురోహితుడీ మాటలు.

వెటకారం వుందా చిరునవ్వులో నిగూఢంగా. అది గమనించాడు ముస్నద్దీ.

అతని బుద్ధి చమత్కృతం అయింది దీంతో.

"అయితే, కొంత పాగస్త పూతపెట్టాలి దానికి, తాను.

అయితే, యాజులుగారికిది తెలియదనేనా బ్రహ్మగారూ, మీ వూహ?" అనడిగా డతను, సాకూతంగా చూస్తూ.

"వారికి తెలుసునా తెలియదా? ఇది కాదు పంతులుగారూ నేను చూసుకోవలసింది. వివాహం తంతుకి సంబంధించి యెవరికే జిజ్ఞాస కలిగినా — అగత్యం అని నాకే తోచినా, యిక్కడ యింతమంది పరసులున్నారు కనక — నేను బ్రహ్మాసనం అధిష్ఠించిన్నీ వున్నాను కనకగూడా, అది వివరించడం నా విధి, నా బాధ్యతానూ" అని బదులుచెప్పాడు పురోహితుడు.

"ఒక్క సంగతి మనవిచేసుకుంటాను సెలవయితే?" అంటూ అందుకున్నాడు పాలుగూరి విద్వాంసుడు మళ్ళీ.

"సెల విప్పించండి" అన్నాడు ముస్నద్దీ.

"సభాపతిగారు పది రూపాయ లిమ్మన్నారంటే, అది, వారి సొంతానికి కాదు. వారు ఈవూరి బ్రాహ్మణ్యానికి కంఠమూ కిరీటం లేని రాజు. వారసత్వేనా మాత్రమే కారు వారు సభాపతులు, సర్వాత్మనా వారే అందుకు తగ్గవా రిప్పుడీవూళ్ళో. అశీతివ్యయమూ కత్తులమీద పరీక్ష యివ్వగలరు వా రివాళ కూడా. శ్రౌతమున్నా అంతా వారికి వాచోవిధేయమూ, కొట్టిన పిండిన్నీ. చయనం చేసివున్న — సర్వతోముఖమున్నా చెయ్యబోతున్న కర్మిష్ఠులు వారు. అగ్రహారీకుల్లో వొకరు. ఈవూరి పెద్ద స్థితిపరుల్లో కూడా వారొకరు."

"నమో మహద్భ్యః" అన్నాడు ముస్నద్దీ, సభక్తికంగా అంజలిబంధం శిరస్సున కీలించుకుని.

"గడపచీరల పద్ధతి ఎంతో సంప్రదాయపరిజ్ఞానం వున్న సంపన్నులుగాని గుర్తించలేరు. తమ రది ఆచరించే వున్నారు, కనక, మనవిచేసుకుంటున్నాను. తమ అయిదుగురు కుమార్తె పెళ్ళిళ్ళలోనూ ఆచరించి వున్నవారు సభాపతిగారు."

"పరమ ప్రామాణికులు వారు" అంటూ మళ్ళీ అంజలిబంధం శిరస్సున కీలించుకున్నాడు ముస్నద్దీ.

'ఈవూరి బ్రాహ్మణ్యంలో వచ్చిన సభాకట్నం అంతా — కన్యావరణల మొత్తమున్నా అంతా ఈవూరి నూటయాభైయిళ్ళ బ్రాహ్మణ్యానికి పంపకం అవుతుంది సంవత్సరాని కొకమాటు."

"అవును, ఎక్కడా అంతే అది."

"ఇక్కడి విశేషం యేమిటంటే? మహాశివరాత్రి పర్వదినాన అదంతా పాలుగూరి విద్వాంసులకు వినియోగం అవుతుంది, యథోచితంగా."

"అదీ విన్నాను."

"అదిగో, అందుకోసం యీవూరి బ్రాహ్మల అంతస్థు కాపాడాలి సభాపతిగారు. తరలివచ్చినవారి దర్జా కాపాడాలి. అందరి క్షేమమూ కోరాలి."

"కనక?" అనడిగాడు యాజులు పురపుర చూస్తూనూ, తల యెగరవేసుకుంటూనూ.

"వారు చెప్పింది విశ్వసించడమూ, అంగీకరించడమూ ధర్మం యెవరికయినా."

"ధర్మం అంటే యెక్కడికి?"

"ఇందాకా అడిగేవున్నారు మీరీమాట. ధర్మం వొక విధంగా గహనమూ, మరో విధంగా విశదమున్నూ. దాని పరిధులు గుర్తించే శక్తి బాధ్యతా బుద్ధివి."

"పది రూపాయలని వారు పేరు పెట్టడం ధర్మంగా వుందా?"

"నిక్షేపంగా వుంది."

"అంతేనా మా తాహతు?"

తేరిచూశాడు పండితుడు.

ధార్ష్ట్యం అవలంబించా లనుకున్నాడు.

అతని పెదవు లదిరాయి.

అది కత్తిరించి "ఆగండి" అన్నాడు ముస్నద్దీ పండితుణ్ణి, శాయ్యాపుతూ.

"రాజులు బాబుగారూ" అంటూ అటు చూస్తున్నవాడల్లా తిరిగా డతను.

సభ అంతా నిస్తరంగసముద్రం అయిపోయింది, చూపంతా ముస్నద్దీమీద నిలిపి.

"మీరు పుచ్చుకున్న వరకట్నంలో, నూటికి పది రూపాయల చొప్పున వుంచుతారు మీరు మంగళ హారతి పళ్ళెంలో, సదస్యం సందర్భాన, తరవాత, తానున్నా స్వయంగా హారతి యిస్తుంది మీరు తీసుకు వచ్చిన మేళనాయకురాలు. అందరు సానులవంటిది కాదు, నూటికి రెండు రూపాయలు పుచ్చుకుంటుం దామె, ఖరారుగా. బ్రహ్మణ్యాలయిన పురోహితులు వెయ్యికి రూపాయి అడిగారు మిన్నకల్ని."

"అంతేనా మాతాహతు? అనుకుంటున్నా న్నేను, మళ్ళీ."

"అది కాదని చూపించండి మీరు ముందు. అడిగే వాడు తక్కువ అడగాలి ఇచ్చేవాడెక్కువ యివ్వాలి. ఇది వైదిక ధర్మం. మన వేదశాస్త్రాలవగాహన చేసుకున్నవారి చిత్తవృత్తి యిలా నడుస్తుంది."

ఇరుకున పడ్డాడు రాజులు.

దారి కనపడలేదతనికి.

మాటయినా తోచలేదు.

అందరూ మెచ్చగా చూశారు ముస్నద్దీకేసి.

"సెబాస్" అన్నట్టు అతని వీపే నిమిరాడు రాజు బాబు.

పెళ్ళికొడుకూ కొండుభట్టూ మొగమొగాలు చూసుకున్నారు.

"ఇచ్చెయ్యండి మామగారూ" అన్నాడు కొండు భట్టు, అన్యాపదేశంగా.

ముస్నద్దీ మాటలు బాగా కెళ్ళించాయతణ్ణి మరి.

రాజులు మాత్రం ఉగ్రుడయినాడు.

"నా కొడుకు పెళ్ళికాదు, నీకొడుకు పెళ్ళిది. ఇవ్వడానికయినా మానడానికయినా నీదీ అధికారం" అంటూ రొక్కం సంచీ కొండుభట్టుదగ్గిర వుంచేశా డతను.

## 5

"వందే - మాతరమ్" అంటూ వొక వాగ్బాణం రివ్వుమంది సమూహాన పెళ్ళిపందిట్లో.

ఉత్తరపు వసారాలో పది ప్రతిధ్వను లిచ్చిం దారివ్వ.

ఆ పదిరివ్వలూ పసురుగు ఐచ్ఛికసేవకరాళ్ళయి ప్రవేశించాయి పెళ్ళిపందిట్లో పసుపుపచ్చని జెండాలతో.

వారివెనక దళపతి వాలకంలో వొక యువతి.

సభ అంతా నిర్విణ్ణం అయిపోయిం దామెని చూసి.

"సిస్టర్ జానకీదేవి" అంటూ యువకుల్లోనూ, 'జానకమ్మక్క' అంటూ యువతుల్లోనూ కోలాహలం రేగింది.

"దీక్షితులు బాబగార్లూ" అంటూ పిల్చిందామె గంభీరంగా చూస్తూ, సౌమ్యంగానే.

చూసి వూరుకున్నాడు కన్యాదాత.

ఊరుకున్నాడంటే, మాట రాక.

మాట రాక అంటే, గుండె ఆగిపోయి.

పెళ్ళికొడుకు ఎడమకన్నదిరింది.

ఎందుకో ఆందోళన — ఎందుకో నిరాశ — ఎందుకో భయం — ఎందుకో కంగారు — ఇన్ని కమ్ము కున్నాయతని మొగాన, దట్టంగా.

"దీక్షితులు బాబుగార్లూ" అంటూ మళ్ళీ పిలిచిం దామె, ఆలస్యం సహించలేక.

రాజులు కంఠం బిగుసుకుపోయింది.

"ఏమి తల్లీ?" అనడిగాడు దీక్షితులు, బాగా ఎత్తుపడిపోయి.

"ఎంత కట్నం తీసుకున్నారండీ, నువ్వీ పెళ్ళికొడుకు కుని?' అనడిగిం దామె, గొంతెత్తి.

సభ అంతా దద్దరిల్లిపోయిం దీమాటతో, బాంబు పాటు లాగ.

"ఎంత కట్నం వంటే —" అంటూ అందు కున్నాడు కరణం.

నిప్పులు కక్కుతూ చూసింది సిస్టర్ జానకి కరణంకేసి.

"దీక్షితులు బాబయ్య తప్ప మరెవరూ బదులు చెప్పనక్కర్లేదు నాకు" అంటూ వురిమిం దామె.

"నేను తీవ్రంగా గర్హిస్తున్నా నీమాట. చాలా అవమానకరమైన ప్రశ్న మా కిది." అన్నాడు రాజా లుద్రిక్తుడై.

ఇటు చూస్తే కొండుభట్టు తలవంచుకుని వున్నాడు.

అటు చూస్తే తన కూతురు అత్రపడిపోతోంది, తనకేసీ కొండుభట్టుకేసీ చూస్తూ.

అంచేత పూరుకోలేకపోయాడు, రాజులు.

"మీా రెవరండీ?" అనడిగింది సిస్టర్ జానకి అతణ్ణి.

"పెళ్ళికొడుకు నా మనమడు.

"ఎలాంటి మనమడు?"

"కూతురి కొడుకు."

"మీ ప్రమేయం లేదిక్కడ, మీారూరుకోండి."

# ఘటన

సోంబుభట్లు ఒకమాటు తలెత్తి చూసి మళ్ళీ ముఖం వంచుకున్నాడు.

ఆమాటతో అతని కొక ప్రాణం లేచివచ్చినట్టయింది.

"నీ ప్రమేయం మాత్రం యేముం దిక్కడ?" అనడిగింది పెళ్ళికొడుకు తల్లి, గుసగుసలాడుతూ.

తన భర్త అడగవలసిన ప్రశ్న అది.

అడగనందుకు చాలా కోపంగా చూసింది కూడా అతనికేసి.

"కొంచెం నోపికపట్టు." అంది సిస్టర్ జానకి, చేత్తో నిషేధిస్తూ ఆమెని.

"అసలు నిన్నెవరు పిలిచారంట, యిక్కడికి?" గద్దిస్తూ మళ్ళీ అడిగింది పెళ్ళికొడుకు తల్లి.

"మా దీక్షితులు బాబయ్య సంగతి తేలనీ. తర్వాత అడుగు, నీ యిష్టం వచ్చిన ప్రశ్నలు నన్ను."

"ఎవరి సంగతి అయినా నీ కెందుకనడుగుతున్నా న్నేను."

"నీకెందుకు మాకుమల్లే ఇయ్యగలిగేదా కా అభ్యాగతురాలవు నువ్వసలు. నీ హద్దులో నువ్వుండు."

ఏమనడానికీ తోచలేదు పెళ్ళికొడుకు తల్లికి.

అలవాటయివున్న అధికారం మాత్రం వుడికింది.

"ఊరుకుంటా రేమండీ?" అంటూ కసురుకుందామె వాడిగానే, భర్తమీద.

అందరి చూపులూ సోంబుభట్లుమీద పడ్డాయి.

"విశ్వప్రూపా లేదా?" అని నిరీక్షిస్తున్న వారి కందరికీ సందేహం తీరిపోయింది.

సోంబుభట్లుకి మరో ప్రాణం లేచివచ్చినట్టయింది.

అర్ధనారీశ్వరుడు చెప్ప సాగెను.

పెళ్ళికొడుకు మొగం చిట్లించుకున్నాడింతా చూసి.

గౌరీపూజా మంటపం దగ్గరనుంచి వచ్చి, తన పక్షం స్త్రీల వంగెరిని తప్పించుకుని ముందువరసలో నుంచుంది పెళ్ళికూతురి తల్లి.

ఆమెని గుర్తించింది జానకి.

"ఏం బాబయ్యా, బదులు చెప్పాలి నాకు" అంటూ నిక్కచ్చిచేసింది కూడా కన్యాదాత నామె.

"కాదులేదు నేను. వరదక్షిణ యివ్వడాని కంగీకరించాను. ముందే యిచ్చేశాను కూడా"

"వరదక్షిణ అంటే యేమిటండీ?" అనడిగింది సిస్టర్ జానకి, పురోహితుణ్ణి.

"తాను చేసిన కన్యాదానానికి సాద్గుణ్యం లభించడానికి కన్యాదాత వరుడికిచ్చే హిరణ్యం" అని బదులు చెప్పాడు కన్యాదాత పురోహితుడు పండుడు.

"ఎప్పుడిచ్చావ దది?"

"కన్యాదానం చేశాక."

"అది పూర్తయిందా?"

"అంతవరకూ రానేలేదింకా. పిల్లను చూసి పెట్టమని వరుడు రాయబారులను కోరనేలేదు కూడా యింకా."

"ఏం బాబయ్యా, నువ్విచ్చింది వరదక్షిణ కాదు. తమ కొడుకుని నీ కమ్మినందుకు సోంబుభట్లు గారికి క్రయధనం నువ్విచ్చింది."

"......................"

"వరకట్నం అని ఒప్పుకో నువ్విచ్చింది."

"వరకట్నం అనడమూ వుంది, లోకంలో, దాన్ని."

"ఏమండీ బ్రహ్మగారూ, ఏం చెబుతారు మీరు?"

"వరకట్నం వేరూ, వరదక్షిణ వేరూను. రెండూ జరుగుతున్నా యీ రోజుల్లో"

"నువ్వు చేసింది 'లా' కు విరుద్ధం. తెలుసా బాబయ్యా?"

"......................"

"నువ్వు చేసింది శిక్షార్హమైన నేరం. ఇదన్నీ గుర్తుకి వచ్చిందా?"

గభీమని లేచాడు యాజులు.

"మళ్ళీ గర్జిస్తున్నావే నీధోరణి" అంటూ వురిమా డతను. కోపావేశంతో వణికిపోతూ.

"ఈ ధోరణి అర్థం అయిందా అసలు నీకు?"

"నీమాటకర్థం వుంటేనా?"

"అర్థవంతంగా అడుగుతాను చూసుకో, ఏమాత్రం గర కిటింది నీకు నీ మనమణ్ణి అమ్మటంలో?"

"నీ కెవరిచ్చారీ అధికారం, యిలా అడగడానికి?"

"నీతికి సంబంధించిన అధికారం మన్నిస్తావా నువ్వు, లాకు సంబంధించిన అధికారం మన్నిస్తావా?"

"రెండూ మన్నించన్నేను."

"అయితే నోపికపట్టు. నిన్నూ నీ కూతుర్నీ, నీ అల్లుణ్ణీ, నీ మనమణ్ణీ కూడా విచారణ చెయ్యడానికి లా అంటే అర్థంగా నీతి పాలించేవారు వస్తారు?"

సభలో వున్న సర్కిల్ ఇనస్పెక్టరు వొళ్ళు ఝల్లుమంది.

అతనూ సబ్ మాజిస్ట్రేటూ మొగమొగాలు చూసుకున్నారు, ఆత్రంగా.

"అసలు, నువ్వెవరివి?" అంటూ గద్దించాడు యాజులు.

"గౌరీపూజా మంటపంలో వున్న పెళ్ళికూతుర్నిలా తీసుకురావే నూరీదూ" అంది, సిస్టర్ జానకి, అటు చూసి, వురిమినట్లు.

లోపలికి బయలుదేరింది, వలంటియరు నూరీను, పసుపుపచ్చ జెండా వూపుకుంటూ.

పెళ్ళికూతుర్ని వెంటబెట్టుకునిన్నీ వచ్చింది, ఉత్తరక్షణాన.

అందరూ ఉలిక్కిపడ్డారది చూసి.

పెళ్ళికొడుకు కొయ్యయిపోయాడు.

"అదిగో చూడు, ఆ బాలికకు ప్రతినిధురాలిన్నేను, ఇప్పుడు చెప్పు నాకు బదులు. ఎంతకమ్మావు నీ మనవణ్ణి?" అంటూ నిలవతీసింది యాజుల్ని, సిస్టర్ జానకి.

అటు తిరిగింది తరవాత.

"నీయిష్టంమీదే కొన్నాడా మీనాయన, యీ పిల్లాణ్ణి, సుభద్రా?" అ నడిగింది పెళ్ళికూతుర్ని.

"నుణ్ణి కొనుక్కోవడం నాకిష్టం లేదు"

"పోనీ, కొని లేవడం జరిగిపోయింది కదా ఈ ఈ పిల్లాణ్ణి పెళ్ళాడ్డం నీకిష్టమేనా మనస్ఫూర్తిగా?"

"కాదు."

ఉజ్వస్తంగా లేచినుంచున్నాడు పెళ్ళికొడుకు.

పీట దిగి ఊడుకున్నా నెయ్యబోయా డతను.

"ఆగు!" అంటూ గద్దించింది, సిస్టర్ జానకి.

పెళ్లికొడుకు మానుపడిపోయాడు.

అది చూసి కొండుభట్లు లేచాడు.

"రారా, అబ్బాయీ. మనం వెళ్ళిపోదాం" అంటూ దారిచేసుకోడానికిన్నీ చూశా డతను.

"నుంచో!" అంటూ కస్సుమంది అతనిమీద కూడా సిస్టర్ జానకి.

"నీకొడుకు నమ్ముకున్నావే మా దీక్షితులు బాబయ్యదగ్గర పదివేల క్రయధనం పుచ్చుకొని? గోడ వల్లో దగడం భయం అయితే ఆ డబ్బంతా ముందిక్కడపెట్టి మరీ కదులు."

ఇలా అంటూనే సభకేసి తిరిగిందామె.

"అయ్యా, అమలాపురం సర్కిల్ ఇనస్పెక్టరు గారూ, సబ్ మాజిస్ట్రేటుగారూ, బహుశ్రుతులు ఓ అడ్వకేట్లూ, డాక్టర్లూను, దర్భముళ్ళు మున్నగు కరణాలు కూడా వినాలి. సంగతి అంతా తెలిసే వచ్చారు మీరందరూ యిక్కడికి. వచ్చి జరిగిందీ, జరుగుతున్నదీ చూశారు, చూస్తున్నారు కూడా. మీ అందరిపేర్లూ నోటుచేసుకుని వున్నాన్నేను. సిద్ధంగా వుండండి, కోర్టుకు రావలసివుంటుంది మీరందరూ" అనిన్నీ అందామె, గొంతెత్తి.

## 6

ఆంధ్రపత్రిక, మెయి 22:—

చండికేశ్వరం అగ్రహారం, మెయి 19 :- తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా, చండికేశ్వరం అగ్రహారంలో, మొన్నటి 15వ తేదీ నొక వివాహం జరిగింది. వధువు, ఓసపాటి వేంకట దీక్షితులు గారి రెండో కూతురు సుభద్ర. వయస్సు 18 ఏళ్ళు. వరుడు ఆ అగ్రహారం కాపురస్థుడే అయిన దర్భసీకేశ్వర తర్కవాచస్పతిగారి ఏకైకపుత్రుడు కిరీటిరావు. వయస్సు ఇరవైనాలుగేళ్ళు, కాని. రెండో పెళ్లివాడు. నల్భైయకరాల మాగాణిభూస్వామి. మంచి ప్రతిభావంతుడు. సుభద్ర చక్కని చుక్క అయితే అతను స్ఫురద్రూపి, దర్జాఅయినవాడు త్యాగి, భోగి, తాలూకా కంతకూ గ్రంథాలయోద్యమంలో ప్రముఖుడు.

కాని పెద్దచదువులు చదివినవాడు కాడతను. తమ పెద్దల్లుడులాగే తమ చిన్నల్లుడున్నూ సర్కారు ఉద్యోగి అయివుండాలన్న అభిలాష కలవారు కావడంవల్లనే వేంకట దీక్షితులుగారతనికి తమ కొమార్తె నివ్వడాని కిష్టపడలేకపోయారు.

అయితే, మొదటిభార్య పోయినప్పణ్ణుంచీ కిరీటిరావు మనసంతా సుభద్రమీదే వుందిట. సుభద్రకూడా అతణ్ణే గాఢంగా ప్రేమించివుందిట. దీనికి సాయం, కల్లూరివారి సంబంధం తప్పిపోయాక అప్పటికప్పుడు సుభద్రకు వివాహం చెయ్యవలసివచ్చింది వేంకట దీక్షితులుగారికి. లేకపోతే చేసిన ప్రయత్నం అంతా వ్యర్థం అయిపోయే పరిస్థితి యేర్పడింది. చాలా వేలు ఖర్చయిందట అందుకోసం. ఆ కారణంవల్లా, యథార్థం గ్రహించీ వేంకట దీక్షితులుగారు సుభద్రను కిరీటిరావు కిచ్చి, తెల్లవారాక మిథునలగ్నంలో నే వివాహం జరిగించారు. ఉభయఖర్చులూ తామే భరించి దేవదుందుభులు మోగేటట్టు మహోత్సవం జరిగించారు.

చివరికిలాగ ఆ ప్రేమికులిద్దరూ దంపతులయి నందుకు చూసినవారూ, విన్నవారూ చాలా సంతోషిస్తున్నారు.

కిరీటిరావున్నూ తాను కోరిన వధువు తనకు లభించినందున పరమానందభరితుడై, ఊరిగ్రంథాలయానికి స్వయంగా వొక భవనం కట్టించి యివ్వడానికి పూనుకున్నాడు.

ఈవివాహం ఈవిధంగా జరగడానికి సిస్టరు జానకీదేవి పూనికే ముఖ్యకారణం. మొదట ఆమె సాహసం గుర్తించలేనివారు ఇప్పుడామెను వేయినోళ్ల ప్రశంసిస్తున్నారు.

# బూర్గులవారి భాషాసేవ

శ్రీ బి. రామరాజు

"శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారిని గూర్చి ఆగస్టు 'భారతి'లో శ్రీవారు "హైద్రాబాదులో ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు అన్నయ్యమంత్రిని తలపించేవారు; ఇప్పుడు కేరళపాలకులుగా అన్నిటా కృష్ణరాయలను తలపిస్తారు" అని ఉట్టంకించినది పరమసత్యము. ఒక వైపు రాజకీయ వ్యవహారజ్ఞతయందును, ఇంకొక వైపు పరిపాలనా దక్షతయందును, మరొకవైపు రచనాపాటవమునను శ్రీ రామకృష్ణరావుగారి శేముషీవైభవము ముమ్మొనవాలువలె అడ్డమాక లెరుగని పదును గలది. వారు నేర్చిన పదిభాషలందు ఐదింటిలో కవితల్లల్ల నేర్చినవారు; పరిశోధనాత్మకములు, పరిశీలనాత్మకములగు వ్యాసములను కూర్చినారు. మొన్న మొన్ననే షష్టిపూర్తులు జరుపుకొన్న వారి జీవితచరిత్రమున సరిగా లెక్కపెట్టినచో నలుబది నాల్గు సంవత్సరములు సాహితీకృషికి కేటాయించవచ్చును. ప్రత్యక్షముగనో పరోక్షముగనో వారి సాహాయ్యమో ప్రోత్సాహమో పొందని సాహిత్యసంస్థ తెలంగాణమున లేదు. ఈనాటి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కూడ ఆనాడు వారు తెలంగాణమందున్నప్పుడే ప్రకటించినవాక్కుల నర్థముట్లనుగమనించిన సంస్థ. సంస్థలే కాక కవిపండితుల కెందరకో స్వహస్తపరహస్తముల తోడ్పడి ప్రోత్సాహమొసగినవారు శ్రీ రామకృష్ణరావుగారు. కేవలము రచయితలుగా వారొనర్చిన కృషి నుగ్గడించుటే ప్రకృతము నా కర్తవ్యము.

లక్ష్మీసరస్వతులకు అత్తకోడండ్ర ఆగళ్లులేని కుమ్మరుచక్కని కుటుంబపు వంగడము బూర్గులవారిది. ఒడ్డొరకముగాని చక్కగా సాగినది జీవనయాత్ర. పట్టినది బంగారమైనది; ముట్టినది ముత్యమైనది. తాతల నాటినుండి పరంపరగా నిత్యపారాయణములగుట భారతభాగవతరామాయణములు శ్రీ రామకృష్ణరావుగారికి శ్రుతములైనవి. స్వయముగా చదువుకొన్న తెలుగులు బడిచదువులటుల బాగుగ వాకళింపైనవి. తినిన దంతయు జీర్ణమై జీర్ణమైనదంతయు శక్తిగా మారిన కావలసిన దేమున్నది? కవిత లల్లుటకు పదునారవయేట పట్టిన కల మీనాటికిని సాగుచునేయున్నది. శ్రీరామకృష్ణరావుగారి నూనూగుమీసాలను వరించిన కవితాకన్య అనూర్యంపశ్య. వారు 1920-22 మధ్యన వ్రాసిన అనేక ఖండకృతులలో కొన్నిమాత్రము గోలకొండ మున్నగు వానిలో ముద్రింపబడినవి. ఆ సమయమునవారు ఒక నాటకమును ఒకనవలను వ్రాసి భద్రముగా నుంచినారు. ఏ యువకుడో నవయుక్కటువలె ఆ పౌష్యదేవి కుండలములుగొని తెచ్చుటకు. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారికి అప్పుడప్పుడు తాము వ్రాసిన ఖండకావ్యములను, శ్రీ రామకృష్ణారావుగారి కావ్యములను వేర్వేరుగా ముక్తాహారములు గూర్చవలయునని కోరిక యుండెడిది. 1924-1928 నడుమ థామస్ గ్రే గారి "ఎలిజీ" అనువాదమును సగము మాత్రమే 'సుజాతి' పత్రికలో ప్రకటించినారు.

శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు పూనానగరమందలి ఫెర్గుసన్ కాలేజీలో చదువుచున్నప్పుడే ఇంగ్లీషులో కవనమల్లినారు. కొన్ని సానెట్లతోపాటు "ఆర్ట్ అండ్ క్రిటిసిజం" వంటి మరికొన్ని వ్యాసములు కాలేజీ సంచికలందు ప్రకటించినారు. తెల్లదొరలు కుట్రబన్ని బీరారును కాజేసినపుడు అది హైద్రాబాదు రాజ్యమునకే చెందవలెనని చారిత్రకాధారములతో 1922-1923 ప్రాంతములందు కొన్ని వ్యాసములింగ్లీషులో ప్రచురించినారు. ఆ నాటి హైద్రాబాదు పరిస్థితులను గూర్చి సెయింట్ నిహాల్ సింగ్ వ్రాసిన వ్యాసములను విమర్శించుచు 1922వ సంవత్సరమున వ్రాసిన వ్యాసములు "హిందూ" పత్రికలలో నున్నవి. "బాంబే క్రానికల్", "ఇండియన్ సోషియల్ రిఫార్మర్", "మరాఠా" వంటి ప్రాత పత్రికలు తిరుగవేసినచో నాటి సమకాలీన సమస్యలగూర్చి వారు వ్రాసిన వ్యాసములు కొల్లలు. 1924 నుండి 1949 వరకు వారప్పుడప్పుడు వ్రాసిన ఇంగ్లీషు వ్యాసములన్నియు రాజకీయములు మరియు సమకాలీన సమస్యలకు సంబంధించినట్టివే. మతము, సంస్కృతి మున్నగు విషయముల గూర్చికూడ శ్రీ రామ

కృష్ణరావుగారు పెక్కు వ్యాసములు వ్రాసినారు. డా. లతీఫుగారు గత సంవత్సరమే తమ "ఇండో-మిడిల్ ఈస్ట్ కల్చరల్ ఎకాడెమీ" పక్షమున శ్రీ రామకృష్ణ రావుగారు వ్రాసిన "కల్చరల్ సింథెసిస్ ఆఫ్ ఇండియా" అను చక్కని వ్యాసమును ప్రచురించినారు. ఈవిషయమును గూర్చియే వీరివారు 1947-1948 మధ్యన "రయ్యత్" పత్రికలో ఉర్దూ భాషలో పలువారు వ్యాసములు ప్రకటించినారు. రంగమునకు వచ్చి రాశికి రాని రచనము లివి. శ్రీ రామకృష్ణరావుగారు రాశికి తెచ్చి రంగమునకు కొని రచనము లెన్ని కలవో? అది శంకరుల "సౌందర్యలహరి" యను వారి మట్టినానిలో నొకటియని మాత్రమె మెరుగుదుము. ఇటీవల కొన్ని సాహిత్యసంస్థల పూనికచే వారిరచనములు కొన్ని రాశికి రంగమునకు వచ్చినవి. అట్టివానినే యాధారముగా గొని శ్రీ రామకృష్ణరావుగారి రచనముల పరిచయ మొనర్తును. ప్రధానముగా పద్యరచనములు మరియు గద్యరచనములని వారి రచనములు వర్గీకరింపవచ్చును. పద్యరచనములందు సొంతరచనములు మరియు అనువాదములని వేరువేరు చేయవచ్చును. సొంత రచనములు:—

## కృష్ణ శతకము

ఈ శతకమును ఆంధ్రసారస్వత పరిషత్తు - హైదరాబాదువారు 1956 లో ప్రచురించినారు. ఈ శతకమును గూర్చియు శ్రీ గోల్కొండ వేపారి శ్రీ వైష్ణవ సమాజము-బాలాపురంవారు 1958లో ప్రచురించిన "శ్రీ వెంకటేశ్వర సుప్రభాతమును" గూర్చియు శ్రీ రామకృష్ణరావు గారు కృష్ణశతకమున వ్రాసిన తమ "మనవి"లో నిట్లు చెప్పుకొన్నారు. "సంకట బంధరే వెంకటరమణా—అని కన్నడ సామెత. కష్టం వచ్చినప్పుడు ఇష్టదైవాన్ని స్మరించుకోవటం అల్పబుద్ధియైన మానవుని అలవాటు. ఎల్లప్పుడూ తలచుకొనేవారు అరుదు. జనవరిలో 1955 లో టైఫాయిడ్ జ్వరము తగుల్కొని నెలరోజులు మంచం ఎక్కాను. అప్పుడు భగవన్నామ స్మరణం చేసుకొనుటకై బుద్ధిపుట్టి ఎన్నడో చదువుకొన్న శ్రీ వెంకటేశ సుప్రభాతము, కృష్ణశతకము మున్నగు స్తోత్రముల శ్లోకాలు పద్యాలు జ్ఞాపకం చేసుకున్నాను. చాలా కాలం క్రితం చదువుకొన్నందున మరచిపోయి జ్ఞాపకం రాలేదు. పుస్తకాలు కూడ అప్పుడు అందుబాటులో లేవు. అందువల్ల పద్యస్ఫూర్తిచే నేను స్వయముగా సంస్కృతంలో 'శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం, తెలుగులో 'కృష్ణశతకము' రచింప సంకల్పించి ఆరంభించితిని. నిర్బంధ విశ్రాంతి లభించిన ఆకాలంలోనే రెండు రచనలు సగం పూర్తి చేసితిని. మిగతా సగం పూర్తి చేయుటకు ఒక సంవత్సరం పట్టింది"—శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు వైష్ణవులు. భక్తిప్రపత్తులు వారి రచనములందలి ప్రధాన గుణములని ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు. లోకమును తనను విమర్శించుకొని భగవంతుని సన్నిధానమున ఆత్మనివేదన మొనర్చుకొనుట భక్తకవుల శతకములందంతటను సాధారణము. కృష్ణశతకమున కూడ ప్రధాన గుణ మిదియే. దీనిలో మొత్తము 101 పద్యములున్నవి. ఆంధ్రదేశమున అబాలగోపాలమున ప్రచారమందిన ప్రసిద్ధ కృష్ణశతకము వలెనే సరళసుందరమైన భాషలో నడచిన దీశతకము. రెంటికిని భావమందును, భాషయందును పోలిక లనేకములు.

భగవంతుని శరణాగతరక్షణపరత్వమును గూర్చి చెప్పిన పద్యమిది.

"శరణాగత పరిరక్షణ
బిరుదమునకు సాక్షిగా విభీషణుడే నీ
దరిజేరి శరణు వేడిన
సరగున లంకాధిపతిగ నిలుపవె కృష్ణా."

అట్టి భగవంతుని నెట్లాహ్వానించుచున్నారో కనుడు:

"కాలని భవ సన్నాహము
లాలుం బిడుగులును గోవనాక్రందనముల్
గోలెత్తునప్పు డెంతల
కాలి ఘులంఘులల రమ్ము, కావుము కృష్ణా."

పై పద్యమున నుత్తరార్ధమున గల రామణీయకమును వాచ్యముగా చెప్పనవసరముండదు. విషయ వాంఛా వ్యామోహమున జిక్కుకొను మనుష్యస్వభావమును గూర్చి చెప్పిన పద్యమిది.

"ఏమి మనస్సో హరిహరి
స్వామిని బడద్రోసి స్వారి సలిపెడు కుత్తుం
జేమో యనిపించును వసి
గామితముల వెంటబడుట గాంచిన కృష్ణా!"

పరతత్త్వము వాద ప్రతివాదములతో, కుతర్కములతో తేలునది కాదని వారి యభిప్రాయము.

"పరమతఖండనదీక్షా
పరతంత్రులు వాదకౌస్త వైర్యానరులున్

తరతరము దలచిపోయిన
తరమే పరతత్త్వసూత్ర స్వతత్త్వలగ్న కృష్ణా!"

భక్తిద్వారమున సాధించవచ్చునని వారి యాశయము:

"ప్రజ్ఞావాగుల కెపుడున్
సుజ్ఞేయము గాదు నీదు సుగుణ సురూపం
బజ్ఞానియైన భక్తుని
జిజ్ఞాసాహ్వానమునందు చిక్కెదు కృష్ణా!"

నేటి రాజకీయమునందు తలమునకలగుచున్న వారి మనోభావ మెట్టిదో పరిశీలింపుడు.

"జనసేవయే నీ సేవని
జనతా రాజ్యాధిభారజనిత క్లేశం
బున క్రుంకుచుంటి నిత్యము
కనికరమున బయటపడ జేయవె కృష్ణా!"

## శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

దీనిని శ్రీ గోల్కొండ వేపారి శ్రీ వైష్ణవ సమాజమువారు 1958 లో ప్రచురించినారు. ఏడు కొండలవానికి వేకువజామున మేలుకొలుపుసేవ నిత్యము జరుగుట మన మెరుగుదుము. ఈ మేలుకొలుపులకు స్వామివారు మేల్కాంచుదురో లేదో కాని ఎంతటి జడాత్ములైనను లేచి చైతన్యమును పుంజుకొనుట మాత్రము సత్యము. ఆ వేంకటేశ్వర సుప్రభాతమును మననము గుంచుకొని మన కవులు రచింపబడిన ముప్పది శ్లోకముల యథావిధి. దీనికి సమువంటి తెలుగుపద్యములు కూడ శ్రీ రామకృష్ణరావుగారే వ్రాసియున్నారు. ఈ రెండు వేంకటేశ్వర సుప్రభాతములకు గూడ అప్పుడప్పుట పోలికలున్నవి.

స్వామివారి పుష్కరిణీమాహాత్మ్యము నుద్ఘోషించు శ్లోక మిది.

"స్వర్ణాభ నగ్రస్త మిహిరాంశు సమప్రతుల్యాన్
మాయాబలేన మలినీకృత మానసౌఘాన్,
సమ్మార్జయంతి మనుజాః సరసీజలేన
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్,"

ప్రభాతకాలమున చేతనాచేతనము లన్నియు స్వామివారి సేవలో గుణకీర్తనమున నున్నట్లు కనుపించును. కనుక నే శ్రీ రామకృష్ణరావుగారు కోకిలలుగూడ స్వామివారి స్తోత్ర మొనర్చుట నిట్లు వర్ణించినారు.

"ఆనమ్ర మాత తిరుమంచ ముపేత్య కల్యే
పీత్వాఽతిరుచ్య ఫలసార రసాత్మకావ్యమ్,
పుంస్కోకిలాః శ్రవణసుందర మాలపంతి
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్!"

పోతనగారి నిష్ఠకు దెచ్చు శ్లోకమొకటి:

"త్వత్పాదపద్మమకరంద రస ప్రవృత్తి
శీతా న జాత్వపి త్వదన్య ముపాశ్రయంతే,
మందారమత్తమధుపా మదనం కిమిచ్ఛేత్
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్!"

ఈ శ్లోకమునకు వారె యొసర్చిన యనువాదమును పరిశీలింపుడు.

"తావక పాదపద్మగళి
తస్వాదు దమ్మరందమున మత్తిలుల్
భావుక చిత్తముల్ పరుల
పంచల జేరునె యెప్పుడేనియున్
బోవునె పారిజాతమును
బొందిన తుమ్మెద యమ్మెతోడ గనన్
నీవిక జాగుసేయకుము
నిద్దుర మేల్కొను వేంకటేశ్వరా!"

పండితులకు, పామరులకు, జ్ఞానులకు, భక్తులకు, ఆర్తులకు, సమస్తజనములకు, శరణ్యమైన స్వామివారిని శ్రీ రామకృష్ణరావుగారు మేల్కొలుపుచున్నారు.

సంత్రాసితాత్తజగతాం పరమార్తిహర్త్ర
జిజ్ఞాసు శిష్య విదుషాం హి ఫలార్థినాంచ,
సుజ్ఞానినాం చ తవ పాదయుగం శరణ్యం
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్.

ఈ శ్లోకమున కనువాదము.

త్రాసిత జీవితార్తులకు
తత్త్వ పదార్థ రహస్య శాస్త్ర జి
జ్ఞాసులకున్ ఫలార్థులకు
జ్ఞానవిశేష సుసంభృతాత్మస
న్యాసులకున్ త్వదీయ చర
ణాంబుజ యుగ్మమె కాశరణ్యమై
బాసట యౌను భక్తజన
భావిత మేల్కొను వేంకటేశ్వరా.

సంసారసాగర సముత్తరణమునకై కృపాకటాక్షముతో సేతువును నిర్మింపుమని స్వామి నెట్లు ప్రార్థించుచున్నారో కనుడు.

ఉన్మీల్య నేత్రసరసీరుహ యుగ్మమద్య
సంసారసాగర సముత్తరణైక సేతుః,

సంబధ్యతాం తవ కృపామయ దృష్టిజాలైః
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్."

దీని కనువాదము.

"నీ కమనీయ నేత్ర నవ
నీరజయుగ్మము విప్పి యిప్పుడీ
లోకముపై కృపాగిన వి
లోకనజాలము నుప్పి దానిచే
ప్రాకటమొప్ప గట్టు మొక
వారధి నీ భవసాగరంబుపై
లోకులు దాట శేషగిరి
లోలుప మేల్కొను వెంకటేశ్వరా!"

## శృంగగిరి శారదాస్తుతిః

శ్రీ రామకృష్ణరావుగారు హైదరాబాదురాష్ట్ర ముఖ్యామాత్యులుగా నున్నప్పుడు శృంగగిరికి జగద్గురువులను సందర్శించబోయిరి. అప్పుడచటి శారదాదేవిని దర్శించి భక్తిపారవశ్యమున దేవిని కొనియాడిన స్తోత్ర శ్లోకములు 'స్రవంతి' సంపుటి 3 సంచిక 1 లో (ఏప్రిల్ 1956) ప్రకటింపబడినది. వానిలో రెండు శ్లోకములు మాత్రము నుదాహరింతును.

"శుకీకీర ముఖోద్గత శ్రుతివచ
స్సంఘోష సంలాపినీమ్
సాంగామ్నాయ రసాత్మకావ్య సరసీ
సంప్లావనోత్కంఠితామ్,
వీణావాదన గాన నృత్య ముదితామ్
పుణ్యామ్ కలాంభోనిధిమ్
శాస్త్రోద్యాన విహారిణీం ఉపనిష
త్సఖ్యావృతామ్ భావయే."

"వామే కరే నిహిత హేమవిపంచికాయాః
తంత్రీరవైర్ముఖరితామరముఖ్యలోకామ్,
దిక్పాలమౌళి మణిమండిత పాదపద్మామ్
వాణీం భజామి ఘటితాంజలి మస్తకోఽహమ్."

శ్రీ రామకృష్ణరావుగారు వేరొక సందర్భమున రచించిన గౌరీస్తుతి, వాణీస్తుతి, మరియు లక్ష్మీస్తుతి కూడ అంతే ప్రకటింపబడినవి. అందులో లక్ష్మీస్తుతిని గమనింపుడు.

"వైకుంఠమందార వనాంతరాళ
సుధాసరశ్చంద్రశిలాతలాగ్రే,
పర్యంకభాగే రమమాణ కాంతా
కుచాగ్రచేలాంచలలగ్న పాణేః,
గజేంద్ర సంత్రాణ సముత్సుకత్వాత్
వినా ఖగేంద్రం చ పరిద్రుతస్య,
హారే గృహజాలగ్న పటానుకృష్టా
మనుప్రయాంతీం కమలాం నమామి."

పోతనగారు గజేంద్ర మోక్షమున జెప్పిన "అల వైకుంఠ పురంబులో", "సిరికిం జెప్పడు" పద్యములను మనమునం దుంచుకొని వ్రాసిన లక్ష్మీస్తుతి ఇది.

## భావమంజరి

ఈ శీర్షికలో 'స్రవంతి' యందే (3-వ సంపుటము 5-వ సంచిక) ఆరు శ్లోకములు ప్రచురించినారు. వానిలో రెండు శ్లోకముల నుదాహరింతును.

"యత్ర యత్ర తవ పాదపంకజం
తత్ర తత్ర కమలాయతే ధరా;
యత్ర యత్ర తవ మంద సుస్మితం
తత్ర తత్ర శరదిందుచంద్రికా."

ఈ శ్లోకమును విన్న ఉమర్ ఖయ్యాం తలపులో మెరయును. కాని నాకు మాత్రము భగవద్రామానుజుల గూర్చి వేదాంతదేశికులు వారు కొండొకచో
"భిక్షా పర్యటనక్షమేషు భరాంచత్కే గళత్కల్పషా
యద్వ్యాజమిషేణ పత్రనుకరీముద్రాం సముద్రాం బరా."
యని చెప్పినది జ్ఞప్తికి వచ్చినది.

"శుద్ధాంతకేళీ నిలయాశ్చ రమ్యాః
క్రీడాంగణాన్యేవ హి రాసభానాం,
రాజన్యచూడామణిమండిపాద
రాజీవనాన్యోఽపి హి నిస్సమాధిః."

ఈ శ్లోకము కూడ ఉమర్ ఖయ్యామునే తలపించుచున్నది. బహరాము చక్రవర్తి మధువానిచోట ఈనాడు సింహము విశ్రమించుచున్నదను భావమును వెలార్చు రుబాయీ యది.

## శ్రీ కృష్ణాష్టకము

కేరళరాష్ట్ర పాలకులుగ నున్న శ్రీ రామకృష్ణరావుగారు గురువాయూరు (కేరళ) శ్రీకృష్ణ క్షేత్రమును సందర్శించి ఆ స్వామివారిపై చెప్పిన పద్యాష్టకము 'స్రవంతి' (సంపుటము 5 సంచిక 1 ఏప్రిల్ 1958) లో ముద్రితము. శ్రీకృష్ణస్వామిని మనసార వర్ణించిన వారి భక్తి పారవశ్యము లీలాశుక జయదేవాదుల భక్తిని స్ఫురింపజేయును.

"నల దంభోజ పలాశ నేత్రములతో
దంతాంశు శుభ్రచ్ఛటా
మిలితస్మేరమనోహరా ధరముతో
మేలైన బంగారు గు
వ్వలు వక్కగట్టి వినీలనీరదవపు
ర్దివ్యచ్ఛవి మెప్పారు నీ
చెలువంబున్ గనురాల జూపగదవే
శ్రీ నందగోపాలకా."

ఆ పరాత్పరుని విభూతిని సమస్తచరాచరము లందు జూచిన శ్రీ రామకృష్ణరావుగారు శ్రద్ధానిని ముద్దులు మూటగట్టు తెలుగులో నెట్లు పాడినారో కనుడు:

"పచ్చని యాకు లేజిగిని
బారెడు నీటి పగాకు పాటలం
దచ్చపు వెండి వెన్నెలల
వానని బూచెడు పువ్వు నవ్వులో
బిచ్చుకగొంతులో నొదుల
బిచ్చము గోరెడు దీన వాల్కలో
పచ్చగితాలి మద్దెమకు
స్వాంతములో గనిపింతు కేశవా."

## అనువాదములు

ఇంతవరకు కవితారూపమున వారు వెలువరించిన స్వంతరచనముల గూర్చి కొంచెముగా మనవిచేసితిని. ఇక వారి యనువాదములను పరిచయ మొనర్తును.

ఫారసీయనువాదము:—శ్రీ బూర్గుల రామకృష్ణ రావుగారికి విద్యార్థి దశలో ఫారసీ రెండవభాష గానుండి నందునను, సహజముగా ఫారసీకవిత్వమందున్న మాధుర్యముచలనను వారి కభిరుచికలిగి ఆ వాఙ్మయ సాగరమును మథించు నవకాశము కలిగినది. అసలు హైదరాబాదు రాజ్యమందలి విద్యావంతులు, గౌరవ కుటుంబములవా రందరును ఒకప్పుడు ఫారసీ చదువను వ్రాయను నేర్చుకొనుట పరిపాటిగా నుండెడిది. అవి శ్రీ రామకృష్ణరావుగారు బొంబాయిలో ఎల్.ఎల్.బి. పట్టమునకు చదువుచు "అంజుమన్ ఇస్లామియా" హైస్కూలులో నుపాధ్యాయులుగా పనిచేయుచున్న దినములు. ఉమర్ ఖయ్యాం రుబాయీలను ఫిట్జిరాల్డు ఆధారముగా శ్రీ రాయప్రోలు సుబ్బారావుగా రప్పు డప్పుడే ఆంధ్రలోకమున కందించిరి. ఫారసీ చదివి యనువాదము చేసిన కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గారు కూడ ఆదినములందే యీ పనికి పూనుకొనిరి. కాని వారి యనువాదములు కొన్ని మాత్రమే (1928) 'భారతి'లో ప్రకటింపబడినవి. వారి పానశాల1935లో వచ్చినది. మూలమునే చదివినవా రగుటచే శ్రీ రామకృష్ణరావుగారు ఉమర్ రుబాయీలను పెక్కింటిని యనువదించి వానితోపాటు ఉమర్ జీవితమును గూర్చియు రెండు వ్యాసములను 'సుజాత' పత్రికలో (1927) ప్రకటించిరి. ఉమర్ ఖయ్యాము రుబాయీలనే కాక శ్రీ రామకృష్ణరావుగారు సూఫీసర్మద్ రుబాయీలనుకూడ పెక్కింటిని అనువదించినారు. అవి యన్నియు నముద్రితములే. ఫారసీ వాఙ్మయమున నింత ప్రగాఢాభిమాన ముండుటచేతనే శ్రీ రామకృష్ణరావు గారు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు స్థాపించిన 'విజ్ఞానవర్ధనీ పరిషత్తు' సమావేశములలో రెడ్డిగారి ప్రోత్సాహమున 'ఫారసీ వాఙ్మయము' గూర్చి రెండు వ్యాసములు వ్రాసి చదివియుండిరి. మరికొంత విషయము సేకరించియు, ఆ వ్యాసములను విపులీకరించియు పోలీసుచర్యకు పూర్వము వారు సెంట్రల్ జైలులో నుండినప్పుడు "ఫారసీ వాఙ్మయచరిత్రము"ను వ్రాసి యున్నారు. ఇదియు నముద్రితమే.

ఉమర్ ఖయ్యాం వ్యాసమును తెలుగు వారికి మారలిచ్చిన శ్రీ రామకృష్ణరావుగారి యనువాదము లొండు రెండు ఉదాహరింతును.

"సరసుడు మిత్రుడిష్టుడును
సన్నిహితుం డొకరుండు లేక యొం
టరి యను భూమిగర్భమున
డాగి పరుండెద వన్నియేండ్లో నీ
ఘురసము ద్రావు మింపుగ వ
ధూమణి తెల్పకుమీ రహస్య మె
వ్వరికిని విచ్చబో దికను
వాడినపువ్వు మరెన్ని నాళ్ళకున్."

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి 'మధుకలశము' మనోజ్ఞమయ్యును ఫిట్జిరాల్డుపై నాధారపడుటచే మూలమునకు కొంచెము దూరమైనది. ఫారసీనుండి యనువదించిన కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి రచనములకును శ్రీ రామకృష్ణరావుగారి యనువాదములకును తారతమ్య మరయగోరువారు 'వ్యాసముక్తావళి' 36 పుటలో మొదటి రెండు పద్యములను 'పానశాల'

పరామర్శించినారు. గ్రాంథికో గ్రాంథిక భాషాభిమానులను ఎంత నిరర్థకములో సూచించినారు. సహృదయ విమర్శకుని కుండవలసిన లక్షణముల నుట్టంకించినారు. ఎంకిపాటలయందలి శబ్దసౌందర్యము, భావసౌకుమార్యము, ప్రణయమందలి యౌచిత్యమును గూర్చియు చర్చించి నిగ్గుదేల్చినారు.

2. ఉమర్ కయ్యాం : ఈ వ్యాసమును (1927) సుజాతలో ప్రచురించియుండిరి. దీనిలో ఉమర్ ఖయ్యాం జననము—జన్మభూమి - విద్యాభ్యాసము - సహాధ్యాయులు - చతుశ్శాస్త్రపాండితి - రాజసన్మానములు - కవిత్వము - బహిష్కారము - గీతములసంఖ్య - ప్రక్షిప్తములు - ఇతరభాషలలోని కనువాదములు - ప్రతులు - మధుకేళీప్రశంస - మూలములోడి తారతమ్యము - ఉమర్ ప్రణయతత్త్వము - ఇష్క హఖీఖీ - సూఫీలమార్గము - నమక్ నిష్ఠుర నిర్భయభావ ప్రకటనము - మున్నగు సమస్తవిషయము లున్నవి.

3. ఈశ్వరతత్త్వము - ఉమర్ ఖయ్యాం:— ఇదికూడ పై వ్యాసమువలె 1927 లో సుజాతలో ప్రచురింపబడినది. దీనిలో ఉమర్ నాస్తికుడు కాడనియు, అతని తత్త్వజ్ఞానము (సత్యస్వరూప మన్వేషణము, ఈశ్వరతత్త్వజ్ఞాన ముపాసనము), జీవన్మిథ్యావాదము, అతనికి కలిగినశంకలు, ఈశ్వరునితోడి వాదనలు. వైష్ణవ భక్తులతోడి పోలికలు, సాంఖ్య, యోగ, బౌద్ధతత్త్వ సమన్వయమార్గస్థితియు సోపపత్తికముగా నిరూపించినారు. పై రెండు వ్యాసములందు వారనువదించి యుదాహరించిన పద్యసంఖ్య మూడుపదుల కెక్కువ.

4. కాకునూరి అప్పకవి జన్మస్థానము—ఈ వ్యాసము శ్రీరామకృష్ణరావుగారి పరిశోధన పటిమకు పతాక. దీనినివారు (1932) గోల్కొండ పత్రికలో తొలుత ప్రకటించియుండిరి. అప్పకవి జన్మస్థానము మహబూబునగరం మండలమున కల్వకుర్తి తాలూకాలో తమ స్వగ్రామమగు బూర్గుల కాగ్రేశముల దూరమున నున్న కాకునూరగ్రహారమని నిరూపించినారు. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు గారును శ్రీ గిడుగు వెంకటసీతాపతి గారును అభినవ సూత్రగ్రామ నిర్ధారణమున పొల్లు పొరపడిరో నిరూపించి, ఇప్పటికిని కాకునూరికి రెండుమైళ్ళదూరమున నున్న 'లేమామిడి' యే అగ్రహారమనియు, అందే అప్పకవి ప్రపితామహుడు సోమనయుండెననియు నిరూపించినారు. నిడుదవల్లి, బొద్దికేపల్లి మున్నగు అప్పకవి చెప్పిన గ్రామముల నిరూపించినారు.

5. ఉర్దూభాషా సారస్వతములు:—శ్రీ రామకృష్ణరావుగారీ వ్యాసమును (1943) ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్తి సంచికలో తొలుత ప్రచురించినారు. తెలంగాణమువారందరికిని ఉర్దూభాషావాఙ్మయములతో పరిచయ మధికము. శ్రీ రామకృష్ణరావుగారికి ఉర్దూ కరతలామలకము. ఈ వ్యాసమున వారు ఉర్దూ పుట్టుపూర్వములు మొదలుకొని ఈనాటివరకు గాంచిన యభివృద్ధిని పరిశీలనాత్మకముగా సమీక్షించినారు. శౌరసేని ప్రాకృతము పాదులోని ఖడీబోలీ, అరబ్బీ ఫారసీపదముల మైత్రితో రేఖ్తాయై, ఖాన్ ఆర్జూకవిచే ఉర్దూనామకరణమంది, మిర్జా అమీర్ ఖాన్, సుల్తాన్, వలీలకృషితో పెరిగి, లాల్ ఖిల్లా (ఢిల్లీ) నుండి లాల్ దర్వాజా (హైదరాబాదు) వరకు వ్యాపించిన సేనానాయకుల ప్రాపకమున ఫలించి, ఈనాడు భారతీయభాషలందొకటైన ఉర్దూభాషా చరిత్రమును క్లుప్తసుందరముగా వర్ణించినారు. అటుతరువాత ఉర్దూసాహిత్యచరిత్రమును యుగములుగా విభజించి (మొగలు పాదుషాల కాలమునుండి కుతుబ్షాహీ సుల్తానులవరకును, తదనంతరము నిజాం సర్కారువారి ప్రాపకమునను) అమీర్ ఖుస్రూనుండి వలీఔరంగాబాదీ వరకును పుట్టిన ప్రథమయుగచరిత్రమును, సౌదా, మీర్, దర్ద్ కవిత్రయముతో ప్రారంభమయిన రెండవయుగమును, గాలిబ్ జౌఖ్, ఆతిష్ అక్బర్ ఆబాదీ, బగ్ర, చక్బస్తు, ఎక్బాల్ మున్నగు కవుల కృషితో పెట్టు వికసించి ఈనాటి మఖ్దూం మొహియుద్దీన్ వంటి అభ్యుదయ రచయితలచే నేటిగా దోహదముపొందినదని వివరించినారు. ఉర్దూభాషాచరిత్రముల గూర్చి తెలుసుకొనగోరువారికీ వ్యాసమొక సిద్ధఘుటిక. "ఉర్దూవాఙ్మయ పోషణము - బహమనీ కుతుబ్షాహీ సుల్తానులు" శీర్షికతో శ్రీ రామకృష్ణరావు తెలుగు భాషా సమితివారి 'తెలుగు సంస్కృతి' సంపుటమున నొక చక్కని వ్యాసమును ప్రచురించినారు.

6. సూఫీ సర్మద్:—పర్షియాలో పుట్టి భారతదేశము మెట్టి వాణిజ్యము చాలి ప్రణయమున దగిలి ఇష్క మజాజీనుండి ఇష్క హకీకీ సోపానమెక్కి విరాగియై దిగంబరుడై చివరకు జీవన్ముక్తుడై ఆలంగీరు చక్ర

# బూర్గుల వారి భాషా సేవ

నర్తకి కర్తికెరర్యైన సూఫీభక్తుని గాథ యిది. సూఫీల భక్తిసోపానక్రమమునుగూర్చి వర్ణించునప్పుడు శ్రీరామకృష్ణరావుగారి వచనశైలి ఒడ్డులొరసి పారు ప్రవాహముగనే నడచినది. భక్తివిషయము వచ్చిన చోటెల్ల వారి గుండె జల్లుజల్లుమనును. తదనుగుణముగా వారి కలము గల్లుఘల్లుమనును. "ఏ శిథిలమనస్కుడు తన మధుర నిశీథములను ప్రణయినీవ్యగ్రవిలాస విభవముల మననము జేయుచు గడపుట నెరుగడో వాని కానంద స్వరూపుడగు ప్రణయమూర్తిని ధ్యానించుచు రాత్రులు గడిపెడు భాగ్య మెట్లబ్బును? ఏ గర్వోపహతుడు తన ప్రణయనిధానమునెల్ల ప్రేయసియొక్క మదగజగమనగర్విత చరణాన్యయంబుపై సమర్పణంబు చేయలేదో వానికి నాత్మసుత్యాహంభావరూపములగు శిలావిగ్రహముల బగల్చుట కెట్టి శక్తి కలుగును? ఏ శుష్కహృదయము మనోహారిణీ మధురానరంజనిత గానామృతముచే సుస్నిగ్ధమై పరిభ్రమింపదో యాది పరమపురుషుని వేణునాద సుధాలహరిచే నెట్లు తరంగితమగును? పూర్వము కాలినవత్తియే తీగమును గంటుకొని జ్వలించును గాని క్రొత్తవత్తినిపెట్టిన దీపము వెలిగించుట కాలస్యమగును కదా"—ఇది వారి శైలి కొక యుదాహరణము. నిష్కారణముగా పర్వీన్ వంటి మహాభక్తుని చంపించిన అలంగీరు చక్రవర్తినిగూర్చి వ్రాసినప్పుడు వారిశైలి మహోద్వేగమునందినది. ఆ పట్టు లుదాహరించిన గ్రంథవిస్తరమగును. అట్టి మహోద్వేగమునుకూడ, 'అనల్ హఖ్' (సోహంబ్రహ్మ) సిద్ధాంతమునకై తన తలపంచునిచ్చిన మహాభక్తుని చరిత్రమును ముగించునప్పుడు, నిర్లిప్తతతో నణచిపెట్టి ధీరోదాత్త గాంభీర్యముద్రను బట్టి నడచిన దీ శైలి. "పలాళ్ళిషి క్షుద్రైన రెంపెడుయేట నీరక్తపాతమొనర్చిన అలంగీరు చక్రవర్తి తరువాతి 25 సంవత్సరములు రాజ్యమొనర్చెను. ఈకాలమున నెప్పుడాతనికి శాంతి లభించలేదు. మరణముకూడ పరస్థలములోను నిషాదావస్థయందును సంభవించినది. ఏ మహాత్ముని రక్తబిందువుల ప్రభావమో! కాని యీ మహాత్ముని లోక వాక్యమేమని పలుకనప్పుడు మనకేల చక్రవర్తిపైకోపము?" ఉబికివచ్చు కన్నీళ్ళను గద్గదస్వరముతో కన్నులయందే యదుముకొన్నట్లున్నది చివరివాక్యము!

7. రెడ్డిరాజులకాలపు మత సంస్కృతులు:— 'వ్యాసముక్తావళి' యందిది చివరివ్యాసము, దీనిని శ్రీ రామకృష్ణరావుగారు (1947) తొలుత 'శోధ'లో ప్రచురించిరి. ఇది కూడ వారి పరిశోధనాత్మక దృష్టికి తార్కాణముగు వ్యాసరాజము. దీనిలో రెడ్డిరాజుల పుట్టుపూర్వములు, వారికి పూర్వము ఆంధ్ర దేశమున ప్రబలిన జైన, శైవములు, రెడ్డిరాజ్యమున బ్రాహ్మణమతమునకు లభించిన ప్రోత్సాహము వారి యాలంబమున వెల్లివిరిసిన శైవవైష్ణవములు, వారి దానధర్మములు, భక్తి ప్రపత్తులు, నాటి సాంఘికపరిస్థితులు మున్నగునవి సమగ్రముగా వర్ణించినారు. వారివ్రాతల కాధారములు శాసనములు, సమకాలీన వాఙ్మయము, దేవాలయములు మొదలైనవి. వారి వ్యాసములు వ్రాయునాటికి మల్లంపల్లి వారి రెడ్డిరాజుల చరిత్రముగాని, రెడ్డి సంచిక గాని, వెలువడి యుండలేదు. కనుక వస్తుసమీకరణమునకు వారి కెంతశ్రమ, ఓర్పు వలసి యుండెనో మనము భావింపవచ్చును.

ఇంతవరకు ఇచ్చట ప్రచురింపబడిన పుస్తకములు, పత్రికలాధారముగా శ్రీ రామకృష్ణరావు గారి సాహిత్యకృషి నట్టంకించితిని. అముద్రితముగానుండినది, ముద్రితమై నాకందనిదెంత సాహిత్యము కలదో, రావుగారి యనుభవము కడునొప్పది. అట్టివారు స్వీయచరిత్రమును కూడ వ్రాసిన నెంతబాగుండును! పారసీ వాఙ్మయచరిత్రము ముద్రింపబడిన నాజాతి గ్రంథములందది శ్రీ.

# ఋషి వాణి

శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తి

పరవశత వాల్మీకి పలికినది ఛందమై
కరుణమై కవితమై కదలించె జగమెల్ల —
పరమజాహ్నవి పారు సరణిలో రామకథ
మఱపించె నవరసోన్మాదమున తనువెల్ల.

ఆదికవి లోలోన నణగినది భావమై
స్వానమై, గీతమై సాగినది త్రుటిలోన —
పాడుకొని శాంతి దివ్యానంద నాకమై
యూదించె భవసాగరోదకము దరిగాన !

మునిచంద్రు తపమెల్ల జనచకోరజ్యోత్స్నై
యనుపమై పొంగినది యలమినది దిక్సీమ —
కనుదెఱపి యాధ్యాత్మికప్రేమ యమృతమై
తనిపినది తనయంత తానమై హృత్సీమ.

రామగాథాస్రష్ట ప్రేమమై, శోకమై
ఆ మనోహరవాణి యాడినది శ్లోకమై —
స్వామి జీవనగీతి సాధ్వి జానకి రీతి
భూమి కాదర్శమై పొల్చినది యొకరీతి !

# భారతీయ తత్త్వమీమాంస: ప్రజారాజ్యాలు

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

పాశ్చాత్య పండితులు మన తత్త్వశాస్త్ర విషయమున ఎంతో కృషిచేశారు. కాని వైదేశికులు, విమర్శకులు కావడంవల్ల మనతత్త్వశాస్త్ర రహస్యం వారికి బోధపడిందికాదు. ఇక మన పండితులను చూడబోతే, వారు తర్క వితర్కాలతో కాలక్షేపం చేస్తూ, ముఖ్యవిషయాన్ని విస్మరిస్తూ ఉంటారు.

నేటి ప్రజారాజ్యములు సుఖశాంతులతో వర్ధిల్లవలెనంటే గృహస్థ (పౌర) ధర్మనిర్వహణం సుష్ఠుగా జరగాలి. మన తత్త్వ మీమాంసలో గార్హస్థ్య ధర్మాన్ని చక్కగా నిరూపించినది. ధర్మాచరణను, జ్ఞానసంపదను పొందకపోతే మానవశ్శాంతి దుర్లభమవుతుంది. మన తత్త్వ విచారణయందు ఈశ్వరారాధనమనే ప్రధాన లక్షణమొకటి ఉంది, ధర్మ జ్ఞానములను చక్కగా సమన్వయం చేస్తున్నది. ఈ లక్షణం ఇతర తత్త్వదర్శనములకు లేదు. మన తత్త్వదర్శనం ఉదారాశయ సముపేతముగుటవల్ల ఈ కాలాన సకల జనులకు సౌఖ్యం లభింపజేయుటకది మిక్కిలి అనుకూలిస్తుంది.

## శ్రద్ధాలోపము

తత్త్వశాస్త్ర సారమును జారవిడిచి, అంతర్దృష్టిలేని దురాచారముల నవలంబించుటచే ఇంతవరకు మన ఆచరణకు, శాస్త్రానికి విరోధం వాటిల్లినది. దీనికి పరపాలనం కొంత కారణమయినను మనకు శాస్త్రమునందు శ్రద్ధాభక్తులు లోపించుటే ముఖ్య కారణం. అంతేకాని మన శాస్త్రాలది కాదీ లోపం. ఇపుడు శాస్త్రవిహితమైన ఆచరణ అవలంబించే అవకాశం మనకు లభించింది. కనుక మనము దానిని పరీక్షించి చూడవచ్చు.

నేటి భౌతిక దర్శనములవల్ల మన కలవడిన జ్ఞానానికి, సంయమానికి మన తత్త్వదర్శన మొక్కటే చాలా అనురూపమైనది; నేటి కాలానికది అనుగుణమైనది. కనుక మనం మనస్ఫూర్తిగా దాని నవలంబించి, తదనుగుణాచరణం చేసి చూడవచ్చును.

ఇతర ధర్మములకు భయమే ప్రవర్తకం. రాజదండనం, పరలోక దండనం అనే భీతి ఇటీవల మన ధర్మమందుకూడ జొరబారిన మాట నిజమేకాని వేదాంత దర్శనమున అట్టిభీతికి చోటులేదు. మన శాస్త్రము ధర్మమునకే తప్ప ధర్మప్రవర్తకుడగు రాజునకు ప్రాధాన్యమీయదు. ప్రకృతిని పాలించేదే ధర్మము. స్మృతికర్తలు, న్యాయాధికృతులు ప్రతిపాదించే ధర్మానికి ప్రాధాన్యాలు లేదు.

## మనతత్త్వశాస్త్రము, నేటి భౌతిక దర్శనములు

"భూతజాలమంతా నాచే వ్యాప్తమై నాయందున్నది. అది నాకాధారముకాదు. నేను సృష్టిస్థితి కారణుడనయ్యు దానియందు తగుల్కొనను. ప్రకృతి వశమై పుట్టుచున్న ఈ సృష్టికి ప్రకృతియే ఆధారము. నాయధ్యక్షతచే ప్రకృతి చరాచరసృష్టి చేయుచున్నది. దానిచే జగచ్చక్రము ప్రవర్తించుచున్నది" అని గీతలు నవమాధ్యాయమున 4-10 శ్లోకములందు చెప్పుచున్నవి. మూలప్రకృతియందలి సర్జనశక్తి వికాసమే జగత్తని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. . నేటి భౌతికదర్శనములు గ్రహించిన ఈ రహస్యాన్ని మన దార్శనికులు ఏనాడో అతీంద్రియ దృష్టిచే గ్రహించిరి. ఇది పరమాద్భుతము కదా!

నేటి పదార్థవిజ్ఞానము, జీవశాస్త్రము మనదార్శనికులకు క్రొత్తవికావు. సత్యాన్వేషణమే ఉపనిషద్విచారణకు జీవగఱ్ఱ. అప్రాకృతములను అద్భుతములను మహిమలను అపేక్షింపక ఉపనిషత్తులు నిత్యమగు సత్యమునే ఉపాసించును. నేటి భౌతిక దర్శనజ్ఞానమును కొంత నమ్మి కొంతనమ్మని అన్యమతములు వంచనాశీలములు. భారత తత్త్వదర్శనమున కట్టి పాట్లులేవు.

భౌతిక దర్శనములకంటె ముందే మన వేదాంతశాస్త్ర మావిధంగా సృష్టి రహస్యాన్ని దర్శించి, ధర్మమునకు శాస్త్రమునకు సమన్వయము కూర్చినది.

అంతేకాదు. లాభసాటి బేరము, లాభవ్యాపారము గృహస్థ ధర్మవిరుద్ధములనీ, అవి లోకమునకు శ్రేయస్కరములు కావనీ మన ఋషులేనాడో గ్రహించిరి. ఫలాభిసంధి (లాభదృష్టి) లేకుండా, లోకశ్రేయమును కోరి శక్త్యనుసారం కర్మాచరణ చేయవలెనని మన శాస్త్రం చెప్పుచున్నది. దాని ననుసరించే గీతలు కర్మలలో చిక్కువ తక్కువలు లేవనీ, అన్నీ సమాన గౌరవార్హములే అనీ చెప్పుచున్నవి. లోకారాధనమే ఈశ్వరారాధనమని వివరించి గీతలు పరోపకార నిరతికి ప్రేరణ కల్పించుచున్నవి. గీతలు చెప్పిన కర్మయోగమిదియే. ఫలాపేక్ష లేకగాక, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలాచరించవలెననీ, అట్టి స్వధర్మము నాచరించుట పరమ సుఖహేతువనీ గీతలు ప్రవచించినవి.

ఎవరి ధర్మములు వారాచరించుటచే జగత్కారణుడును, సర్వవ్యాపకుడునగు ఈశ్వరుని పూజించుట. ఇతరుల ధర్మమును నిపుణంగా చేయుటకంటె స్వధర్మాన్ని ఓపినట్లు చేయుటే శ్రేయము. స్వభావానుగుణకర్మయందు దోషమున్నను దానిని విడనాడరాదు. అగ్నితో ధూమము వలె మానవకర్మలన్నిటితో దోషము కూడియుండును. నిష్కామంగా, నిస్సంగమనస్కుడై కర్మలాచరించుటే సన్యాసము. ఇదియే గీతోపదేశము.

## అర్థవ్యవస్థ

లాభదృష్టిలేని నూతన అర్థవ్యవస్థను నేడు లోకం కోరుతున్నది. అట్టి వ్యవస్థకీవిధంగా గీతలే పునాదులు వేసినవి. స్వప్రయోజనపరుల లాభ రతులకొరకే గీతలిట్లుపదేశించెనని అవివేకులు పల్కుచుందురు. నిజమే. మలినబుద్ధులకు, దోషైక దృక్కులకు అమృతము హాలాహలము వలె కన్పించును.

అధిక ధనవ్యయముచే గాని నేడు జీవనం గడచుటలేదు. జనసంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. కావున వ్యష్టికర్మను సమష్టికి సౌఖ్యప్రదమగునట్లు దిద్దే అర్థవ్యవస్థ చేయవలెను. అటి వ్యవస పలుమందికి బాధాకరమవుతుంది. పురుషకారం స్వేచ్ఛను కోరుతూ ఉంటుంది. నూతనార్థ వ్యవస్థ ఆ స్వేచ్ఛ నరికట్టుటచే బాధ కల్గుతుంది కావున అట్టి పురుషకారమును, ఉత్సాహమును, సంతుష్టిని పూర్తిగా తుడిచిపెట్టని వ్యవస్థ చేయవలసి ఉంటుంది. ఇతరులు అధికార సహితంగా తన స్వేచ్ఛ నరికట్టుతున్నారనేదే పురుషుల అసంతుష్టికి మూలకారణం కనుక అర్థవ్యవస్థను ధర్మము నందు ప్రతిష్ఠించినచో ఆ బాధ తొలగిపోయి, సంతోషోత్సాహములకు కారణమగును. పరోపకారము ధర్మవిహితమనే భక్తి విశ్వాసములు కుదిరినచో పురుషునకు తదనుగుణమగు సంతుష్టియు, చిత్తవృత్తియు లభింపగలవు.

పురుషుల కర్మ సమాహారమే సమష్టికర్మ. పురుషులు సంతోషోత్సాహములతో పనిచేయని నాడు సమష్టికర్మ ఫలింపదు. సంతోషము నేటి పురుషలక్షణం. సమష్టి కట్టి సంతోషాదులందు నేరవు కావున పురుషులు భయముచే గాక సంతోషోత్సాహములచే కర్మచేసే వ్యవస్థను మనము కల్పించాలి. ధర్మబుద్ధి, ధర్మప్రేరణము — ఇవియే అట్టి సువ్యవస్థకు మూలబలమై ఉండాలి. ధర్మచింతన యొక్కటే పురుషునిచే సంతోషపూర్వకంగా పరోపకారం చేయించ గలిగేది. ఇదియే హైందవధర్మసారము. గీతలు దీనినే బోధించినవి.

19వ శతాబ్దిలో యూరపునం దైశ్వర్యము సమకూర్చిన పోటీవ్యాపార మిపుడు నిరాకృతమైనది. దాని స్థానే భిన్నప్రకార వ్యవస్థితమైన సహకారమే జీవన సర్వస్వమును పాలింపవలెనని సర్వులు అంగీకరిస్తున్నారు. తొల్లిటి వ్యవస్థకు లాభదృష్టియే ప్రేరకము, ప్రాణప్రదము. తద్వ్యతిరిక్తమైనదేదో మరియొక ప్రేరణ నూతన వ్యవస్థకు కావలసియున్నది. కావున అర్థచింతా విముఖమైన ధర్మచింతను, తదనుగుణ చిత్తసంస్కారమును కల్పించవలసియున్నది. కమ్యూనిజము కేవల భౌతిక దృష్టితోనే తాని కార్యమును సాధించితి ననుచున్నది. కాని, హింసాబహుళము, క్లేశప్రదమునగు విప్లవంవల్ల గూడా ఈశ్వర భక్తివంటి తాత్కాలిక చిత్తవృత్తి విశేష మొకటి ప్రజల నావహిస్తుందని మనం గ్రహించవలెను. స్పర్ధాశూన్యమగు అర్థవ్యవస్థ ఎచటనైన, ఏ మాత్రమైన ఫలప్రదమైనచో అచట నెల్ల ఆత్మమూలమును కదలించే మహావిప్లవమో యుద్ధావేశమో ప్రాప్తించి, స్వార్థచింతను తుడిచిపెట్టిందికాని మరియొకటి కాదు. ఈశ్వర చింతకు ప్రత్యామ్నాయమైన ఈ యావేశము తాత్కాలికమే కాని చిరస్థాయి కాజాలదు.

## నాస్తికతతో ఆత్మ వినాశము

స్వతంత్ర పురుషకారంతో గూడిన అర్థవ్యవస్థ యూరపులో భేదములకు దారితీసింది. సంపద కొందరి

యొద్దనే చేరుకొని, ఇతరులు నిప్పచ్చరములో కూరుకొని పోయిరి. ఆ దారిద్ర్యం స్వదేశంలోనే కలుగనక్కర లేదు. ఇతర దేశాలను పీల్చుక తినటం తేలిక కూడాను. అలా పరులను పీల్చుకొని తినాలంటే ఇప్పుడిక సాగదు. అలా కూడబెట్టిన సొమ్మును పాపపు సొమ్ముగా ఎంచే రోజు లివి. సంపదుత్పత్తి ఒరులకు పీడాకరం కాకుండా ఉండాలి. సంపన్నతలో అంతరములు, కొందరికి అసౌఖ్యములు ఉంచి తీరుతవంటేను, వాటిని సహించక తప్పదంటేనూ సాగదిక. బహిరంగంగా గాక, చాటు మాటున గాని పోటీ వ్యాపారం సాగించటం మాత్స్యన్యాయంగా ఎంచుతున్నారిప్పుడు. "నా పురుషకార ఫలితం నేనే అనుభవించాలి. ఇందులో ఒకరికి జోక్యం ఉండకూడ"దనే రోజులు వెనుక బట్టినవి. వెనుకబడిన దౌర్భాగ్యులనుపేక్షించి, ముందుకు సాగిపోవటం కూడని పనిగా ఎంచుకొంటున్నాము. సమష్టి శ్రేయంకొఱకు వ్యక్తుల సొంత వ్యవహారములలో జోక్యం చేసికోవటం యుక్తమనీ, జోక్యం చేసికోక తీరదనీ అంటున్నారిప్పుడు.

ప్రాతవ్యవస్థను నిర్మూలించి, సమష్టి శ్రేయం కొఱకు స్పర్థారహితమైన నూతనార్థిక వ్యవస్థను నెలకొల్పే భారం కాలవశాన కొందరి చేతులలో పడినది. వారు తాత్కాలికమైన రాజనీతి ప్రయోజనమునకు లొంగిపోవటం దురదృష్టం. అసంతుష్టియే విప్లవహేతువనీ, మతధర్మములు సంతుష్టి ప్రదములు గావున వానిని నిర్మూలించవలెననీ వారు తలపోసిరి. నల్లనుంగువంటి యీమత ప్రాతవ్యవస్థలో భాగంగనుక దానికి సమూలనాశం తలపెట్టిరి. పరప్రవృత్తికీ, స్వార్థరాహిత్యానికీ ప్రబల హేతువైన ఆస్తిక్యమును వారీవిధంగా చేసేత నిర్మూలింపబూనిరి. లోకమున హెచ్చుతగ్గులను సహించటం నేర్పేదీ, దీనులకు సమాశ్వాసం కూర్చేది ఈ ఆస్తిక్యమే కావున అసంతుష్టికారకుల కది ప్రబల ప్రతిబంధకమై కన్పించింది. దానిని దండనీతివల్లనో, సామాద్యుపాయములవల్లనో మట్టుబెట్ట సంకల్పించిరి. ఆ సంకల్పం పూర్తిగా ఈడేరలేదనే అనుకుందాము.

నూతనవ్యవస్థకు ప్రాణభూతమైన నిస్స్వార్థప్రవృత్తికి ఆస్తిక్యమొక్కటే రక్షకమని యెఱుగక వారు దానిని నిర్మూలింప సమకట్టుట ఆత్మనాశనకరము. ఆర్థికవిప్లవము సాధించుటకీయాస్తికతా నిర్మూలన మనవసరమని వారు గ్రహింపరైరి. విప్లవావేశమున బడి కొట్టుకొని పోవుచున్నవారికీ యనర్థము గోచరించదయ్యెను. ఆ యావేశమే సర్వసమర్థమని యెంచిరి. ఆ యావేశం నిలిచేదికాదు. ద్వేషము, క్రౌర్యము ప్రజల నెంతకాలమని తమ వశమున నిలిపికోగలవు? ఆస్తిక్యము స్థానే అప్పటి కుపకరించిన ఆవేశం నల్లబడగానే నూతన వ్యవస్థ కూలిపోతుంది. అందుచేత స్వార్థపోషకములైన కొన్ని కొన్ని ప్రయోజనాలను ప్రజలకు కల్పింపవలసి వస్తున్నది.

పూర్వ వ్యవస్థయందు పురుషకారానికి ప్రేరకమైన లాభదృష్టిని వీరు మరల సందుదారులవెంట అనుమతించినవారగుచున్నారు. స్వార్థపరతను బలాత్కారముచే మాన్పనులేము; పరార్థపరతను ప్రభుత్వ సావధానత రక్షింపనులేదు. ప్రభుత్వపు పరామరిక కొంత కాలానికి సడలక తప్పదు. దాని పటుత్వంకూడా తగ్గిపోతుంది. కాబట్టి ఏదో మిషతో ప్రజలకు కొన్ని ఎరలు చూపవలసివస్తుంది. ఈవిధంగా తొల్లిటి లాభదృష్టిని సమ్మతించినట్లే అవుతున్నది. చాటుమాటుగా కల్పించే యీ లాభపు టెరలవల్ల అప్పటి పబ్బము గడచిపోవునే కాని అవి శాశ్వత పరిష్కారాన్ని సాధించలేవు.

## ప్రేరణశక్తి

సంఘములోని స్త్రీ, పురుషులలో నెవరి వ్యక్తి వారిది. సంఘమున కట్టి ఏకవ్యక్తి యుండదు. వ్యష్టికి పరోపకార చింతను మప్పుటకు మార్గము లున్నవేకాని దాని ప్రత్యేక లక్షణములు మాత్రము మాన్పరానివి. వ్యక్తికి హాని కలుగకుండ పరోపకార చింతను మప్పెడి యుపాయమును విచారింపవలెను. గీతలో చెప్పిన దానికంటె అందులకు మంచి యుపాయము కన్పించదు. అంతరమైన ధర్మచింతకుండే శక్తి బాహ్యములైన ప్రభుత్వ సావధానతకు, బలాత్కృతికి ఉండజాలదు. ధర్మచింతనకుండు హెచ్చరిక గూఢచారుల చూపుల కుండదు. ప్రభుత్వ దండనముకంటె ఆ ధర్మచింతనమే అధిక ఫలప్రదము అను రహస్యమును గుర్తింపవలెను.

ఇంతకంటె ముఖ్య విషయమేమనగా, భారత ప్రజల ధర్మచింతనమునకున్న ఉదారత మరి యే మతమందును కానరాదు. భారత ప్రజ లీశ్వరున కనేక నామరూపములు కల్పించుకొనిరి. ఎవరి యిష్ట దైవము

వారికున్నను ఇతరులు పూజించెడి మూర్తులను వారు కాదనరు. తమ అద్వైతము నెంత కొనియాడుకొన్నను వారితర ద్వైతములను తెగనాడరు. సుదృఢమైన యీ భక్తిభావమునందు, ఉదారమగు నీధర్మసంప్రదాయమునందు పెరిగిన హైందవుల చిత్తసంస్కారము-ఇతర మతములతో దగవులాడక, నానా తెగల లక్షితమైన సమష్టిజీవనము సుఖముగా కొనసాగిపోవుటకు హేతువగుచున్నది. ఈ సంప్రదాయము పురాతనమయ్యు నేటి కాలమున కొంతయు తగియున్నది. ఎవరి మార్గము వారిదైనను అన్ని మార్గములు పరమేశ్వరునే పొందించుననెడి యీ విస్తృత ధర్మలక్షణము గీతలో 4-7-9 అధ్యాయములందు తరచుగా ప్రస్తావింపబడిన .

నన్నే రూపమున ధ్యానించినను, ఏ విధముగా పూజించినను భక్తుడు నన్నే చెందును నిక్కమని పరమేశ్వరుడు గీతలో నభయమొసగుచున్నాడు. ప్రధానముగ భక్తి విషయమున చెప్పిన ఈ యౌదార్య లక్షణము సకల మతములను లోగొనుచున్నది.

ఇంతటి యుదార ధర్మమునకు మూలమైన సత్యము చిరకాలమునాడే హైందవ మహర్షులెట్లు దర్శింపగలిగిరా యని ఆశ్చర్యము పొడముచుండును. విశ్వశ్రేయమునకు, జగన్మంగళమునకు సాధనమయిన యీ ధర్మబోధమే హైందవ సంస్కార హారమునకు నాయకమణి వంటిది.

## సన్యాసము

సంశయాత్ములిటనొక ప్రశ్న చేయుదురు: "అంతయు బాగునే యున్నది కాని సన్యాసము మాటయేమి? కర్మాసక్తత విషయ మేమందురు? గృహస్థధర్మాచరణము, పురుషకారము ప్రధానముగు ఈ కాలమున సన్యాసమును, దైవాధీనతను బోధించు హైందవ మతములవలన ప్రయోజన మేమి?" యని యడుగుదురు. ఇదిగో, సమాధానము చెప్పుచున్నాను. మన వేదాంత శాస్త్రము కర్మత్యాగమును, సన్యాసమును బోధించుట లేదని ముందుగా గ్రహింపవలెను. కర్మఫలము నెడ ఆసక్తిని విడనాడుమని చెప్పునే కాని మన వేదాంతము మీ రనుకున్న కర్మసన్యాసమును బోధించుట లేదు.

సరిగా ఇట్టి ప్రశ్నయే తన్నడిగినట్లు శ్రీకృష్ణుడు గీతలలో నీ విషయమును స్పష్టముగా వివరించెను. కర్మాచరణమున శ్రద్ధయు, కర్మఫలము నెడ ఆసక్తియు ప్రధానమని శ్రీకృష్ణుడు చాటి చెప్పెను. అసంగుడై కర్మాచరణ మొనర్పవలయుననియే గీతలు ప్రతి అధ్యాయమునను ప్రతిపాదించినవి. ఈ విషయము నిరూపించుటకు శ్లోకముల నుదాహరింప బనిలేదు. ఇందు సంశయమునకు చోటు లేదు. విషయ సుఖాభిలాషయే సంసారమున దుఃఖమునకు హేతువగుచున్నది. దీనివలననే మోహము, క్రోధము, మతిభ్రంశము, దుఃఖము జనించును. గీతలు, ఉపనిషత్తులు చేసిన మహోపదేశ మిదియే

గృహస్థుడు (పౌరుడు) అసక్తుడై ధర్మాచరణ మొనర్పవలెను. అతని కర్మాచరణము లోకము కొఱకే గాని స్వార్థము కొఱకు గాదు. ఈ మహోపదేశమే గీతలకు సమన్వయత నాపాదించిపెట్టినది. గీతలు, ఉపనిషత్తులు చెప్పిన యీ పరమార్థమును గ్రహించినచో ఈనాటి పౌరులు సంఘసేవా ధురీణులు కాగలరు. లోకమును సేవించుటకై తన బ్రతుకెల్ల వినియోగించిన గాంధీజీ దృఢ సంకల్పమునకు, ధైర్యమునకు మూలకందమీ గీతోపదేశమే. వేయి మాటలేల ఈ ప్రత్యక్ష నిదర్శనమే చాలును గీతాశాస్త్ర ప్రాశస్త్యమును చాటి చెప్పుటకు.

ఇక కర్మసిద్ధాంత మందురా, హైందవ ధర్మమున కది ఆయువుపట్టు. ఆధ్యాత్మిక జగత్తునకూడ కార్యకారణ సంబంధము నది నిరూపించును. మానసికము, కాయికమునగు కర్మలకు ఫలమనుభవింపక తీరదనుట మనకు ప్రత్యక్షమే. ఆ కర్మఫలము శరీరముతో అంతము కాజాలదు. శరీరము, కర్తయగు జీవుడు శరీరముతో దాను నశింపడు. ఈ జన్మమున సల్పు కాయిక మానసిక కర్మల ఫలము జీవు నంటి పట్టుకొని తదనురూపమైన నూతన జన్మము వానికి ఘటించును. ఇదియే హైందవ తత్త్వశాస్త్రసారము. దీనిని కాదందురా, మరియొక సిద్ధాంతము నన్వేషించుకొనుడు. దీని నంగీకరించిన గృహస్థుల నీ కర్మఫల బాధ్యత తప్పదనుటయే ముఖ్యము.

జగత్కారణమును, దాని స్వరూపము నిదమిత్థమని నిర్ణయింపజాలము. మన పరిమితబుద్ధిచే అనంత తత్త్వమును నిర్వచింప బూనినచో నెక్కడికక్కడే విరోధములు పొడసూచుచుండును. ఆత్మయే జగత్కారణమని అంగీకరించినచో నేటి మన భౌతిక విజ్ఞానము

కర్మ సిద్ధాంతముతో సమన్వితమయినట్లు ఇంకొక సిద్ధాంతముతో సమన్వితము కాదు. శక్తికి నాశము లేదని భౌతిక దర్శనముల సిద్ధాంతము కదా! మన కర్మవాదము ఆ సిద్ధాంతమునే ఆత్మ లక్షణమున కన్వయించుచున్నది. పరాపర ప్రకృతుల (Matter and spirit) నిత్యతను చెప్పెడి యీ రెండు సిద్ధాంతములు పరతత్త్వ లక్షణమును వేర్వేర నిరూపించుచున్నవి.

## అదృష్టము

కర్మఫల స్వరూపమును మన వేదాంతులు దైవమని వర్ణించెదరు. పాశ్చాత్యులు చెప్పెడి అదృష్టము వేఱు. అది మనవారు చెప్పెడి దైవమునకు సరితమ్ముగా కాదు. మన దైవమునకు ప్రకృతి ధర్మములతో విరోధము లేదు. పురుషకారము నది భంగింపదు. కారణమున్నచో కార్యము తప్పకుండుటయే మన కర్మ సిద్ధాంతము. ప్రకృతి గమన మనివార్యమని న్యూటను నిరూపించెను. ఆత్మ పురోగతియు నట్టిదేయని మన వేదాంతము చెప్పుచున్నది. ఒకానొక పని చేసిన పిమ్మట దాని ఫలమునుండి తప్పించుకొనలేము. ఒకానొక ఫలమును సంపాదింప గోరుదుమేని దానికి కారణమగు కర్మ నాచరింపక తీరదు. మన తలపులకు, చేతలకు అనురూపముగు ఫలము పుట్టితీరును. ఇదియే కర్మసిద్ధాంతము. కర్మఫలము తప్పదని యోగి గృహస్థులు ధర్మాచరణ మొనర్చవలయును. నిషిద్ధ కర్మను పరిహరించుటకు రాజదండ భీతితో బనిలేదు; నిషిద్ధకర్మకు ఫలమనుభవింపక తీరదను నిశ్చయమే చాలును.

కర్మసిద్ధాంతము పురుషకారమును, ఇచ్ఛను గాదనదు సరికదా, పురుషునకది స్వేచ్ఛాదాన పత్రమువంటి దనుట యథార్థము. నీవు తలచెడి తలపులు, పలికెడి పలుకులు, చేసెడి చేతలు, తల్చిన నిగ్రహము— వీనిలో నొకటియు ఊరకపోవు. దేనిఫలము నది యిచ్చి తీరును. పురుష ప్రయత్నమేదియు వ్యర్థము కాదు! నీ యత్నమునకు ఫలము నీదియేయని చెప్పుటకంటె స్వేచ్ఛ మఱి యేమి కావలెను.

నీ భావిని నీ చేతులలోనే పెట్టిన పిమ్మట స్వాతంత్ర్యమునకు లోపమేమి? వేదాంతశాస్త్రము చెప్పెడి కర్మకు పురుష ప్రయత్నమనియే అర్థము. పురుషకారమునకందు నిషేధము లేదు. ఆ పురుషకార స్వరూపమునే విధి యనియు, దైవమనియు చెప్పుదురు. ప్రసిద్ధమగు నదృష్టము వేఱు. ఫల స్వరూపమగు దైవము వేఱు.

కర్మసిద్ధాంతమునకు అదృష్టమునకు పొత్తు లేదనుటకిది చాలును. కాయిక మానసిక కర్మలు పురుషుని వద్ద తీర్పునందును. ఆ తీర్పునకు, ఒరిమికి మృత్యువు కూడ అడ్డు నిలువదు. జన్మాంతరమందైనయు అభ్యుదయము సాధింపవచ్చును. ఇచటనే హైందవ ధర్మ సర్వస్వము క్రిస్టియనులు, వైష్ణవులు నిచట నొక శంక సేయుదురు. పాపకర్మములకు ఫలమనుభవింపక తప్పదని యిక ఈశ్వర భక్తికి, ఈశ్వరానుగ్రహమునకు చోటెక్కడిది? - అన్నచో, చోటు లేకేమి, ఉన్నది. పశ్చాత్తాపముచే ఈశ్వరానుగ్రహము లభించును. పశ్చాత్తాపమనెడి పురుషకారమునకు ఈశ్వరానుగ్రహము ఫలమగునే కాని అది కేవల మీశ్వర దానము కాదు. తీవ్రమగు పశ్చాత్తాపమనెడి కర్మచే భక్తుని చిత్తము పాపక్షాళితమగును. దానినే ఈశ్వరానుగ్రహముగా నెంచికొందుము. ఈ పశ్చాత్తాపముచే గలుగు ఆనంద మెంత రమణీయమో కదా! అయ్యది కర్మసిద్ధాంతమున కందు ఆపత్తి లేదు.

అన్ని కర్మలకున్నట్లే పశ్చాత్తాపమునకు కూడ ఫలముండును, పాపముతో ఆత్మ సలిపెడి పోరాటమే పశ్చాత్తాపము. పోరాటము సల్పుచుండగనే ఆత్మకు విజయానందము లభించుచుండును. యుద్ధ క్షోభముతో విజయానంద మిందు ఐక్యమును భజించును. అనుతాప పూర్వకమైన వ్యథాగ్ని యందు పాపకర్మ హరించిపోవును. కావున ఈశ్వరానుగ్రహ సిద్ధాంతమునకు కర్మపద్ధతికి విరోధము లేదు. ఉత్తర జన్మమున పూర్వస్మృతి యుండదు కదా, అప్పుడు ఫలించెడి కర్మవలన నేమి ప్రయోజనము? పురుషకారమున కది యెట్లుపకరించును? ముందెప్పుడో ఎవరో అనుభవింపబోయే సుఖం కోసం నేను ప్రస్తుత సుఖమెందుకు వదలుకోవాలి? అనుభవకాలమందు పూర్వస్మృతి గాని, కర్మాచరణ సమయమందు భవిష్యజ్జ్ఞానము గాని లేదు కదా! అని సుఖకాములు ప్రశ్నింతురేని వినుడు:—

## సత్కర్మాచరణమే సంతోషము

ఫలముతో, లాభముతో నిమిత్తము లేకుండా సత్కర్మాచరణ మొనర్చునపుడు నీవు సుఖమనుభ

వించుటలేదా? మంచిపని చేయుటలో సంతోష మందుట మానవస్వభావము. ఇందు పిన్నలు పెద్దలు నను భేదములేదు. సత్కార్యము సర్వులకు సంతోష మొసగును. నీ యుపకారము వారికి నీవారికి మేలు చేయుటలో లాభదృష్టియుండదు. మానవ మాత్రు లందరు తమకుతామే సాజముగ నిట్లు మేలొనర్చి సంతోషింతురు.

నీ గ్రామమునకు, నీ దేశమునకు సౌఖ్యమును కోరుకొందువు. ఇతరులకు మేలుచేసికొనుచు సంతోష మనుభవించుట సర్వసామాన్యము. భౌతిక దర్శనములు పేర్కొను ఆకర్షణము (Gravitation) వలెనే ఇదియు పరమసత్యము. ఏకమైన పరబ్రహ్మ మనేక మైనట్లే, ఈ యనేకము మరల ఏకత్వ మందగోరును. ఆ రెంటికి నీ యాకర్షణము నిత్యలీలవంటిది. మూల మందున్న ఆ యేకత్వమే సకల జీవరాసుల నొండొంటితో ఏకనేకవిధముల నాకర్షించుచున్నది. దేశమునకు మేలునుగోరి భావిప్రజల యోగక్షేమమును గోరి నేటి వారలు సుఖమును త్యజింతురు. ఈ త్యాగమునకు నిప్పు డేమిలాభము? ముందటి కేమి ప్రయోజనము? అను విచారణకు తావీయక త్యాగము లొనర్చుట సాజము. నేడు మనము నాటుచున్న చెట్లనీడ నెవరనుభవింతురో కాని ఆలోచింపకుండనే చెట్లను నాటుచుందుము. అట్లే ఈ జన్మమున మనం సత్కార్యాచరణం చేస్తే భావిలో మంచిజన్మము కలుగుతుంది. అంటే ఉత్తర కాలమున సత్పురుషులు జన్మింతురు. మన ఉత్తర జన్మమునే భావితర మంటున్నాము. సత్కర్మను చేసిన మనమే భావిలో సత్పురుషులమై జనించి లోకమును నింపుదుము. అట్టి ఉత్తమ ప్రజావిర్భూతికై ఉద్యమించుట మనవంతు. సత్కర్మలు చేస్తూ, దుష్కర్మలకు పంతాపము చెందుచు, ఈ పుణ్యభూమిలో మంచిజీవులనువిత్తి, మంచిజన్మలను పండించుదము. పూర్వస్మృతి లేకున్ననేమి? ఆ స్మృతిభారం దుస్సహము కాగలదు.

ఇంతకంటె మంచిజన్మలు ధరింపవలెనని యత్నించినచో లోకము సత్పురుషమయం కాగలదు. ఉత్తమ ప్రజాసృష్టికై శాస్త్రబోధితమైన యీ యుపాయమును వేదాంతము మన కనుగ్రహించినది. మంచి జాతి గోవులను, పశువులను పుట్టించుటకై మనము చేసిన యత్నములు ఫలించినవి కావా? అట్లే మన శరీరములను, ఆత్మలను సంస్కరించుకొని మంచి ప్రజగా వర్తింతుము. మనము సాధించిన మంచి జాతిగోవులకు, గోవులకు పూర్వస్మృతి లేదు కదా, అట్లే మనకును లేకుండును గాక. పూర్వజన్మమున మన మెవ్వరమో తెలియకున్న నేమి? అట్లు తెలియకుండుటే మేలు సుమీ!

## సహకారము

సదాచరణమునకు వేదాంతము రెండు ప్రయోజనములను చెప్పుచున్నది. 1 నిక్కమైన సౌఖ్యము లభించుట, 2 జన్మాంతరమున సజ్జనుల సంభూతి. పల్లె ప్రజల పరస్పర సహకారము, దేశభక్తి, వేదాంతము నివి మూడును ఉత్తరోత్తర విస్తృతములై ఒక్క పరిధిలో నిముడును. సహకారముచే పల్లెపట్టులకు, దేశభక్తిచే ప్రజా బాహుళ్యమునకు, వేదాంతముచే భావిలోకమునకు క్షేమము లభించును.

నే నింతవరకు జెప్పినదాని సారాంశమిది: (1) భౌతిక దర్శన సిద్ధాంతములకు విరుద్ధములగు మతములు శుష్కాచార కారణకు, ఖండనమునకు దారితీయును. హైందవ వేదాంత దర్శన మీనాటి భౌతిక దర్శన సిద్ధాంతములకు సమ్మతమైనది (2) స్వార్థపరతచే మానవలోక కల్యాణము లభింపదనియు, పరస్పర సహకారమే అందులకు మార్గమనియు సంగీకరింతు మేని అట్టి నూతన సంఘ వ్యవస్థకు ప్రేరణమును, కారణ కలాపమును మనతత్త్వశాస్త్రమందే లభించును. ప్రజా రాజ్యములకు తత్త్వికముగ ధర్మము కూడ అందే సంపన్నముగుచున్నది. (3) ఇతర మతముల యెడ ఓర్మి పరమ ధర్మముగా మన వేదాంత దర్శనము విధించుచున్నది. కావున జగదభ్యుదయానికది చక్కనిదారి చేర్పరచిన దగుచున్నది. పదార్థ విజ్ఞానము మన్నను భౌతిక దర్శనములతో విరోధింపకయే లోకకల్యాణ మార్గము నది ఆత్మ ప్రతిష్ఠిత మొనర్చుచున్నది. అది మత్తుమందు కాదు; లోకయాత్రా రథమును రాచబాటపై నడపే పార్థసారథి.

(పాట్నా కళాశాలలో రాజాజీ చేసిన ప్రసంగమునకు తెలుగు.)

# విశ్వమున విశిష్టుడెవడు?

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఆ. వె. వాదఘూర్ణి రేగ "బ్రహ్మాండమున నేఁడు
జీవకోటిలో విశిష్టుఁ ?" డనుచు
మొదట లేచి పలికె భూదేవి దొడ్డమ్మ
వాక్కులందుఁ దొట్రుపాటు గదుర.

మ. "కులశైలంబులుఁ బుణ్యతీర్థ సుమహాకూపారముల్ మోయుదున్;
గలిగింతుం గడుఁ బాడిపంటలు ప్రజాకాండంబు వర్ధిల్లఁ, గొ
ల్లలుగాఁ బంచుచునుందు నా ధననిధుల్ వార్వీరు నా కెల్ల వా
రలకున్ నేన మహత్తర న్నగుదు మీరల్ లెస్స యోజింపుఁడా !

చ. అన విని దాని సైఁపక మహాభుజగుండగు నాదిశేషుఁ డి
ట్లనె; "ధరియింతు నాదగు ఫణాగ్రమునందు ధరిత్రి, నింతె కా
దనయము దేవదేవుఁడగు నంబుజనాభుని సేవచేయు పా
వనతముఁడన్ మహత్తరుఁ డెవండు ననున్ వెలిగా వచింపుఁడా !"

కం. పలు కది విని లోకము బీ
టలువాఱఁగఁ బెద్దనగి మృడానీపతి "యీ
చిలువను దాల్చితిని నా
గళమున నాకన్న నెవరు గలరు విశిష్టుల్ ?

కం. అల మృత్యుదేవతకు నిల
బలియగును బిపీలికాది బ్రహ్మాండంబుల్
గెలిచితినిఁగాదె దానిని;
హాలాహలాశనుఁడ; నేన యధికతరుండన్."

కం. ఆలించి శూలిమాటలు
గైలాసము పలికె; "శివుఁడు గాపురముండెన్
మాలోఁగిట; నాశృంగముఁ
బోలిన శృంగంబుగలదె భూలోకమునన్ ?"

కం. అదివిని ప్రతిధ్వనింపఁగఁ
బదిదిక్కులు రావణుండు పదిముఖములతో
వదరెం "బెకలించితి ని
ర్వదిచేతుల శిఖరాధరంబును దొలుతన్.

కం. ఆడించితిఁ గేలంగొని
క్రీడా కందుకముఁబోలె క్షితిధరమును; నీ
కేడు జగంబుల నాకె
వ్వాఁడున్నాఁడీఁడు? బాహుబల సంపదలన్?"

ఆ. వె. మూఁగఁగూరుచున్న వాలియంతట లేచి
వానివంకఁ గను నవజ్ఞఁ గనుచు
"నీ దశాస్యమృగము నేఁ దెచ్చియిచ్చితి
నాటబొమ్మగా మదాత్మజునకు."

కం. అనవుడు మానముతో నిం
దనుకం గూర్చున్నవాఁడు దాశరథియుఁ బ
ల్కెను; నే నీ వాలిని నా
ధనువున కెరఁ జేసికొంటి దర్పము వాయన్.

ఆ. వె. అట్టులగుట నేన యధికతరుండను"
ననుచు నాలకించి యటనొకండు
కావిపుట్టములను గట్టిన జడదారి
లేచి రామచంద్రుఁ జూచు చనియె.

మ. పరమాత్ముండగు నీ మహామహుని నిర్బంధించితింబట్టి; నా
చెఱఁ దప్పించుక పాఱిపోవుటకుఁ జేసెన్ యత్నముల్ కొన్ని; యే
మఱికే రేయుబవళ్లు వే కనుల సంస్తంభంబుఁ గల్పించితిన్
మఱి నా కన్నను మద్గృహీతుఁ డధికుండా? సుంత యోజింపుఁడా!"

చ. అనవుడు నొక్కరేని నెదురాడకపోయిరి కాదటంచు దా
నినిఁ; దనకన్న నాతఁడె యనేక గుణంబులఁ బెద్దటంచుఁ దోఁ
చెను బ్రతివానికిం; దుదికి సిగ్గున వ్రాల్చిరి మోములెల్ల వా
రును స్వమహత్తరత్వమది రూపఱఁ జీకటివోలె వెల్గుచేన్.

(శివానంద కథావళినుండి)

# కోనగణపతి ఖండవల్లి శాసనము

శ్రీ తురగా కృష్ణమూర్తి

పశ్చిమ గోదావరిజిల్లా తణుకు తాలూకాలో వసిష్ఠ గోదావరికి పశ్చిమముగా నొక్క యిరవైలు దూరమున "ఖండవల్లి" గ్రామమున్నది. అది తణుకు పట్టణమునకు ఆగ్నేయముగా సుమారుగా నాలుగైదు మైళ్ల దూరములో నున్నది. ఈ ఖండవల్లి గ్రామములోనే సుప్రసిద్ధ కవులును, అనేకాంధ్ర గ్రంథకర్తలును, కళాప్రపూర్ణులు నగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు జన్మించిరి. ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే "బొబ్బిలియుద్ధ నాటకము"న ప్రస్తావించబడిన "ఖండవల్లి మనుము" ఈ యూరికే!

నాకు ఈ గ్రామములో శ్రీ ఖండవల్లి సాంబశివ రావుగారి సహాయమున లభ్యమైన రెండు శాసనములలోను మొదటిది కోనగణపతి దేవునిది. శాసనము రెండు ప్రక్కలను వ్రాయబడిన ఒకే ఒక రేకు. రాగి కడియమునే వృత్తాకారముగ వంగింపబడి యున్నది. కడియము మొనలు కలిపి అతికించబడి పద్మాకారముగ నున్న ముద్రని రాగిరేకులచే అమరింపబడి యున్నవి. ఆ ముద్ర 2.0" వ్యాసము కలిగి ఊర్ధ్వభాగమున యోనిముద్ర పైన సూర్యుడును, కుడిభాగమున చంద్రుడును, మధ్య తారకయు, దాని క్రిందగల వామపార్శ్వమున చక్రమును, దక్షిణపార్శ్వమున శంఖము, అధోభాగమున మత్స్య వరాహమును దానికి కుడిప్రక్కను మత్స్యమును. యోనిను ప్రక్కను కూర్మమును చెక్కబడియున్నవి. రాగి కడియము 0.5" దళసరి కలిగి 3.2" వ్యాసము కలిగి యున్నది. ఈ కడియము రాగిరేకునకు యెడమప్రక్క 0.6" వ్యాసము గల రంధ్రమునుండి దూర్చబడి యున్నది. ఈ రంధ్రము రేకున కెడమ అంచునుండి 1.0" దూరమునను, పై అంచునుండి 2.8" దూరమునను, క్రింది అంచునుండి 8.0" దూరమునను పొడువబడి యున్నది. రేకు 1/10" దళసరి కలిగి 11.0" పొడుగు 6.3" వెడల్పు కలిగి 125 తులముల బరువు కలిగి యున్నది. శాసనము మొదటిప్రక్క 17 పంక్తులను రెండవప్రక్క 8 పంక్తులును కలిగి సంస్కృత శ్లోక రూపమున తెనుగు లిపిలో వ్రాయబడినది. అక్షరములు ఎడమనుండి కుడికి వ్రాయబడినవి.

ఇది కోనసీమను పదమూడవశతాబ్దియందు పాలించుచున్న కార్తవీర్యార్జుని (హైహయ) వంశీయుడైన కోన గణపతిదేవునిచే నొసంగబడిన క్షేత్ర శాసనము. శాసనకాలము శక సంవత్సరములు 1218 కు సరియైన క్రీ॥ శ॥ 1296 వ సంవత్సరము. దుర్ముఖి నామ సంవత్సర శ్రావణ శుద్ధ దశమీ మంగళవారము నాడీ దానము చేయబడినది. దానప్రతిగ్రహీత కపి గోత్రోద్భవులలో నగ్రగణ్యులును, వేదపారగులును, రాజపూజితులైన విఘ్నవాచార్యులు. దాన మీయబడినది "త్రింశత్తార పరిమిత క్షేత్రం." ఈ క్షేత్రమునకు హద్దులు తూర్పున కోటిపుంతి నరిమిపుష్ట, ఆగ్నేయమున బోలిసంపెలొప్పు, దక్షిణమున కుర్రాలపుంతి, నైఋతిని పులుపర్తి ప్రవేశి, ఉత్తరేశ్వరపురపు ముఖ్యానకుర్తి జావుగుగ్గిపుష్ట, పశ్చిమమును, ఉత్తరము నను ఉత్తరేశ్వరపురాంతర్భాగపు పరిహద్దులను, ఈశాన్యమున జావుగుండెపల్లమును. ఈ క్షేత్రము "పులుపర్తి" గ్రామమునకు వాయవ్యదిశ నుండినట్లు "పులుపర్తి పురి క్షేత్రం వాయవ్యాయాం సంస్థితం" యను శ్లోకమునందు తెలియుచున్నది. ఈ పులుపర్తి గ్రామమును ప్రస్తుతము "అన్నవరప్పాడు" గ్రామమని యనుచున్నారు. ఈ అన్నవరప్పాడు గ్రామమున నాకు లభ్యమైన కాటయ వేమారెడ్డి తామ్రశాసనమును త్వరలో ప్రకటింపనున్నాను. కాటయవేముని అన్నవరప్పాడు శాసనములో "అన్నవరప్పాడు" గ్రామమునకు "పులుపర్తిగ్రామ" మని యాదినామ మున్నట్లు తెలుపబడినది. ఈ క్షేత్రమును గణపతివలన విఘ్నవాచార్యులు స్వీకరించి భక్తిభావమున నుత్తరేశ్వరపురమున కలిపివేసెను.

## శాసన కాలము

శాసనములో దానకాల మీ విధమున వర్ణింపబడినది.

"రాజా గణపతి స్సోయం శకవర్షేషు జాగ్రతి,
నవకద్వయ సంయుక్తే సహస్ర ద్విశతాధికే.

దుర్ముఖివత్సరే మాసి శ్రావణే నవశోభ్యపి,
పక్షే విశమ్యాం వారేచ పురందరగురోః పతి."

కార్తవీర్యార్జునుని (హైహయ) గోత్రమునకు చెందిన హైహయులు కోనమండలమును క్రీ॥ శ॥ 1078 మొదలు క్రీ॥ శ॥ 1864 వరకు పాలించిరని చరిత్రకారులు నిర్ధారించియున్నారు. అట్టి కోన హైహయులలో గణపతి క్రీ॥ శ॥ 1254-1300 మధ్య పాలించినటుల తెలియవచ్చుచున్నది. కావున నీ దాన కాలము క్రీ॥ శ॥ 1254-1300 మధ్యకాలమున నే అయియుండవలెను. ఆ సంవత్సరము దుర్ముఖి వత్సరమైయుండియుండవలెను. ఆవిషయమును దృష్టియందుంచుకొని యీ శాసనకాలనిర్ణయమునకు గవేషించవలసి యున్నది.

పై శాసన శ్లోకములలోని 'నవశస్వ్యాఖ్య సంయుక్తే' అన్న పదములను 'నవాబ్దయు' అని పొరపాటుగా చదువగా శ్రీ హెచ్. కె. నరసింహస్వామిగారు (ఎపిగ్రాఫీ శాఖ సూపరింటెండెంట్, ఉదకమండలం) 'నవశద్వయు' అని సరియగు పాఠము చూపిరి. వారికి నా ధన్యవాదములు. 'నవశద్వయు' పాఠము నంగీకరించి 'సహస్ర ద్విశతాధిక' యనిచదివిన శకసంవత్సరము 1218 యగునని నే నూహించుచున్నాను. దానికి సరియైన క్రీ॥ శ॥ వత్సరము 1296 అగుచున్నది. శకవత్సరము 1218 (క్రీ॥ శ॥ 1296) దుర్ముఖి వత్సరమైనది గాన నీ శాసన కాల మిదియే యని నిర్ద్వంద్వముగా జెప్పవచ్చును. అప్పటికి కోనగణపతి పాలనమునకు వచ్చి నలుబదిరెండు సంవత్సరములగుచున్నది. కావున వయఃపరిపాకదశలో నున్న కోనగణపతి తనకులగురువులగు విష్ణునాచార్యునకు త్రింశత్తావిమితి క్షేత్రమును దానమిచ్చియుండె నన్న యబ్బురమేమియు లేదు.

## చారిత్రక విశేషములు

క్రీ॥ శ॥ 1254 మొదలు క్రీ॥ శ॥ 1300 మధ్య కాలమున కాకతీయుల పాలనము మహోన్నతదశ నందియుండెను. కాకతీయసామ్రాజ్యము కళింగముదాక వ్యాపించి సుస్థిర ప్రభుత్వముక్రింద పరిపాలింపబడుచుండెను. కాకతి రుద్రమ భర్త యగు చాళుక్య వీరభద్రుడు నిరవద్యపురము రాజధానిగా నేటి పశ్చిమ గోదావరీ మండలములోని కొంతభాగమును పాలించుచుండెను. చాళుక్య వీరభద్రదేవుని రాజ్యములోనిదే యైన కోనమండలము వారికి స్వతంత్రరాజ్యముగా నుండక సామంతరాజ్యముగా నుండియున్నట్లు చరిత్ర వలన మనకు దెలియవచ్చినది. కాని శ్రీమతి వి. యశోదాదేవి (M.A; M Litt) గారు "The History of Andhra Countrv" అను గ్రంథములో "Bhima and Ganapati did not acknowledge loyalty to the Cholas. Neither there is any reason to suppose their loyalty to the Kakatiyas. But they allied themselves with some local contemporary dynasties and this added to their strength" అని కోనమండలాధిపు లాకాలమున చోళుల యధికారము క్రింద గాని, కాకతీయ సామ్రాజ్యముక్రింద గాని యుండలేదని నొక్కి వక్కాణించుచున్నారు. మరియు నిరవద్యప్రోలు ప్రభువులు చాళుక్య వంశజులైన స్థానికులతో సంబంధ బాంధవ్యములు కలిగియుండి, తత్కారణమున బలవంతులైనారని కూడ సూచించుచున్నారు.

ఇంతవరకు లభ్యములైన శాసనాదికములవలనను, చరిత్రాంశములవలనను గణపతి, యాతని తండ్రి భీమ వల్లభుల సంయుక్తపాలనానంతరమున అనగా క్రీ॥ శ॥ 1300 సంవత్సరమునుండి కోనమండలమును భీమవల్లభుడును, ఆతని కుమారుడగు రామనాథదేవరయును సంయుక్తము (Joint) గా పాలించిరనియు, క్రీ॥ శ॥ 1318 వ సంవత్సరానంతరమునుండి ఈ యిరువురిని గూర్చిన విశేషము లేవియును తెలియవచ్చుట లేదనియు శ్రీమతి యశోదాదేవిగారు "Ganapati is not heard of after A. D. 1300 and Odayamahadevi does not mention him in her grant of A. D. 1306. An inscription at Palakol dated A.D. 1318 mentions the sons of Ramanadha Devara, son of Bhima Vallabha. So probably on Ganapati's death in A.D. 1300, his younger brother Ramanadha Deva joined his father Bhima Vallabha in exercising sway over Konamandala. And after A.D. 1318 neither Bhima nor Ramanadha are heard of" అని వ్రాసినారు. ఈ వ్రాతలబట్టి వృద్ధుడైన తండ్రి భీమ వల్లభుడు సజీవుడై యుండగనే గణపతి చనిపోయెననియు, ఒంటరిగా రాజ్యభారమును వహింపజాలక భీమవల్లభుడు తన తనయుడగు రామనాథదేవుని కూడ పట్టాభిషిక్తునిజేసి, సంయుక్త రాజ్యపాలనము నెరపెననియు విశ్వసింపవలయుచున్నది. ఇది సరిగాదు. శ్రీమతి

# కోనగణపతి ఖండవల్లి శాసనము

5. శ్రియః । తత్ర క్షేత్ర వరేణ్యస్య కాశ్యపీయస్యాన్వయ గోత్రతః ।
అస్తి రాజకులం రమ్యభాగ్య భాగైః భూషణం ।

6. రాజా గణపతిస్తత్ర రరాజ గుణసాగరః ।
యస్య క్షితి క్షితే నిర్మలకాం (గ్రా?) లభంతే దివిపత్ పదం । భీమవల్లభ

7. నామాభూత్ తస్య రాజ్ఞ స్తనూభవః ।
సప్తార్ణవ పరం సముల్ల (ం?) ఘ్య యస్య కీర్తిః ప్రకాశతే । తస్య భూమి పతే

8. రాసీత్ పుత్రః కుల విభూషణం ।
రాజా గణపతి స్త్యాగభోగ లక్ష్మీ నిజాశ్రయః । విరాజతే యస్య కీ

9. పాణ ధారా ప్రఫుల్ల నీలోత్పలజాత సఖ్యాం ।
కాంతిం నిగీర్ణామివ శత్రు నారీ నేత్రా

10. ంజనస్థాం పునరుద్వమంతి ॥ అథో గణపతి స్స్వయం కోన దేశం ప్రపాలయన్ ।

11. కల్పవృక్ష ఇతి ఖ్యాతిం భూదేవానాం సమశ్నుతే ।
దేవనాచార్య సంభూత శ్రీరంగా

12. చార్య సంభవే । సభక్తిం విఠ్ఠనాచార్యే భజతే శంకరే యథా ।
ప్రత్యక్షభావం ప్రతిపద్య దాతు

13. ం భుక్తిం చ ముక్తిం చ సుధీశ్వరాణాం ।
కృతావతారం గిరిశం గృణంతి తం విఠ్ఠనాచార్య మత్ర

14. పలోకాః । రాజా గణపతి స్స్వయం శకవర్షేషు జాగ్రతి ।
సవకద్వయ సంయుక్త సహస్ర ద్వికే

15. తాధికే । దుర్ముఖి వత్సరే మాసి శ్రావణే ధవళ త్విషి ।
పక్షే దశమ్యాం వారేచ పురందర గురోః

16. సతి । గుణినా మగ్రగణ్యాయ కపిగోత్రస్య మౌళయే ।
మనోవాక్కాయ వంద్యాయ విఠ్ఠనా

17. చార్య శంభవే । పులుపర్తి పురే క్షేత్రం తస్య వాయవ్య సంస్థితం ।
త్రింశత్ఖారి మితం భ

## రెండవవైపు

1. క్ష్మా ప్రతాప రుద్రేమ సమ్యకం ।

దత్త క్షేత్రం సిద్ధనా చార్యేణ త్రింశత్స్థారిమితం తతః । ఉత్తరేశ పురాంత

2. స్థం ప్రకాత్యా కుమార విప్రసాత్ ।

అస్య త్రింశత్స్థారి పరిమితస్య క్షేత్రస్య సిమానః । ప్రసిద్ధ ను వెశ భాను

3. యాం కన్యాం ... । పూర్వతః కొలపుంత నడిమిపుష్టి!

ఆగ్నేయతః బ్బొరికుంట్ల తూపు । దక్షిణతః గు

4. ట్టాలపుంత । నైరుతిన పుంగనశీ ప్రవెరిసి ఉత్తరేశ్వరపు మయ్యాన కొట్ర

జాపుఱు గడ్డ పుడ్డి । పశ్చి

5. మతః । ఉత్తరతః । ఉత్తరేశ్వర పుర్వాంత బ్బార్వితత్వా

త్తత్సమాన ఎవ సిమానః । ఈశానతః జాపుఱు గడ్డ...

6. ల్లము । ఇద మాచంద్ర మాసూర్యాణం సుస్థితం క్షేత్ర శాసనం ।

అస్తు స్వస్తికరం కామం విప్రాణా ము

7. శ భాజినాం । సామాన్యోయం ధర్మసెతు నృపాణాం

కాల (లే?) కాలె పాలనియో భవద్భిః । సర్వా నేతా న్భా

8. వినః పార్థివెంద్రా న్భూయో భూయో యాచతె రామచంద్రః ।

శ్రీ దెవ్యైనమః ॥ శ్రీ ॥

# క్షంతవ్యాలు!

శ్రీ "శండిల"

"భద్రాద్రి రాముడి దర్శనం రేపు చేసుకుందాం."

"అలాగే."

"సాయంకాలం వరకు చల్లగాలికి అలా వెళ్తారా? స్నానానికి వేన్నీళ్ళు పెట్టి వుంచుతాను బంగళాలో. పెందరాళే వచ్చెయ్యండి."

"సరే."

"కొండలు, గుట్టలూను. దారీ గట్రా బావుండదు."

పనిమీద గాని యాత్రార్థమై గాని భద్రగిరికి వచ్చిన ఎందరో ఉద్యోగుల్ని చూశాడు వీరయ్య. వారికి తాను నిర్ణయించుకున్న పద్ధతిలో సేవలు వంటివి చేశాడు. కాని ఈయనలాంటి అధికారి అతనికి ఇప్పటి వరకు తగులుబడలేదు. మధ్యాహ్నమనగా లాంచి దిగి వచ్చినప్పటినుంచి ఆయన్ని అనుసరిస్తూ ఏవిధంగా తృప్తిపరచి మెప్పించగలనో అని దారులు తీయడానికి తాపత్రయపడుతూనే వున్నాడు. పాతికేళ్లకు పైగా పాతుకుపోయిన వీరయ్య. వయస్సుతో పాటు అనుభవం కూడా ఆర్జించిపెట్టిన సత్తాను అతనికి ఎటువంటి అధికారినైనా ఇట్టే తనదారికి మళ్ళేట్లు చేసేది. ఈయన విషయంలో అది పారటంలేదు. ఉద్యోగము హోదాకు సంబంధించిన ఆరాలు ఎంత తీద్దామని ప్రయత్నించినా అంతు చిక్కటంలేదు. ఇంతకు ఆయన ఎందుకిక్కడకు వచ్చినట్లో కూడా ఇతమిత్థం తేలలేదు. పోతే ఆ కొద్ది ఘంటలలోను ఆయన పలకరించిన — అవటి గోదావరీతీరం, పరుపుగా పరచబడ్డట్లున్న తళతళ మెరుగు ఇసుక ఉపరితలం, ఆలయ ప్రాంగణానికి దారితీసే పావంచాలు, చలనంలేని పక్షిరాజాన్ని గుర్తుకు తెస్తూ నిలబడ్డ చింతలు — ఇటువంటివాటిని కూర్చిన భోగట్టా వీరయ్యకు కావలసిన అంశాన్ని అందనిచ్చిందిగాదు. దీన్ని గురించి పదేపదే ఆలోచిస్తూ ఆ ముసలిబంట్రోతు బంగళావైపు నెమ్మదిగా నడుస్తున్నాడు.

ఇంక ఆయన — దరదర ముందుకు పోతూనే వున్నాడు. అప్పుడప్పుడు భుజంమీది తొప్పితువ్వాలుతో నుదుటనుగ్రమ్మే చెమట బిందువుల్ని వొత్తుకుంటున్నాడు. ఆయన నడకవేగాన్ని దారి ఆపడానికి వీల్లేదు. బండలు, వాటిమధ్య పల్లాలు — ఇంకా కొంచెం ముందుకుపోతే ఎడమచేతివైపు నూరుగజాల దూరంలో నిత్యమూ ప్రవహించే పావనగోదావరీ నదితో స్నేహం కలిగి నిరంతరము ప్రొద్దుపుచ్చే, కుడివైపున నిటారుగా ఆకాశంలోకి ఎగబ్రాకడానికి ఉత్సాహపడుతున్న మెట్టలు... ఆయన బూటుకాళ్ళ క్రింద పడి నలిగిపోయే రాలిన యెండుటాకులు మర్మర ధ్వనులు చేస్తున్నాయి. సంజ సమీపిస్తున్నా గ్రీష్మ ఋతువు ఆఖరి పాదపు ఎండ — మరి అది ఆషాఢపు చివరి చురుకు కదా! — చర్మాన్ని ఉడికిస్తూనే వుంది.

ముందుకు చకచక సాగివచ్చిన ఆయన గమనం అనుకోకుండా ఆగిపోయింది. ఆయన సమీపించింది కూడలి మాత్రం కాదు. ఏ కారణం చేతనైనా కావచ్చు — అక్కడి కొండకోనకు త్రోవలేసినట్లు పరచి వుంచబడ్డాయా అనే భ్రమ గొల్పే ఎండుటాకుల నిడుపాటి ప్రోవులు ఒక కొసనుండి అంటుకొని చిటచిటలాడుతూ కాలుతున్నాయి. పాంథులు విసిరి పారేసిన — చివర కొద్దిపాటి నిప్పుతో మిగిలి వున్న సిగరెట్టు ముక్క — లేదా దూరాన్నుంచి ఎగిరివచ్చిన నిప్పురవ్వ — కనీసం కృత్తికాపవనానికి ఒండొంటి ఘర్షణ ఫలితంగా చెట్ల కొమ్మలనుండి పుట్టిన అగ్ని కావచ్చు — ఏదైనా చాలు అక్కడ మంటలు పుట్టించడానికి. విషవాయువు పొగలు వ్యాపించినట్లు, నీలివార్తల పుకారు పాకినట్లు, అంటువ్యాధి ప్రాకినట్లు, ధ్వనులు ప్రయాణించినట్లు మంటలు మింటికెగబ్రాకడానికి చిరునాలుకలు చాస్తూ క్రమంగా కొండకొమ్మును చేరుకోవడానికి పోటీపడుతున్నాయి. అది ఒక మహారణ్యమేమో! పొగల సెగలు నలుదిశల గ్రమ్ముకుంటున్నాయి. చీకటిలో అదే దృశ్యాన్ని ఆయన చూచివుంటే అంధకారబంధురమైన అనిశ్చిత దుర్భేద్యమైన దుర్గాన్ని అధిరోహించడానికి కాగడాలతో ఎగబ్రాకే సేనల బారుల వెలుతురులు దృష్టిపథంలో మెదిలివుండేవి.

ఆమెకింకా తెలియలేదు. పక్కల్లో ముందుగా ప్రపంచంలో అడుగుపెట్టిన ఆ యువ - విద్యార్థినికు కూడా కావచ్చు —తన నిద్ర గదిలోకి సీతాయియైపై ఆ అమాయికపు వేలిమ బంగారాన్ని కేవి వుంచబడలేదింకా గాని. అద్దె సీటుకు ఎగారే వచ్చింది. కాని పరికీలకుని అందినా వ్యక్తులకి కొంచెం దూరంగా వుంటుంది. ఇంతలో దావ మొలకకీ లేదు.

ఆమెది యౌవన తీవ్రత. దాని ముప్పు రానికి ముందు వెనుకలు లేవు. ఎట్టి దిట్టరైనా ఆ అవస్థలో అంతులే. అక్కడ మనం అనుకొన్న ప్రమాణాలేమీ పని చెయ్యవు. అది గర్వం. దాని తీవ్రతకు అవధులుండవు. వేగానికి లెక్క కట్టడం కష్టం. అది మనిషి చేత ఇప్పుడు ఈ పని ఇలాగ చేయిస్తుందని ఇంత వరకు ఇత మిత్థంగా చెప్పగలిగిన వాడెవ్వడూ లేడు. ఒక వేళ వున్నానని ముందుకువచ్చినా వాడిమాటలు నమ్మ వీలు లేదు. కనుక నే ఆమె అలాగుచేసింది. ఎలుగెత్తి పిలుద్దామని పిలువలేకపోయింది. ఇంకా ముందుకు సాగి చుట్టు ప్రక్కల చూద్దామని చూడలేకపోయింది. 'ఈ వస్తువు ఎవరిదో—దీనిగొడవ మనకెందుకు?' అనుకొని దానిని వదిలిపెడదామని ఒకటికి పైగామార్లు స్థిరీకరించుకొని కూడా ఆమె ఆ రువ్వాలును తీసి పైన కప్పుకోకుండా వుండలేకపోయింది. మనిషికి పతనం అనేది ఎప్పుడు ఏ మూలనుంచి ఎలాగ సంభవిస్తుందో ఎవరూ చెప్పలేరు.

ఆ పిల్ల ఆ బొమ్మ రువ్వాలుతో ఒళ్ళంతా శుభ్రంగా తుడుచుకొంది. అంతటితో ఆగాలా! జుట్టును దానికి పిడిపెట్టి అనేకవిధమైన వయ్యారాలు మొలికించేటట్లు మెలిద్రిప్పి తలపై తెల్లని మల్లెపువ్వులను కుప్పగా తురుముకొన్న కొంత దేవతవలె ధరించింది. ఇంక తర్వాత ఆమె ఏంచేసిందో ఆయనకు సరిగా తెలియదు. కారణం సూర్యుడు తిరిగివున్న పరిస్థితిని చూడలేక సిగ్గు పడ్డాడా అన్నట్లు తన ముఖాన్ని పశ్చిమ దిశారాణి ఒడిలో దాచుకొన్నాడేమో. ఆమె చకచక తన నివాసం వైపు వస్తోంది. పాతిక గజాలదూరం ఎడంలో ఆయన ఆమెను అనుసరిస్తున్నాడు. ఎవరైనా ఆయన్ను ఆ క్షణంలో చూసి ఎందుకీయన ఈ పడుచువెంట పడ్డాడు? అని శంకిందుకుంటున్నందుకుమాత్రం ఆయన ఆ పని చెయ్యడంలేదు. ఊరికి కొంచెం దూరంలో గాలి ధారాళంగా వీచే స్థలంలో నిర్మింపబడ్డ గిరిజనుల నూతన నివాసస్థానాలలో ఆమె వసతివుంది. దాన్ని ప్రభుత్వంవారు ప్రణాళిక పనులలో ఒక భాగంగా నిర్మింపజేశారు. అప్పటి గిరిజనుల సేవకని కొందరు అధికారులను, సంఘసేవకులను నియమించి ప్రత్యేకంగా ఆ పని నిర్వహిస్తున్నారు. ఆమె గది తలుపు తాళంతీసింది. కనుమాపు చీకటిలో కి అగి ఆయన గ సందులోనుంచి ఆ గదిని చూస్తున్నాడు. అది ఒక్కటే వుంది దానికి అనువుగా కట్టబడ్డ గదులలోనది చెందినది. లోపలికి ప్రవేశిస్తూనే ఆమె తలుపు గడియ వైసు కొంది.

## 3

కొద్ది క్షణాలు మౌనంగా నడిచాయి. ఆమె ఎన్నడు వినవటువంటి నూతన ఫక్కీలో తన తలుపు బయటనుంచి తట్టబడటం గుర్తించింది. ఆ స్వరం అది కొంత పురుషప్రతిమైనది. అవతలి వ్యక్తి తన మాట, ముల్లె వినా లోపల వుండిపోయినట్లు దబదబ బాదు తున్నట్లు ధ్వనిస్తోంది. ఆమె దరాలున తలుపు తెరిచింది. ఎదుటనున్న వ్యక్తిని చూచింది. ఆయనా ఆమెను చూశాడు. కొన్ని సెకన్లు మాత్రమే వారి మధ్య మౌనంగా నిలబడగలిగాయి.

“ఎవరు మీరు? ఎవరికోసం వచ్చారు?” అవిరి పడేటట్లు ఆమెనుండి వచ్చింది ప్రశ్న.

“నేనేనండి. ప్రత్యేకమైన పనిమీదవచ్చాను” క్షమాయే ప్రత్యుత్తరంగా ఆయననుండి వెలువడింది.

“ఆ పనేమిటో తెలుసుకోవచ్చునా!” ఈ ప్రశ్నకూడా విరసంగానే వచ్చి ఆయన్ను ఘాటుగా తాకింది.

“నా వస్తువు ఒకటి ఈ ఇంటిలోకి వచ్చింది. దయవుంచి దాన్ని ఎక్కడ వున్నదో వెదికి తీసుకొని వెళ్ళనివ్వండి” ఇది జవాబుకాదు; రెట్టించిన క్షమా.

ఆమె కణత పగిలినంత పనయ్యింది. ఒలకంతుని అరచేతి 'దెబ్బకు పడ్డ కదలిన బలహీనుని ముఖం ఆమెలో ద్యోతకం కావడానికి ప్రయాసపడింది. అయినా ఆమె ఆడది. అసమానమైన స్త్రీ - తన మార్పును తానే ధైర్యంగా సంబాళించుకోడానికి ప్రయత్నించి “మీరనేది నా కర్థం కావడంలేదు. డొంకతిరుగుడు దారివదలి సూటిగా చెప్పండి. మీకు ఏమి కావాలో! ఈ స్థలంలో ఈ సమయంలో ఇక్కడ పురుషులకు ప్రవేశం నిషిద్ధం!”

ఆయన పకాలున నవ్వడానికి ప్రయత్నించాడు. కాని మందహాసం మాత్రం చెయ్యగలిగాడు. మరి

# రోహిణీ చంద్ర మంగళ యోగము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

"జరిగిన ఫలములను జాతకయోగములతో సమన్వయము చేయుటతోనే కాలక్షేపమగుచున్నది. కాని, భావిఫలములను గూర్చిన ప్రతిపాద్యము. ఇందుమించుగా, ఈ వ్యాసములు కేవల పరీక్ష వంటివే."

"భారతి" యందలి నా వ్యాసములను కటాక్షించిన మహాశయులలో కొందరు పై అభిప్రాయము లిచ్చిరని వింటిని. మహాశయుల ధోరణితో వారట్లు చెప్పియుండినా, సత్యమును వారు గ్రహింపగలుగుటచే, నా పరిశ్రమ సఫలమే. వ్యక్తుల జీవితములకు భావి ఫలములు సూచించు ఉద్దేశముతో నేను వ్యాసములు వ్రాయుచుండలేదు. రాజకీయ పక్షములకు కాని, రాష్ట్ర తంత్ర నిర్వాహకులకు కాని, రానున్న కష్టసుఖములను జాతకముల ద్వారా ఊహించి ప్రకటించుట సముచితము నా ఉద్దేశము కాదు. నా వృత్తిలో అట్టి కార్యము అనుచితము. ఇతర ప్రముఖవ్యక్తికి ఇన్ని సంవత్సరములలో ఆయువు తీరునని కాని, ఇట్టి రాజకీయవ్యక్తి ఇట్టి నెలలో శత్రువుల కుట్రచే అపమృత్యువుపాలగునని కాని, పత్రికలలో ప్రకటించుట ఎంత ప్రమాదకరమో, పాఠక మహాశయులు సూక్ష్మముగా ఊహింపగలరు. ఇట్టి వ్రాతలలో, కాకతాళీయముగా, ఏ ఒకటి అయినా ఫలించినచో నమ్మ ప్రమాదమును కాని, కీర్తిని కాని, నేను ఆశించుటలేదు. అనుటచే, పైవిమర్శ ఉచితమే.

మరి, గత జీవితఫలదర్శనమే నిరర్థక మందురేమో ? అనేక కారణములచే రాజాదరమును, ప్రజాదరమును కోలుపోయి ప్రాచీనజ్యోతిశ్శాస్త్రము క్రమముగా హీనస్థితికి వచ్చియుండుట అందరెరుగుదురు. తత్ఫలముగా, ప్రాచీన ప్రయోగరహస్యము లనేకములు మరుగుపడినవి. అవి తెలిసిన ప్రాచీనులు కాలగర్భమున అంతర్హితమయినారు. పత్రికలలో ప్రచురింపబడు వారఫలములు, మాసఫలములు, మాత్రమే భారతీయజ్యోతిశ్శాస్త్రపు పరమ ప్రయోజనమని అన్యదేశీయులు భావించు స్థితి వచ్చియుండుట శోచనీయము.

ప్రాచీన సంప్రదాయపు సూత్రములు, ప్రయోగపద్ధతులు వెలికితీసి, వానిని జీవిత విశేషములతో సమగ్రముగా సమన్వయపరచుట సాధ్యమని, ఆధునిక కాలపు పరిశోధక ఫలితములను నిరాదరించుట శాస్త్రమునకు నష్టమని పాఠకమహాశయులకు సోదాహరణముగా మనవి చేయుటమాత్రమే నా ఉద్దేశము. ఈ విషయమున ఆధునిక విద్యావంతులకు విశ్వాసము కలిగినచో శాస్త్రాభివృద్ధియగుటకు దారి యగునని నా ఆశ. అట్టి ఆశతోనే, వాస్తవ జీవిత ఘటనలను గ్రహించి అనేకములను శాస్త్రసమన్వయము చేసి చూపుచుంటిని. జ్యోతిశ్శాస్త్రాభిమానము కల ఆధునిక విద్యావంతులలో ఆంధ్ర మహాశయులలో శాస్త్రాభ్యాస కుతూహలము, ఏ కొంచెమైనా ఏ కొంచెమయినా, కలిగితేనే, నా ప్రయత్నము సార్థకమే. ఇతర శాస్త్ర విషయములలో వలె దీని పద్ధతులను గూర్చి వారికే పరిశోధనము సలుపగలరు. చేయబడిన పరిశోధనలెన్నియో యున్నవి. ఒకరిద్దరితో సాధ్యములైనవి కావు. నేను కాకున్న వేరొకరయినా, కొన్ని దినములకయినా, ఆంధ్ర భూమిలో ఈ శాస్త్ర విషయమున అట్టి పరిశోధనము తప్పక జరుగగలదు. 'కాలో హ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ.' అను భవభూతి వాక్యము నాకు చేయూత.

ఒక్కమాట! ఇట్టి నెలలో గ్రహదోషము తొలగును వచ్చునని, ఇన్ని నెలలకు కూతురు వివాహము జరుగునని, ముందుగా ఫలాదేశము చేయుట నా అభిమతము కాదు. దైవమునకు ఎంత బలముండినా, పురుషకారపు సాహాయ్యము లేనిదే ఫలకారకము కాదని శాస్త్రకారులు నొక్కి చెప్పుచుండగా, పురుషకారమునకు వలదు చూపని అట్టి భావిఫలాదేశమునకు ఏపాటి విలువగలదో చదువరులు ఆలోచింతురుగాక. ఇట్టి ఫలములు చెప్పుట వారలకు ముఖప్రీతికొరకే అనుట తప్పు కాదు. ఇట్టి కాలములో వివాహము జరుపుట దాంపత్యజీవితమునకు శ్రేయస్సని, ఆరోగ్యాభివృద్ధికి ఇట్టి కాలములో ప్రయత్నపడుట ఫలదాయకమని, చెప్పుటమాత్రమే శాస్త్రసమ్మతము, ఉపయోగకరము అగు పద్ధతి అని నా మనవి. అనేక సందర్భములలో ఆలోచించినవారికి, తోచినంతలో,

అట్టి సలహా లిచ్చియుంటిని కూడ. నా వ్యాసములను శ్రద్ధతో కటాక్షించిన చదువరులలో కొందరయినా ఇది గమనించియుండకపోరు.

పురుషకారమునకు ఏ కొంచెమయినా విలువ కల దను భావము పరా? దైవము, అనగా గ్రహచారము, కల్పించిన మాయయే అని తలంచువా రుండిరని, అట్టి 'మాయాతీత స్వరూపు' లకు సమాధానము చెప్పుట సామాన్య జనులకు సాధ్యముకాని పని. వారి దృష్టిలో భావము, భావించువాడు, భావించబడు పదార్థము, అన్నియూ మాయయే—తాము తప్ప!

అని యుల్లంఘించెదను. అత్యాశ్చర్యకరము లగు అనుభవములు గల పడుచుజాతిక మొకటి ఉదాహరింతును. శాస్త్ర సూత్రములు ఎట్లు అతుకుచున్నవో, చిత్తగింతురు గాక.

కొన్ని సంవత్సరములకు పూర్వము నేనొక నగరమునకు పోయియుండి, అచటి నా ఆప్త బంధు వర్గమునకు చేరిన ఒకానొక సీమంతిని ఇంటిలో విడిసియుంటిని.

ఒకనాడు ఏదో ప్రస్తావవశమున ఆమె ఇట్లు ప్రశ్నించెను.

"మానభంగమునకు వెరచి ఆర్తురాలగు నొక పడుచు పారివచ్చి రక్షించమని నన్నాశ్రయించినది. ఈ గొడవ మనకేల వదలుమని నా భర్తగారు నాకు ఆజ్ఞ ఇచ్చినారు. అపుడు నా కర్తవ్యమేమి?"

"ఇది చాలా చిక్కు సమస్య. రెండును గొప్ప ధర్మములే. వివరములు పూర్తిగా తెలియక అభిప్రాయము వ్రాయరాదు." అంటిని.

"అయితే కథ పూర్తిగా చెప్పమంటారా?" అని ఆమె అడిగినది.

"నీ ఇష్టము" అని ప్రతి ఇచ్చితిని. ఆ సువాసిని తెలిపిన కథ సారాంశ మిది.

ఏడాదిక్రింద నొకనాడు ఉదయము తొమ్మిది గంటలకు ఆమె భర్త స్నానపానాదులు ముగించి వాడుకచొప్పున కార్యస్థానమునకు వెళ్లినాడు. సాయంకాలమునకే అతడింటికి రాగల్గుట. తెల్లవారు జామున లేచి, స్నానముచేసి, వంట వార్పులు సవరించుట, ఏడుగంటలకు పారాయణ పూజా సామగ్రిని భర్తకొదిగించుట, ఎనిమిది గంటలకు అతని భోజనాది సదుపాయములు సమకూర్చుట, అతడు కార్యస్థానమునకు వెళ్ళిన తరువాత నెమ్మదిగా కూర్చుండి స్తోత్ర పాఠములతో, మంత్రజపాదులతో, కొంత కాలము గడపుట, భోజనానంతరము ఏ పురాణమో, పుణ్యకథయో చదువుకొనుచు కాలయాపనము చేయుట, ఆమె దైనిక కార్యక్రమము. ఆమె సంస్కారము గొప్పది. మూడు నాలుగు భాషలలో సరసముగా సయుక్తికముగా నిర్దుష్టముగా ఆమె మాటలాడగలదు. మధ్యాహ్న కాలమున చుట్టుపట్టు ఇండ్ల కుటుంబినులు తమ సమస్యలను ఆమెకు చెప్పి ఆమె సలహా తీసుకొనెడివారు. వారిఅభిప్రాయములో ప్రవర్తనమో, నైతికముగా ధార్మికముగా క్రమము తప్పినదని తోచెనేని, నిశ్శంకముగా ఖండించి వారికి బుద్ధిచెప్పి పంపుటకు ఆమె వెనతీయునది కాదు. ఇరుగుపొరుగు వారికి ఆమెయందు ఎంతో గౌరవభావము.

1956 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 20 వ తేదీ అది. రమారమి ఉదయము పదిగంటల వేళ విరామముగా కూర్చుండి ఏదో స్తోత్రము నామె పఠించుచుండెను. అపుడు తెరచియున్న తలవాకిలి తలుపులను దబాలున తెరచుకొని ఒక పదునాలుగేండ్ల పడుచు చెంబొకటి చేతపట్టుకొని, అపరిమితమైన ఆత్రముతో లోపల ప్రవేశించి వెంటనే తలుపులుమూసి గొళ్ళెము తగిలించగా, ఆమె ఏకాగ్రతకు భంగమాయినది. తీవ్రముగా రొప్పుచు, చేతులు కాళ్లు వణకుచుండగా తలుపుల కానుకొని నిలిచియున్న ఆ పడుచును చూచి దగ్గరకు పిలుచుచు విషయమేమని ఆమె ప్రశ్నించినది. బాష్పపూరిత నేత్రములతో నోటమాట వెలువడక గడగడ వణకుచున్న ఆ చిన్నదానిని ఆమె సమీపించి దయతో ఆశ్వాసించి భయము లేదని [illegible] ధైర్యము చెప్పి, నమ్మకము కలిగించిన కొంతసేపటికి పులుకు పులుకుమని చూచుచు, "బాబ! బాబ! చంపుటకు సిద్ధము! దిక్కు లేదు. పారివచ్చినాను. బావినో, చెరువునో, చూచుకొంటాను. అంతవరకే కాపాడమ్మా!" అని ఆపడుచు బావురుమని వాపోయినది.

ఆ సీమంతినికి ఆపడుచు దూరపుబంధువు; చిన్నతనమందే తండ్రిని కోలుపోయిన అభాగ్యురాలు. పోషించుశక్తికాని, ఆర్థికవసతికాని లేనిది తల్లి. బంధువుల ఇండ్లలో నానాకష్టము లనుభవించుచుండి, తన అక్కయింట కొన్ని దినములు గడపుటకై వారము దినములక్రిందటనే ఆనగరమునకు వచ్చియుండుట! అక్క గర్భిణి. అందులో తొలిచూలు. ఆరోగ్యము, వసతిసహా మట్టమే. ఇతరు లెవరు కాని సహాయము లేరు.

"వివేకభ్రష్టానాం భవతి వినిపాతశ్శతముఖః." అనుకొని, ఎంతకయినా తెగినబంటే అతను. భర్తగారితో తాను మాటలాడుటకు పూర్వమే, అతడు కార్యస్థానమునకే పోయి, ఉన్నాడు. లేనిచో, వాలుకు చాడీలు చెప్పినచో, అమాయక సాధుశీలుడైన భర్త ఆ మాటలను నమ్మి ఇంటికివచ్చి ఏమి అజ్ఞాపింతునో, అని ఆ వివేకవతి తలచి. ఇంటికే సమీపమునందున్న తనకు విశ్వాసపాత్రులగు అన్యజాతి కుటుంబిని ఇంటికి పోయి విషయముల నెరిగించి, ఆమె యింటిలో కథానాయకురాలిని దాచివచ్చినది. సాయంకాలము అయిదు గంటలకు ఆ మూర్ఖుడు వెంటరాగా, ఆమె భర్త సరాసరి ఇంటికి వచ్చి ముఖము చిట్లించుకొని కోపముతో. "ఈ గొడవతో నీకేమిపని? అవివేకము! ఆ చిన్నదానిని ఇతని వెంట పంపివేయుము' అని భార్యను దండించినాడు.

ఆ చిన్నది వచ్చియుండినది వాస్తవమే అనియు. ఉపవాసముతో నున్నందున అన్నము పెట్టగా భుజించి వెళ్ళిపోయినదనియు, తరువాతి కథ తనకు తెలియదనియు, నెమ్మదిగా తొట్రుపాటులేక, భయపడక, ఆమె ప్రతి చెప్పినది. ఇంటిలో దాగియున్నదేమో అని వెతికిచూచి, ఫలము లేనందున కోపముతో శపించుచు ఆ మూర్ఖుడు వెళ్ళిపోయినాడు. తరువాత ఆ రాత్రి తొమ్మిది గంటలకు ఆ నగరమునకే దూరముగా కాపురమున్న తన సోదరునికి రహస్యముగా వార్తపంపి పిలిపించి, కథ నెరిగించి, ఘోరమగు గాలియు వర్షములో, ఆ పడుచును అతనివెంట పంపి, మరుదినము తగిన రక్షణతో ఆమెను ఆమె మాతామహ స్థానమును చేర్చువాక ఆ సుమంగలి నిద్రపోయినదికాదు. కాలక్రమమున తన భర్తకు విషయమంతయు సవిస్తరముగా నచ్చచెప్పి, అసత్యమాడినందుకు క్షమింపుమని ఆ ధర్మశీల అతనిని వేడుకొన్నదట!

సావధానముగా విని, ఆమె సాధుశీలమునకు, ధైర్యమునకు, సమయస్ఫూర్తికి, ఎంతో ఆనందపడితిని. ఆమె భర్త పుణ్యాత్ముడనుకొంటిని.

"గొప్ప సుకృతము చేసినావమ్మా! అసత్యమాడుట దోషమే. కాని, శరణాగత రక్షణమునకై అట్లు చేసితివి. మహత్తర ధర్మమునకై చేసిన ఈ అల్పదోషము గమనించదగినది కాదు. ఇట్టిదే ధర్మసూక్ష్మమందురు పెద్దలు." అంటిని.

ఇట్టి అనుభవము వచ్చుటకు కథానాయకురాలి జాతకములో ఏ విశేషమున్నదో, పరిశీలించుటకు నేను కుతూహలము చూపగా, ఆ జాతక సామగ్రి నామె తెప్పించి ఇచ్చెను.

ఆ జాతకమునకు నిరయన చక్ర మిది:—

| | | | |
|---|---|---|---|
| ర 8-34 | | శ 1-36<br>చ 16-2<br>కు 16-11<br>శు 21-36 | |
| కే 19-32<br>బు 15-8 | (నిరయన)<br>జాతక<br>చక్రము | | |
| గు 24-32<br>ల 1-10 | | | రా 19-32 |
| | | X 0-10 | |

జన్మనక్షత్రము రోహిణి. జన్మకాలచాంద్ర దశాశేషము (జ్యోతిర్గణితపు అయనాంశలతో) 5 సం॥ 5 నెలలు, 21 దినములు. రాహు మహాదశలో రాహ్వంతరములో ఈ క్లేశము వచ్చుట.

ఈ చక్రములో ముఖ్యమయినది చంద్రమంగళ యోగము. దీనిచే ధైర్యసాహసములతో ప్రవర్తించు స్వభావము వచ్చినదనవచ్చును. ఇది సప్తమ లాభాధిపతుల సంయోగమగుటచే, భర్తృ సంపాదన విషయమున పనికివచ్చుగాక. లాభభావము జ్యేష్ఠసోదరిని తెలుపునది. దానినుండి సప్తమభావము (అనగా, పంచమస్థానమనుట) ఆమె భర్తను (బావను) తెలుపును. అట్టి పంచమభావాధిపతి శుక్రుడు (బావ) కుటుంబస్థానమందుండి, చంద్ర కుజులకు త్రికోణమగుటచే, ఈ యోగము జాతకురాలు బావగారికి సులభముగా లోబడుటకు తగియుండునేమో కాని, అతనితో ద్వేషము సంపాదించుకొనుటకు తగినదనుకొందును. నా ఊహ అసంగతమయినచో, చదువరులు క్షమింతురు. అది యట్లుండె, రాహు మహాదశలో, రాహు భుక్తిలోనే యీ కథ జరుగనేల? అయనాంశలను

# రోహిణీ చంద్రమంగళ యోగము

మార్చి వేరు భుక్తులను సాధించవచ్చునన్నచో, అది వేరు మాట.

ఇక, సాయన జాతక మేమనుచున్నదో, చూతము. ఆ చక్రమిదే:—

| | | | |
|---|---|---|---|
| కే 12-34<br>బు 8-10 | ర 1-36<br>పుణ్య 1-40 | శ 24-38<br>(వ) 27-18 | చ 9-4<br>కు 9-13<br>గు 14-38 |
| శు 17-36 | (సాయనము)<br>— | | దాంపత్య<br>0-48<br>భర్త 24-3 |
| I 24-12 | కథానాయకురాలి<br>స్పష్ట<br>జాతకకుండలి | | య 8-36 |
| | X 8-12 | | రా 12-34<br>ఇ 28 2[illegible](వ) |

ఇచట పయి తెలిపిన చంద్రమంగళయోగ మున్నది. కాని, ఆధిపత్యములు మారుటచే, అర్థము భేదమగును. పంచమ భావాధిపతి (బావ) బుధుడు ఆ కుజ చంద్ర సంయోగమునకు సింహకేంద్రవేధలోనుండి దుష్టుడైనాడు. బావగారి చేష్టలు జాతకురాలి మనస్సునకు (చంద్రునికి) నచ్చక, ఆమె సాహసము చేసినదనియు (కుజుడు దశమాధిపతి). లాభాధిపతి బృహస్పతి (జ్యేష్ఠ సోదరి) ఆ కుజచంద్రుల సమీపమునందుండి దుష్ఫలము రానీయక రక్షించినాడనియు, ధర్మస్థానాధిపతియగు శుక్రునిపై ఆ గురువు శుభదృష్టితోనుండుట కారణమున శీలభంగము కలుగకుండ ధర్మమును రక్షించినాడనియు, సమన్వయము చేయుట హృదయంగమముగా నుండునని నా భావము. సహృదయులే ప్రమాణము.

విశేషమేమనగా జాతకురాలిని కాపాడిన సాధ్వి మతల్లి మీనలగ్నములో బృహస్పతి యాజమాన్యమున జనించిన వ్యక్తి అనియు, ఆమె శుక్రుని శుభదృష్టి జాతకురాలి లగ్నమునకు, లగ్నాధిపతికి సహా నిండుగా కలదనియు, ఆమె లగ్నాధిపతి బృహస్పతి శుభదృష్టి కథానాయకురాలి కుజచంద్రసంయోగముపై నున్నదనియు, పాఠకమహాశయులు విన్నచో అన్యోన్య గ్రహయోగముల ఫలమును కొనియాడింపగలరు. అది యట్లుండె.

ఈ జాతకమందలి ఒకటి రెండు విశేషములను మాత్రము గమనింతము.

మకరలగ్నములో లగ్నాధిపతి శనితో నిండు త్రికోణదృష్టితో సౌకన్యసూచక భాగలో పుట్టిన జాతకురాలు శాంత స్వభావము, జాగరూకత, దూరదృష్టి, కార్యనిర్వాహకశక్తి, కలదగుట వింత కాదు. అవకాశము ననుసరించి సంతోషమునైనా, దుఃఖమునైనా, తలమునకలుగా చూపునటి చిత్తవృత్తిని కుజచంద్ర సంయోగము సూచించగలదు. ప్రేమ సహనము ఆ గ్రహద్వయమున కెనుగుగా నిలిచినది. ప్రేమకల్గిన చోట ఎంత త్యాగమునకుకాని, సాహసమునకుకాని, ఆమె వెనుతీయదు. భర్తృసహాయము నికరముగా భర్తృభావమందే నిలిచి లగ్నాధిపతితో అష్టకోణ శుభదృష్టిలోనున్నది. వేపటగల భర్తపై భక్తి తాత్పర్యములకు కొదవయుండదు. శుక్రునిపై ప్రేమసహాయముతోనైన సహోదక్కని గురుదృష్టియున్నది. కథానాయకురాలు బావగారి బయకొరి మాయలకులోబడి శీలమును చెరచుకో గలదా? అట్టి పరిస్థితికి లగ్న సప్తములపై మిత్రదృష్టి గలశని అవకాశమిచ్చువాడు కాడు. కలకిన ధైర్యమును సూడిబిటి ఉన్నరని ఈయగలడు. విరమస్థానాధిపతి కుజుని సంయోగమునే చంద్రుడు ఎక్షింపుచుట! శీలరక్షణమునకై ఆమె ఎంత సాహసమైనా చేయ గలుగును కదా! ఆపత్కాలములో సాహసము చూపి ఆమె శీలము దక్కించుకొన గలిగెను. ధన్యురాలు.

పుణ్యమా అని, అప్పటి దశాయోగములు కూడ సహకరించునట్టివి కావు. శుక్రమహా దశలో (పరిత జాతకమున) లగ్నమునకు, శుక్రునికి, సహాయము లేదు. కన్యాత్వమునకు భంగము సూచించు యోగములు రాలేదు. దాంపత్యసహమునకు పరిత బుధుడు కేంద్రస్థితికి వచ్చుటనే, దాంపత్యసౌఖ్య సంపాదనమును డామెకు సూచించినది కాదు. కావుననే, గాంధర్వ వివాహమునకో, రాక్షస వివాహమునకో అవకాశము లభించలేదు. జ్యేష్ఠ సోదరీ భర్తను సూచించు సహమను మొక్కటి కుంభములో (29°—9') సాయన కేంద్రవేధలో నున్నది. గురుదృష్టివశమున పరితశుక్రుడు డాకాలమున ఆ సహమమును చేరుకొనుటచే, అవకాశము లభించెనని దురాశామోహపరవశుడైన బావ,

(ii) వాల్గింటనున్న శనికి సమసప్తక దృష్టిచే శుక్రుడు పోవుచున్నాడు. వైవాహిక జీవితసౌఖ్యము త్వరగా రానీయని యోగమిది.

పోతే, అత్తగారి విషయమున క్రౌర్యమునో, శాఠ్యమునో, ఈ గ్రహస్థితి సూచించగలదు కూడ.

(iii) లగ్న దశమాధిపతి బుధునికి వ్యయభావములో శని సంయోగము. "వ్యయాయాగో, వ్యయకారకః." అనుటచే, ఏదో కష్టమును సూచించుచున్నది.

అత్తగారికో, కన్యకకో, ఆకస్మిక ప్రమాదము సూచితము.

(iv) ముహూర్త చంద్రునికి కన్యక జన్మశని సంయోగము. మనోవికాసము తగ్గుసూచన ఇది.

ఇంతచాలును. "పడిపోవనున్న మిద్దెకు కొరకినదే పోటే." అను సామెతగా పెండ్లి పెద్దలకు లభించినది సుముహూర్తము. ఏవాడు కోరితే ఆవాడే ముహూర్తము పెట్టు మహనీయులు ప్రబలిన కాలమిది.

పోనిత్తము. ఈ ముహూర్తమున అత్తగారు (వలయ కేంద్ర బిందువు) ఎప్పుడు వేంచేసెనో చిత్తగింపుడు. వెనకకొని పోయి పోయి, కథానాయకురాలి జన్మకాలపు రోహిణీ—చంద్ర—కుజసంయోగస్థానమునందే సింహాసనము వేసుకొనవలయునా? వినుకొంటకే ఆ ఫలము రావలయునని సంకల్పమా?

అనురూపులగు కన్యావరులు అన్యోన్యముగా సమ్మతించినారు. బంధుజాలము వారి వివాహమును ఆమోదించినది. వివాహప్రయత్నములు తొందరగా జరుగుచున్నవి. కాని, వరునితల్లికి మాత్రము, ఏమి కారణమో, ఈ సంబంధము నచ్చలేదు. ఈ పెండ్లి జరుగవే కూడదని ఆమె ఒకటే మొండిపట్టు పట్టినట్లు, ప్రతిక్షణము నూతన వికాసము పొంగివచ్చుచున్న నవయౌవనము కల కథానాయకురాలి వంటి అందాల రాశిని చూచి మోహపరవశుడైన వరుడు ఆమెనే పెండ్లియాడవలెనని నిశ్చయించి, తల్లి శాఠ్యమును సహకు చేయలేదు. "నా ప్రాణముండగా ఈ పెండ్లి జరుగనీయను," అన్న తల్లిమాటలు గుడ్డిబెదరింపులని తలచినారు బంధువులు. కుమారుడు దానికోరికను లక్ష్యపెట్టలేదు. ఆత్రముతో ముహూర్తము నిర్ధరింపబడినది. బంధుమిత్రులు సంప్రకూడి శోభాయమానముగా పెండ్లి జరిపినారు. వధూవరుల ఉత్సాహము అడుగపనిలేదు. మంగళవాద్యముల ఆర్భాటములో, మంత్రపాఠముల ధోరణిలో, ముత్తయిదువల కలకలములలో కథానాయకురాలికి మూడుముళ్ళు పడినవి. అదే క్షణమందే పెండ్లి ఇంటిలో ఒక వైపున ఆకస్మికముగా హాహాకారములు బయలుదేరి హల్లకల్లోలమయినది. తాళి కట్టిన క్షణమే ఆ ఇంటి ఒక మూల కూర్చుండియుండిన వరుని తల్లి లటాలున లేచిపోయి, సమీపమునున్న బావిలో రాయి కట్టుకొని దబాలున దూకినది! ముహూర్తపు వాగ్దానము వెంటనే చెల్లినది. కోడలి గృహప్రవేశమునకు, అత్తగారి అగ్నిప్రవేశమునకు సహా, ముహూర్తము ఒకటే నిర్ణయించబడినది కాబోలు! అంతటితో, అత్తగారి కథ సమాప్తి.

జాతకురాలి దైనిక లగ్నము జన్మవర్గణాని పైన, దైనిక దశమము జన్మ శుక్రునిపైన ఉండిన దినమది. వచ్చిన వరునితో జరిగిన వివాహము, ఆకస్మిక విషమ సంఘటనము సూచించబడినవి.

రోహిణీ నక్షత్రమందలి చంద్రమంగళయోగము కథానాయకురాలి జీవితమున పదునారు సంవత్సరముల వయస్సునకు ఇన్ని విధములుగా తన ప్రభావమును చూపినది. భావిఫలము వేళల అధీనము. అది చెప్ప ఇప్పుడనవసరము.

ఒకటే యోగము, సమయానుసారముగా, ఎన్ని విధముల ఫలమును సూచించగలదో, మనకీ దృష్టాంతము బోధించుచున్నది.

"హరివిధిపరిపాకః, కేన వా లంఘనీయః"

(భర్తృహరి)

# మహాకవి శివయ్యగారి స్వీయ చరిత్ర

## శ్రీ యస్వీ జోగారావు

'వెలువడినది! ఇప్పుడే వెలువడినది!
అద్భుత ప్రశంస నందిన
అపూర్వ గ్రంథరాజము
మహాకవి శివయ్యగారి స్వీయచరిత్ర
వెల స్వల్పము! ఫల మధికము!
త్వరపడుడు! ఆలసించిన ఆశాభంగము!
ఆషాఢభూతి అండు కో
మూర్ మార్కెట్, మదరాసు.'

అని కొన్ని వార, దినపత్రికలలో ఒక ప్రకటన చూశాను. వెంటనే వెనక శివయ్యగారితో జంటకవిగా శతావధానాలు చేస్తూవుండిన ఆయన మేనమామ శతభిషంగారికా ప్రకటన చూపించాను.

శివయ్యగారు మేష్టరీ చేసి పింఛను పుచ్చుకున్నప్పటినుంచీ రాజవరంలోనే మకాం పెట్టేశారు. చాలా రోజులాయి సాహిత్యసేవ మానేసినా అధికారిసేవ చేసుకుంటూ వెనుకటి తమ పలుకుబడిని కాస్తా రూపాయలా పైసల్లోకి మార్చుకుంటున్నారు.

శతభిషంగారు హాయిగా స్వగ్రామంలో వ్యవసాయం చేసుకుంటూ కాలం గడుపుతున్నారు. నేను వారి యింట్లోనే ఒక వాటాలో అద్దెకుంటున్నాను. ఆయనతో నిత్యం ఏదో సాహిత్యగోష్ఠితో సరదాగా కాలక్షేపం అవుతూ వుండేది.

ఆ ప్రకటన చూపించగానే 'ఇదా! ఎవడు పంపించాడో గాని అప్పుడే నాకొక కాపీకూడా వచ్చిందిలే. వీడి బతుక్కి స్వీయచరిత్ర కూడానా!' అన్నారు శతభిషంగారు.

'అదేమిటండీ అలాగంటారు?' అన్నాను నవ్వుతూ.

'మా లోగిల్లో పుట్టి పెరిగాడు మా అబ్బిగాడి సంగతి నాకు తెలీదూ! వీరికీ వారికీ స్వీయచరిత్రలు రచించిపెట్టిన సత్పురుషుడు వీడికి ఇంక అదొక్కటే తరవాయి!'

'పోనీ తన స్వీయచరిత్ర మరొకరిచేత వ్రాయించలేదు గదండీ!'

'భేష్ మా దొడ్డమాటన్నావురే!'

'పోనీ ఉపోద్ఘాతమైనా చదివి చూదాం ఆ మహాకవి ఏమంటాడో!'

'మహాకవిట మహాకవి! అతి సామాన్యమైన ప్రతీ వస్తువూ ప్రియమైపోతున్న ఈ రోజుల్లో ఈ మాటొక్కటే కారుచవకై పోతోంది. ఇదో చిత్రమైన మాట! డిగ్రీకాదు, టైటిలుకాదు. ఒక పరీక్ష లేదు, దావారాదు తంటారాదు, చెప్పేవాళ్ళేదు - ఆంధ్రదేశంలో కవులందరికీ అదో సర్వనామమైపోయింది! నేను గాని బరితెగించి మా చాకలిని మహాకవంటే నన్ను కాదనేమొగాడెవడు? అసలు పట్టించుకునేదెవడంట ఈరోజుల్లో? దానికి తోడు వాడిబంధువొకడు పెద్దపదవిలో గాని ఉంటే వెంటనే వాడికి తోడా పడిపోతుంది. సిసలైన మహాకవులు కూడా సిఫారసులు చేస్తూ-వుంటాయి శతకోటి బతుకు తెరువుల కనంతకోటి మొహమాటాలు! సామాన్యులు సరేసరి ఉసికొమ్మంటే చెక్కభజన చేసేస్తారు.'

'పోనీ యింతకీ ఆయన మతలబేమిటో ఒకసారి ఉపోద్ఘాతం చదివితే పోయిందేముందండీ?'

'సరే నువ్వు చదువు నేను వింటుంటాను' అని సెలవిచ్చారు శతభిషంగారు.

ఉపక్రమించాను.

ఇక మీదటి సావాపంక్తులు శివయ్యగారి స్వీయచరిత్ర ఉపోద్ఘాతంలోనివి.

మధ్య మధ్య శతభిషంగారి వ్యాఖ్యానప్రాయములైన మహావాక్యాలు:

"ఆప్తపాఠకులారా! ఆంధ్రమహాజనులారా! ఇది మీలో ఒకడిని, మీ వాడిని అయిన నా స్వీయచరిత్ర-

'అబ్బో గమ్మత్తుగానే ఎత్తుకున్నాడు ఎత్తుగడ!'

ఇది నా చరిత్రే అయినా కేవలం మీకోసం రాస్తున్నానంటే నమ్మండి—

'పైగా ఇదోహాటా!'

అసలు నాకు స్వీయచరిత్ర వ్రాసుకోవాలని సుతరామూ ఇష్టం లేదు. అయితే జగత్కల్యాణకాంక్షులైన మిత్రులెందరో బలవంతపెడితే వాళ్ళ నిర్బంధ ప్రణయానికి తట్టుకోలేక వ్రాయడానికి పూనుకుంటున్నాను.

'అబ్బా! నిజానికి వీడి నిరడూ అడిగివుంటాడు. బలవంతపెట్టేరుట బలవంతం! ఎంత గడుసు భిడవ! అసలు స్వీయచరిత్ర వ్రాసుకునే చాలామంది వరస యిలాగే కనిపిస్తుంది.'

ఆంధ్రదేశంలో బహుశా నన్నెరగనివారుండరనుకుంటాను—

'ఏం వచ్చాయిరా బాబూ! గంటుకొట్ల తొంభై తొమ్మిది లక్షల తొంభై తొమ్మిది వేల తొమ్మిదివందల

# మహాకవి శివయ్యగారి స్వీయచరిత్ర

అన్యాపదేశంగా ఆ కాలంలో నా శక్తి మేర గ్రహించాను. ఇదంతా ఈశ్వర ప్రసాదం. లోకకళ్యాణార్థం దీన్ని పని వెలిగించాలని సంకల్పించాను.

'హాత్ శివయ్యగా! సత్యంమీద ఇంత పిసరు పయ టేవట్రా నీకు! ఎంత అద్భుతంగాన! జాప్యంగాన!'

అయితే ఆంధ్రుల దురదృష్టమేమి చెప్పను! ఆ మర్నాడే నా గాంధీగారి సత్యాగ్రహోద్యమంలో చేరి జైలుకి వెళ్ళిపోవడంలో—

'నేను జైలుకి వెళ్ళింది ఒక ఖూనీ కేసులో. ఎప్పటికైనా తను జైలుకి వెళ్ళిన సంగతి లోకంకి తెలిసిపోతుందని కొబ్బోలు ఈ పన్నాగం పన్నుతున్నారు. బాగుంది వరస!'

మా వాళ్ళ అశ్రద్ధవల్ల ఇంటిదగ్గర నా తండ్రి తాతల నాటి తాళపత్రగ్రంథాల భోషాణంతో పాటు నేను రాసిన కావ్యపేటికను పుస్తకాలూ పురుగులపాలయ్యాయి. గ్రంథాలన్నీ చెదలు తినేశాయి. ఇప్పుడవన్నీ నాకు పూర్వజన్మస్మృతిలా అయిపోయినై—

'నా గతమును గూర్చి కొందరు బంధాలు వేస్తున్నారు! మరి జన్మకు నేను నిజం చెప్పనని ఒట్టు పెట్టుకున్నట్టున్నారు. వెళ్ళొస్తాలేం మహాకవీ!'

పూర్వజన్మస్మృతి అంటే జ్ఞాపకం వచ్చింది. నాకు అసాధారణ భాగ్యం ఆరోగ్యంతో పూర్వజన్మజ్ఞానం వుండేదిట. ఆ రోజుల్లో అంటూ వుండేవారట— మా అమ్మ చెప్పింది. నేను గతజన్మలో ఒకరి నారాయణంలో తపస్సు చేసుకుంటూ వుండే మహర్షినని. నిత్యనైమిత్తిక కర్మల్లో ఏదో ఒక చిన్న ప్రత్యవాయం వచ్చి యోగభ్రష్టుడినై ఆ లోటు భర్తీ చేసుకోవేందుకే మళ్ళీ జన్మ ఎత్తవలసివచ్చిందనీ, ఈ జన్మలో సరి. ఇక చివరిమాట—నాకు ఏదో నా శివయ్య అంటే నేను, ఇది నా కథ అనే అహంకార మమకారాలు పసిమిగా లేవు. అందుచేత వట్టి నిష్కామకర్మగా, కేవలం లోకోపకారార్థం శివయ్య అనబడే ఒక మహానుభావుని పవిత్రచరిత్రమును విషయం సవిస్తరంగా తెలిసినవాడినవటంవల్ల మనోరంజకంగా బహుళంగా నేనే వ్రాసి ఆంధ్రలోకానికి అందజేస్తున్నాను. అంతే. అందరూ తలో కాపీ కొనుక్కుని యథాశక్తి తరింతురుగాక!"

'అరే! సిసింటా బట్టానా! ఎంత బరి తెగించేశాడూ! ఎన్ని కొన్నాళ్ళు కోశాడు! ఎన్ని పచ్చాలు కొట్టేడు! నే నింకా బతికున్నా నన్న సంగతే మరిచిపోయినట్టున్నాడు! వీడు మహాకవా? వీడూ స్వీయచరిత్ర రాసుకోవడమే!' అని కళ పెళలాడేరు శతభిషంగారు.

'అయ్యా కింద 'సరే' ఒకటి రాశావుండోయి మహాకవి!' అన్నాను.

'ఆక్షేపమేమిటి!'

ఈ గ్రంథం బాగోగుల విషయమై నాకేలాంటి ఆక్షేపణలు లేవు. విమర్శకులు కొందరికి కొంచెం విషయాలు కొన్ని వింతగా తోచి ఆక్షేపింతురుగాక. దూషణ భూషణ తిరస్కారంబులు దేహంబునకుంగాని ఆత్మకుంగావు' అని చదివాను.

'అంతేకాదు, నాకు సిగ్గూ లజ్జా లేవు, గ్రంథం బాగోగుల విషయమై నాకు పూచీ లేదు-అని రాసి వుంటే బాగుండేది' అన్నారు శతభిషంగారు. ఆయనే మళ్ళా అన్నారు కదా:

'అప్పను గాని ఈ స్వీయచరిత్రలు వ్రాసుకునే వాళ్లెవరూ ఎందుకు తమ చరిత్ర తామే వ్రాసుకోవాలనుకుంటారు, అదో అహంప్రత్యయ ప్రకోపం గాకపోతే,—

'పాపం శిష్యులుకలిగించి మనకవుల్ని రాయడానికి తీరుబాటుగా కూర్చున్నారు చెప్పండి!' అని వాళ్ల తరఫున వకాల్తా పుచ్చుకున్నవాడిలాగ విన్నవించుకున్నాను నేను.

'అసలు కీర్తి కండూతి కాకపోతే తమ చరిత్ర లోకానికి తెలియాలని?'

'మహాకవి శివయ్యగారు సెలవిచ్చారు కదండీ కేవలం లోకోపకారార్థం అని'

'ఏడిశాడు!'

'కాని ఒక్క విశేషం మాత్రం మనం గ్రహించవలసివుంది సుమండీ! మహానుభావులు కొందరు స్వీయచరిత్రలు వ్రాసుకుంటారు గాని స్వీయచరిత్రలు వ్రాసుకునేవాళ్ళందరూ మహానుభావులు కారు. కానక్కరలేదు అని నిరూపించారు మన శివయ్యగారు. అందుకు యావదాంధ్రలోకమూ వారికి ఋణపడిపోయింది' అని సవినయంగా మనవిచేశాను.

'ఒయ్ నాకు ఒళ్ళు మండిపోతోంది. ఈ పుస్తకాన్ని నిలువునా చింపేస్తాను' అని తీర్మానించారు శతభిషంగారు.

'అయ్యా! పంచాంగాన్ని చింపేస్తే గోచారం ఆగిపోతుందా చెప్పండి? కొన్ని వేల కాపీలు అచ్చుపడి ఉంటాయి. ఏదో మనదగ్గరున్న ఒక కాపీ చింపేస్తే సరా? తక్కిన లోకమంతా ఏమయిపోయిందనుకున్నారు! కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ- అన్నారు గదా మహాకవి భవభూతి. అటుపై మీ చిత్తం' అని పూరుకున్నాను పుస్తకం అట్టమీద అచ్చుగుద్దబడిన శివయ్యగారి ఛాయాచిత్రం కళ్ళలోకి దీనంగా చూస్తూ.

జీవన్ భద్రాణి పశ్యతి!
మహాకవి శివయ్య జిందాబాద్!

# తృతీయ ప్రణాళిక: నిరుద్యోగ సమస్య

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

గడచిన మే మాసంలో కేంద్రమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా కేంద్ర ఉద్యోగసంఘ సభలో చేసిన ప్రసంగం మన దేశంలో నిరుద్యోగసమస్య క్లిష్టతను తెలియచేయగలదు. ఈ గురుతరమైన సమస్యకు కారణాలు అందరికీ తెలిసినవే. మనదేశపు జనాభాలో కేవలం 10% మాత్రమే ఉద్యోగాలకు పరిశ్రమలపై ఆధారపడటం, జనాభా అతివేగంగా పెరిగిపోవడం, పారిశ్రామిక ప్రయోగమనం తగినంత లేకపోవడం, నిరుద్యోగులు ఎక్కువ అయినా వివిధ పారిశ్రామిక రంగాలలో నిపుణత కలిగిన అభ్యర్థులు లేకపోవడం మొదలైనవి, ఈ కారణాలు. గణాంకవేత్తల అంచనాల ప్రకారం ద్వితీయపంచవర్ష ప్రణాళికప్రారంభానికి మన దేశంలో సుమారు 15 మిలియన్ల నిరుద్యోగులున్నారు. వీరుకాక 20 మిలియన్లమందికి అసంపూర్ణంగా మాత్రమే ఉద్యోగం ఉంది. అంటే ఒక శ్రామికుడు దినానికి పదిగంటలు పనిచేయకలిగితే, అతనికి రోజుకి రెండుగంటల పని మాత్రమే లభ్యమౌతోందన్నమాట. ఈ విధమైనది మన దేశంలో గ్రామీణ రంగంలో బాగా ఎక్కువ. అయితే మొత్తంమీద దేశంలో 35 మిలియన్ల మంది మాత్రమే ఈ నిరుద్యోగసమస్యవలన బాధపడుతున్నారని చెప్పడానికి వీలులేదు. ఏమంటే, ఈ నిరుద్యోగులసంఖ్యలను తెలిపే లెక్కలు బాగా అసమగ్రమైనవి. ప్రతిపల్లెలోను ఎంతమంది నిరుద్యోగులున్నారో విపులంగా అంచనా వేయకలిగేందుకు సమగ్రమైన గణాంకశాఖ మనకు లేదు. కాబట్టి ఈ లెక్కలన్నీ కేవలం ఉజ్జాయింపున సరిచూసినవే. ఇందువలన దేశంలో నిజంగా ఉద్యోగార్థులు ఈ 35 మిలియన్లకన్న చాలా ఎక్కువ ఉంటారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కనీసం ఎనిమిది మిలియన్లమంది నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించాలని లక్ష్యం పెట్టుకున్నారు. అయితే ఇప్పటివరకు అందిన గణాంకసమాచారాన్నిబట్టి ఈ లక్ష్యం నెరవేరదు అని నిస్సంశయంగా చెప్పవచ్చును. దీని పర్యవసానం ఏమంటే తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభానికి ఈ సమస్య అనుకొన్నంతకంటె తీవ్రతరమౌతుంది. దాని ప్రభావం తృతీయ ప్రణాళిక పొడుగునా ఆర్థికవ్యవస్థపై ప్రతిఫలిస్తుంది.

రెండవ ప్రణాళికారచనలో ఆర్థికవేత్తలు నిరుద్యోగ సమస్యను మూడువిధాలుగా విభజించి పరిశీలనచేశారు. ఒకటి అప్పటికే దేశంలోఉన్న నిరుద్యోగుల విషయం. రెండవది సంవత్సరానికి రెండు మిలియన్ల చొప్పున పెరుగుతున్న క్రొత్తనిరుద్యోగుల విషయం. మూడవది అసంపూర్ణమైన ఉద్యోగంగలవారి సమస్య. ప్రణాళికారచయితల అంచనా ప్రకారం ప్రభుత్వరంగంలో భారీపెట్టుబడులవలన, ఆరోగ్యం, విద్య, సాంఘిక సంక్షేమం మొదలైన వానియందు ప్రభుత్వకృషివలన, ఉద్యోగం బాగా పెరగగలదని ఊహించారు. అంతేకాకుండా, ఈ కృషివలన ప్రజల జీవన ప్రమాణాలు అధికమై, నిత్యోపయుక్తవస్తువుల గిరాకీ పెరుగుతుంది. ఆ గిరాకీ పెరగడంవలన, గ్రామీణపరిశ్రమలకు, లఘు పరిశ్రమలకు అధిక ప్రోత్సాహం లభించి, తద్వారా ఉద్యోగాభివృద్ధి జరగగలదు. రెండవ ప్రణాళికలో వివిధరంగాలలో ఈ క్రిందివిధంగా ఉద్యోగావకాశాలు కలుగగలవని ప్రణాళికారచయితలు భావించారు. ఐదు వత్సరాలకు కలిపి వివిధములైన నిర్మాణ కార్యక్రమాలయందు మొత్తం 21.0 లక్షలమందికి ఉద్యోగాలు లభించగలవు. నీటిపారుదల, విద్యుచ్ఛక్త్యభివృద్ధి పథకాలలో 0.51 లక్షలమందికి, రైల్వేల అభివృద్ధియందు 2.53 లక్షలమందికి, రవాణాశాఖలో 1.80 లక్షల మందికి, పరిశ్రమలలో 7.50 లక్షలమందికి, గ్రామీణపరిశ్రమలు, లఘు పరిశ్రమలలో 4.50 లక్షల మందికి, అటవీశాఖ, మత్స్యపారిశ్రామలలో 4.13 లక్షలమందికి, విద్యావిషయిక కార్యక్రమాలలో 3.10 లక్షలమందికి, ఆరోగ్య విస్తరణకార్యక్రమాలలో 1.16 లక్షల మందికి, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో 1.42 లక్షలమందికి, ప్రభుత్వసేవలో 4.34 లక్షల మందికి, ఇతర రంగాలయందు, వర్తక వాణిజ్యములందు 27.04 లక్షలమందికి ఉద్యోగాలు లభించగలవని అంచనా వేశారు. అంటే మొత్తం సుమారు 80 లక్షలమందికి అన్నమాట. అయితే

# తృతీయ ప్రణాళిక : నిరుద్యోగసమస్య

ఇంత సాధించినప్పటికీ రెండవ ప్రణాళిక ముగిసేసరికి సమస్య ఏమంత ఎక్కువగా శాంతించదు. కాని రెండవ ప్రణాళికలోనే, ఇప్పటికి అందిన సమాచారాన్ని బట్టి పైఅంచనాలుకూడ ఫలించలేదని తేలింది. అందువలన మూడవప్రణాళికలో 14 మిలియన్ల మందికి ఉద్యోగావకాశాలు కల్పిస్తే, మూడవప్రణాళిక ముగిసే నాటికి పరిస్థితి విషమించక యథాతథంగా ఉండగలదు. కాబట్టి మనం ఎదుర్కొనవలసిన సమస్య నిరుద్యోగాన్ని తగ్గించడం కాక, ఎక్కువ కాకుండా చేయడమన్నమాట! దానికైనా, కనీసం 14 మిలియన్ల మందికి అయిదుసంవత్సరాలలో ఉద్యోగాలు కల్పించాలంటే సులభసాధ్యమైన పని కాదు.

పాశ్చాత్య ఆర్థికశాస్త్రవేత్తలు నిరుద్యోగసమస్యను శాస్త్రీయదృక్పథంలో పరిశీలించి అనేకసిద్ధాంతాలను తయారుచేశారు. సాంప్రదాయిక ఆర్థికవేత్తల ప్రకారం పెట్టుబడిదారీ వ్యవస్థలో అసలు నిరుద్యోగమనేదే సంభవించదు. ఒకవేళ సంభవించినట్లైతే దానికి రెండే కారణాలు ఉంటాయి—ఒకటి శ్రామికులు పనిచేయడానికి నిరాకరించడంవలన. అంటే ఇది ఇచ్ఛాపూర్వకమైన నిరుద్యోగమన్నమాట (Voluntary unemployment). రెండవ కారణం వేతనం తగ్గించడంవలన శ్రామికుల నిరాకరణ. వేతనం తగ్గించడం అంటే వేతనం ధనరూపకంలో పూర్వపు విలువతో సమానమే అయినా, యథార్థపు విలువ అనగా వస్తురూపేణా విలువను తగ్గించడం. ఈ సాంప్రదాయిక వాదానికి ఆధారభూతమైన సిద్ధాంతం ఎల్లప్పుడు గిరాకీ, సరఫరాలు, నిలువచేసే ధనం, పెట్టుబడి చేసే ధనం సమానమే అవుతాయని. శ్రామికుల ఉద్యోగ నిర్ణయం, వారి సరఫరా గిరాకీలపై ఆధారపడి ఉంటుంది. ఈ పరస్పర వ్యతిరేకశక్తులు వేతన ప్రమాణాన్ని నిర్ణయిస్తాయి. అందువలన, శ్రామికుల సరఫరా ఎక్కువైనప్పుడు వేతనం తగ్గడం, తక్కువైనప్పుడు హెచ్చడం సంభవిస్తుంది కాని ఎన్నడూ నిరుద్యోగమనేది కలుగదు. ఈవాదం కేవలం శాస్త్రసర్వవంటిది. కావడంవలన, వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా నిరాధారమైంది. తరతరాలుగా నమ్మబడిన ఈ సిద్ధాంతాన్ని నిరాకరించి వాస్తవిక పరిస్థితుల కనుగుణమైన సిద్ధాంతాన్ని రూపొందించిన మహానీయుడు లార్డు కేన్సు. వాస్తవిక పరిస్థితులలో, నిలువ, పెట్టుబడి ధనాలు సమమై, శ్రామికుల సరఫరా గిరాకీలు సమమైనప్పుడే, నిరుద్యోగం పూర్తిగా నశించి పోగలదని నిరూపించారు కేన్సు. ఉద్యోగావకాశాల వృద్ధి ప్రభుత్వపు పెట్టుబడి పైనా, జాతీయాదాయం పైనా ఆధారపడి ఉంటుంది. కాబట్టి నిరుద్యోగసమస్యను తగ్గించడానికి ప్రభుత్వపు పెట్టుబడి ముఖ్యం. ఈయన గ్రంథం ప్రకారం నిరుద్యోగం ప్రబలినప్పుడు ప్రభుత్వపు పెట్టుబడి అనేక గుణితమై జాతీయాదాయాన్ని, ఉద్యోగాల్ని పెంపొందిస్తుంది. అయితే ఈయన తన సిద్ధాంతాన్ని, పెట్టుబడిదారీ దేశాల కనుగుణంగా రూపొందించారు. ఈయన సిద్ధాంతం బాగా అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాలలో, ఆర్థికమాంద్యంవలన ఏర్పడిన తాత్కాలిక నిరుద్యోగాల్ని నిర్మూలించడానికి పనికి వస్తుంది కాని, ఇండియా, చైనాలవంటి వెనుకబడిన దేశాలకు పనికిరాదని ఆర్థిక శాస్త్రజ్ఞులు వెల్లడించారు.

ఇందువలన తేలేదేమిటంటే ఆర్థికంగా పురోగతిపొందిన అమెరికా, జర్మనీ, జపాన్ మొదలైన దేశాలలో నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకు ప్రభుత్వం అవలంబించిన విధానాలు, మనదేశంలో నిరుద్యోగ నిర్మూలనకు సరిపడవని. మనదేశ పరిస్థితుల కనుగుణమైన విధానాన్ని మనం రూపొందించుకోవాలి కాని విదేశ విధానానుకరణ ఉపయుక్తం కాదు. విదేశాలలోని నిరుద్యోగ సమస్యకు, మన నిరుద్యోగ సమస్యకు పోలికలేదు. అక్కడ జనించే నిరుద్యోగం ఆర్థికమాంద్యంవలన కలుగుతుంది. మన దేశంలో, జాతీయార్థిక వ్యవస్థ వెనుకబడిన దశవలన కలుగుతుంది. వారిది తాత్కాలిక సమస్య. కొద్దిపెట్టుబడితో తిరిగి ఉద్యోగావకాశాలు కలిగి సమస్య నివారిత మౌతుంది అక్కడ.

అంతే కాకుండా మనదేశం బహు విస్తృతమైనది అవడంవలన, సమస్య తీవ్రమై బహురూపాలను దాలుస్తుంది. బెంగాల్, బీహార్ మొదలైన రాష్ట్రాలలో జనించే పారిశ్రామిక నిరుద్యోగ సమస్యవేరు; ఆంధ్రవంటి వ్యవసాయిక రాష్ట్రాలయందు కలిగే వ్యవసాయికమైన గ్రామీణ నిరుద్యోగ సమస్యవేరు. ఒరిస్సా మొదలైన వెనుకబడ్డ ప్రాంతాలలో కలిగే నిరుద్యోగసమస్య వేరు; అస్సామ్, మధ్యప్రదేశ్ మొదలైన ప్రదేశాలలో కొండప్రాంతాలలోని జనులకు సంభవించే నిరుద్యోగ సమస్య వేరు. కాబట్టి నిరుద్యోగ సమస్య నిర్మూలనకు

దేశానికంతటికీ ఒకేవిధానాన్ని అనుసరించడం సాధ్యం కాదు. వీరంతా కాకుండా చదువుకొన్న నిరుద్యోగుల సమస్యకు ప్రత్యేక పరిశీలన అవసరం. ఉద్యోగాభివృద్ధికి రెండవ ప్రణాళికలో అవలంబించిన విధానమందుగల ముఖ్యమైనలోపం, సమస్యలోని ఈ విభిన్నమైన ప్రాంతీయ వ్యత్యాసాలను గమనించక పోవడమే. మరొక ముఖ్యమైన లోపం ఏమంటే నిరుద్యోగ సమస్యను ప్రత్యేకమైన సమస్యగా కాక, కేవలం దేశాభివృద్ధిపైన ఆధారపడే సమస్యగా పరిగణించడం. దేశాభివృద్ధి ప్రణాళికల మూలంగా జరుగుతుంది. కాబట్టి నిరుద్యోగం దానంతట అదే శాంతిస్తుంది అన్న పద్ధతి రెండవ ప్రణాళికలో అవలంబింపబడింది. ఈ విధానం సత్యదూరం కాకపోయినప్పటికీ, అధికఫలవంతమైనది కాజాలదు. కాబట్టే రెండవ ప్రణాళికలో నిరుద్యోగ సమస్యా నివారణానికి ప్రభుత్వం ప్రదర్శించిన వైఖరి ఒక నిర్దిష్టమైన విధానంగా కాక కేవలం అస్పష్టమైన, అసమగ్రమైన అంచనా—లక్ష్యంగానే మిగిలిపోయింది.

కాబట్టి మూడవ ప్రణాళికలోనైనా, ఈ తప్పులను సరిచేసుకోవలసి ఉంటుంది. మూడవ ప్రణాళికలో, రెండవ ప్రణాళికలో అవలంబించిన విధానపు తప్పుల మూలంగా సమస్యాభారం ఎక్కువ అయింది. ఉద్యోగసమస్యను పరిశీలించే కేంద్ర సంఘం ఈ తప్పులనేమీ గుర్తించినట్లు కనబడదు. నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి ఈ సంఘం చేసినసూచనలు, ఎప్పుడో పందొమ్మిదవ శతాబ్దం నాటివే కాని క్రొత్తవి కావు. గ్రామీణ రంగాలలో శ్రామికశక్తి అధికంగా కావలసిన పరిశ్రమలను స్థాపించమని దీని ముఖ్య సూచన. ద్వితీయ ప్రణాళికలో ఉద్యోగవిధానం ఎందువలన సఫలమవలేదో, ఆ అడ్డంకులు తృతీయప్రణాళికలో ఏవిధంగా తొలగించబడాలో అన్న చర్చ రాలేదు. కేవలం చిన్నపరిశ్రమలను గ్రామీణరంగంలో వృద్ధిచేసినంతమాత్రాన నిరుద్యోగసమస్య పరిష్కృతమౌతుందనుకోవడం, వాస్తవిక పరిస్థితులను గమనించకపోవడం వల్లనే ఏర్పడుతుంది. ఇంతటి ముఖ్య సమస్యకు కేవలం ఒక సులభమైన అసమగ్రమైన విధానం పరిపడదు. విధానం అతివిపులమైనదిగా ఉండాలి. అవసరమైతే అది ప్రతిజిల్లాకు మారేదిగా కూడా ఉండాలి.

మూడవ ప్రణాళికలో, ఉద్యోగావకాశాలను కల్పించడానికి అనుసరించే విధానంలో, ప్రభుత్వం ఆదాయసేకరణ మార్గాలకు (పన్నుల విధానానికి ముఖ్యంగా) ఉద్యోగవిస్తరణ విధానానికి సమన్వయ సూత్రం కనిపెట్టబడాలి. పన్నుల విధానానికి ఉద్యోగ విస్తరణకు అతిసన్నిహిత సంబంధం ఉంది. ముఖ్యంగా పారిశ్రామికోద్యోగ విస్తరణకు ఈబాంధవ్యం హెచ్చు. పరిశ్రమ విస్తరణకు శ్రామికుల సంఖ్యనైనా ఎక్కువ చేయాలి. లేక యంత్రాంగాన్నైనా ఎక్కువ చేయాలి. ఈ సందర్భంలో పెట్టుబడిదారుడు దేనికి ఖర్చు తక్కువ అయితే దానిని హెచ్చిస్తాడు. సాధారణంగా, దీర్ఘకాలికంగా పరిశీలిస్తే, పెద్దపరిశ్రమలలో యంత్రాంగాన్ని హెచ్చించడమే లాభదాయకంగా కనబడుతుంది. ఇటువంటప్పుడు యంత్రాంగాన్ని హెచ్చు చేసే కన్న, శ్రామికులను హెచ్చుచేస్తే పన్నుల భారం తగ్గేదిగా పన్నుల విధానాన్ని రూపొందిస్తే ఉద్యోగవిస్తరణ జరుగుతుంది. ఒక కర్మాగారంలో శ్రామికుల సంఖ్యను హెచ్చుచేస్తే, ఆదాయపుపన్నులో కాని లాభాలపై విధించే పన్నులో కాని కొంతరేటు ముదరా ఉంటుందని ప్రభుత్వం ప్రకటిస్తే పారిశ్రామికవేత్తలు తమ తమ కర్మాగారాలలో ఉద్యోగపదవులను విస్తరించడానికి అవకాశం ఎక్కువ కలుగుతుంది. ఈ ముదరా ఈయడం వలన ప్రభుత్వానికి ఏ నష్టం రాకుండా, మొత్తంమీద పన్నుల రేటును కొద్దిగా హెచ్చు చేయవచ్చు. దీనివలన రెండు విధాలా కూడా ఉద్యోగ విస్తరణానికి ప్రోత్సాహం కలుగుతుంది. ఈ పద్ధతిని పూర్వం ఇంగ్లండులో ఉపయోగించారు. ఇంగ్లండులో పారిశ్రామిక పురోగమనం పరిణతి పొందింది కనుక ఈ విధానం అక్కడ ఎక్కువ విజయవంతం అవడానికి అవకాశం ఉంది. మన దేశంలో అంతటి ఎక్కువ అవకాశం లేకపోయినా, శ్రామిక శక్తి సరఫరా ఎక్కువ కనుక కొంతవరకు అయినా అవకాశం ఉంటుంది. ఈ పద్ధతివలన ప్రభుత్వానికి, పారిశ్రామికులకు, పెట్టుబడిదారులకూ కూడా నష్టం రాదు. ఈ ఉపాయాన్ని మొట్టమొదట కనిపెట్టినది నికోలస్ కాల్డర్. మూడవ ప్రణాళికలో తగినంత పరిశ్రమాభివృద్ధి కలుగుతుంది కనుక, ఈ విధానం ఎంతవరకు ఫలప్రదమౌతుందో పరిశీలించవచ్చును. అయితే ఇది పారిశ్రామిక నిరుద్యోగానికి మాత్రమే సంబంధించినది.

మూడవ ప్రణాళికలో నిరుద్యోగ సమస్యపై సహకార వ్యవసాయానికి అనన్యమైన ప్రభావం ఉంటుందని ఊహించవచ్చును. గ్రామీణ రంగంలో ఈ ప్రభావం వలన నిరుద్యోగం అనేది పెద్దగా తగ్గినప్పటికీ, ప్రతి వ్యక్తికి తగినంత ఉద్యోగం లభించదు. నాగపూరులో సహకార వ్యవసాయంపై జరిగిన కాంగ్రెసు తీర్మానం ప్రకారం ప్రతి గ్రామంలో, ప్రతి ఒక్కరికి, భూమి ఉన్నా భూమి లేకపోయినా, సహకార వ్యవసాయ సంఘంలో సభ్యులుగా చేరే హక్కు ఉంది. సహకార వ్యవసాయ సంఘంలో సభ్యులుగా చేరిన భూమిలేని వ్యక్తి సమష్టి భూమిపై శ్రామికుడుగా పని చేసి, దానికి తగిన ప్రతిఫలాన్ని పొందుతాడు. ఈ తీర్మానం ప్రకారం ప్రతి గ్రామీణుడికి సంఘంలో చేరి శ్రమించి, ప్రతిఫలాన్ని పొందే 'హక్కు' ఉన్నది కనుక ప్రస్తుతం గ్రామంలో పనిపాటలు లేక తిరిగేవారంతా ఉద్యోగులౌతారు. ఐతే సహకార వ్యవసాయంలో ఉద్యోగ విస్తరణ ఈ విధంగా జరగడం కేవలం ఆవశ్యకత వలన కాదు; ప్రజల హక్కును నిలబెట్టేందుకు మాత్రమే! సహకార వ్యవసాయం వలన, సమష్టి కృషి వలన, ఇప్పుడు మనవ్యక్తులు భరించలేని యంత్రాంగం అప్పుడు నలుగురూ కలసి భరించడానికి వీలౌతుంది. అందువలన గ్రామ సమష్టి క్షేత్రంలో శ్రామికుల అవసరాన్ని తగ్గించే ట్రాక్టర్లు మొదలైన యంత్రాలు ఎక్కువవుతాయి. దీనివలన శ్రామికులకు గిరాకీ, ఆవశ్యకత కూడా తగ్గుతాయి. గ్రామంలో వ్యవసాయానికి కావలసిన కూలీ, శ్రామికుల సంఖ్య ఈ యంత్రాంగం వలన బాగా తగ్గిపోతాయి. అందువలన ప్రతి గ్రామీణుడూ భూమిలేకపోయినా సమష్టిసేద్యంలో చేరవచ్చును అనే హక్కు ప్రసాదింపబడిపోతే అదివరకు కన్న నిరుద్యోగం ఎక్కువౌతుంది. అయితే ఈహక్కు నివ్వడం వలనకూడా పరిస్థితి ఏమంత బాగుపడదు. అదివరకు నలుగురు చేయగలపనినే ఇప్పుడు పదిమందికి పంచుతారు. కాబట్టి ఎవరికీ తగినంతపని ఉండదు. పైగా ఈ పంపకం పరస్పర వైమనస్యాలకు దారి తీస్తుంది. అందువలన సమష్టి వ్యవసాయ విధానం ప్రవేశపెట్టబడడంవలన గ్రామీణరంగంలో నిరుద్యోగ సమస్య మరింత క్లిష్టతరమౌతుంది అని చెప్పవచ్చును. ఒకవేళ యంత్రాంగం ప్రవేశపెట్టబడక పోయినప్పటికీకూడా మొత్తంమీద శ్రామికులకు గిరాకీ తగ్గుతుంది. ఇది అనుభవైకవేద్యమైన విషయం. వ్యవసాయం సంవత్సరంలో ఏవో కొన్ని నిర్ణీత కాలాల్లో జరిగేది కావడంవలన ఆ కాలాల్లోమాత్రమే మన కృషీవలులకు పని దొరుకుతుంది కాని మిగతా సమయంలో వారు పూర్తిగా నిరుద్యోగులే. ఇప్పుడు సహకారవ్యవసాయం పెట్టడంవలన ఆ కాలాలలో కూడా వారికి పూర్తిగా పనిదొరికే అవకాశం ఉండదు. అయితే గ్రామీణ రంగంలో ఈ నూతన సమస్యకు కేంద్ర ఉద్యోగ సంస్థ ఏమీ ప్రాధాన్య మిచ్చినట్టులేదు.

నిరుద్యోగసమస్యను తగ్గించేందుకు చిన్నతరహా పరిశ్రమలను ముఖ్యంగా అంబర్ చర్ఖా చేనేత మొదలైన వాటిని నెలకొల్పవలెనా లేక పెద్ద తరహా పరిశ్రమలను నెలకొల్పవలెనా అన్న విషయం చర్చనీయం. ఈ సందర్భంలో కేవలం ఉద్యోగవిస్తరణే కాక, ఆ రూపేణా చేసే ఖర్చుకు తగిన ప్రతిఫలం లభిస్తోందా లేదా అనే విషయం కూడా విచారణీయం. చిన్న పరిశ్రమలు విషయంలో పెట్టుబడి తక్కువ పెట్టడానికి, తక్కువకాలం కొంత ప్రతిఫలం పొందడానికి అవకాశం ఉన్నప్పటికీ, దీర్ఘకాలికంగా విస్తరణకు, ఉత్పత్తికి అవకాశాలు తక్కువగా ఉంటాయి. వాటిలో శ్రామికుల వేతనాలు ప్రారంభంలో తక్కువే అయినా, సంస్థ వృద్ధి అయి, ఆ ఉత్పత్తికి గిరాకీ అధికమై, లాభాలు పెంపొందడంతో శ్రామికుల వేతనాలు కూడా పెరగడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈ తరహా పరిశ్రమల వలన, ఇటు ఉద్యోగ విస్తరణకు, అటు జాతీయాదాయానికి కూడా అవకాశం కలుగుతుంది. ఇటువంటి సంస్థలు సహకారసంఘాల యాజమాన్యాన, ప్రభుత్వ ప్రోత్సాహంతో పెంపొందగలవు. అయితే గ్రామీణ పరిశ్రమలకు చేతిపరిశ్రమలకు ప్రభుత్వం ఏ ప్రోత్సాహం ఈయనక్కర్లేదని దీనిభావం కాదు. ఉద్యోగ విస్తరణానికి కేవలం చిన్న తరహా పరిశ్రమల వృద్ధే ఏకైక మార్గం అని అనుకోవడం సముంజసం కాదు. కొన్నిప్రాంతాలలో, ముఖ్యంగా వ్యవసాయిక రాష్ట్రాలలో చిన్న పరిశ్రమల వృద్ధి అనుకూలంగా ఉండవచ్చును. అటువంటి ప్రదేశాలలో తదనుగుణంగా సహకార సంఘాలక్రింద వాటిని పెంపొందించవచ్చును. అంతేకాని, దేశవ్యాప్తంగా ఒక్కమార్గాన్ని అనుసరించడం భావ్యంకాదు. అయితే కొన్నిప్రదేశాలలో

# సాహితీ సుగతుని స్వాగతం

గుంటకల్లు - గుంటూరు బండి. ఒంటెద్దు బండి ఒకొపుల్లో పరుగులు తీస్తోంది "నిప్పుంటుందా, అయ్యగారూ?" అని సన్నని గొంతు వినిపించింది రైలుబండి రొదలో. కిటికీలోనుంచి పక్కలోకి పొలాల ప్రకృతిని చూస్తున్న వాణ్ణల్లా యథాలాపంగా తలతిప్పి చూశాను. ఎదుటిసీటులో కూర్చుంది ఒక గ్రామీణ ప్రౌఢ. మరోకసారి మరికొంత స్పష్టంగా వినిపించింది ఆ ప్రశ్న. మళ్ళీ తిరిగి చూశాను. నేనూ, ఆమె తప్ప ఆ పెట్టెలో మరెవరూ లేరు. కనుక నన్నే ఈ ప్రశ్న వేసిందా? ఛా! నన్నెందుకు అడుగుతుంది! నాది శ్రోత్రియ వేషం. పెళ్లికొచ్చినంచకట్టు, చొక్కా లేని ఉత్తరీయం, గోష్పాదమంత జుట్టూ, ఛాందసమైన ప్రవర్తన - అనుకుంటూ ఉండగానే "నిన్నే అయ్యగారూ, నిప్పుందా లేదూ?" అన్నది. అగ్గిపెట్టె ఎందుకూ ఈమెకు? "ఏంటయ్యగారూ! ఉంటే ఉందను; లేకుంటే లేదను. ముగ్గురాలు తాగిన గున్నమాదిరిగా చూస్తావేం?" అంది పండ్లగిలిస్తూ. కొట్లు తిన్నంతగా బాధపడ్డాను. "నిప్పెందుకూ నీకూ? నా దగ్గర లేదు." అన్నాను కోపంగా. "లేదన్నావుగా. నీకెందుకూ? నే చుట్టకాల్చుకుంటా" అన్నది. "ఆఁ! చుట్టకాలుస్తావా?" అని గద్దించాను. "నీకేం? అచ్చపొగ పీలుస్తా." అన్నది గట్టిగా. నిజమే. నాకేం? ఇంతలో బండి ఒక స్టేషను దగ్గర ఆగింది. మరొకరు పెట్టెలోకి ఎక్కారు. అతని దగ్గర అగ్గిపుల్ల పుచ్చుకొని ఆ ప్రౌఢ చుట్ట వెలిగించి కసికొద్దీ నామీదికే గుప్పుగుప్పున పొగ వదిలింది.

ఆ పొగ గాటులో నా ఆలోచనలు రెక్కలు విచ్చాయి, దాని చరిత్రకోసం. 'ముందున్న చెవులకన్నా వెనుకవచ్చిన కొమ్ములే వాడి' అన్న సామెత అక్షరాల నిజమైంది, ఈ పొగాకు గురించిన విషయంలో - అనుకున్నాను. అయినా ఈ పొగాకు ఇటీవలనే కదా మనఖండంలో, మనదేశంలో వ్యాపించింది, నాగజముడులాగ. మనదేశానికే ఏమిటి? యూరోప్ ఖండానికి మహామారిలాగ పాకింది యూరోపుఖండపు వింతప్రకృతమే. నేడు మనదేశంలో పెద్దపంటలలో ఒకటిది. మన రాష్ట్రానిదే అగ్రస్థానం ఈ పంటలో.

అమెరికాలో పుట్టి పెరిగి విశ్వవిజయం చేసిన దీని రకాలు 50కి పైగా ఉన్నాయి. దీనిని 'నికోటియానా' అని ఫ్రాన్సులో పూర్వం అనేవారు దీనిని ఫ్రాన్సుకు తెచ్చిన జీన్ నికోట్ అనే అతని గౌరవార్థం ఈ పేరు పెట్టారు. నికోటియానా రుస్టికా అనేది మెక్సికో మొక్క. నికోటియానా టబాకమ్ కాలిఫోర్నియా నుండి. ఈ టబాకమ్ అనే మాటే టొబాకో అని తమాఖూ అని రకరకాలుగా మారింది. టంబాక్-అరబ్బీ. తంబాకూ-పార్సీ. తమాకూ. తమాక్, తంబాక్, బుజ్జేర్ ఫంగీ - హిందీ. తంబాకూ - మరాఠీ. తమాకూ - సింధీ. తమాక్ - బెంగాలీ. తంబాకూ, హొగెసొప్పు-కన్నడం. పుగైఇలై-తమిళ్. పొగాకు, పుగాకు-తెలుగు. నికోటియానా రుస్టికా, నికోటియానా టబాకం-ఇవి రెండే వందసంవత్సరాలుగా మనదేశంలో హెచ్చుగా పండేవి. ఇటీవల వర్జీనియా పొగాకుపంట హెచ్చయిందనుకోండి.

యూరోపువారికి పొగాకు తొలిసారిగా 1492 లో కొలంబస్ అనుయాయులు వెస్టుఇండీస్ దీవులలో చూపించిన తర్వాతనే తెలిసింది. నూతనదేశాలు కనుగొనడానికి బయలుదేరిన కొలంబస్ పొగాకు తాగడం మొట్టమొదట క్యూబాలో చూశాడట. ఆయన చూడలేదు. ఆయన అనుయాయులు 'గ్వానాహానీ' (శాన్ సాల్వడోర్)లో స్థానికులు తాగడం చూశారని కొందరు చరిత్రజ్ఞులంటున్నారు అక్కడివారు తాటాకు చుట్టలలో పొగాకు వేసుకొని (నేడు తెలంగాణా గ్రామవాసులు లాగ) తాగేవారట. పొగాకు మొక్కను 'కోహిబా' అని, కాలుతున్న దానిని 'టబాకో' అని వ్యవహరించేవారని కొందరన్నారు. పొగాకు పేరు 'యుయిజా' లేక 'కోహబా', దానిని కాల్చే గొట్టం పేరు 'టొబాకో' అనేవారని మరొకరన్నారు. Y(వై) ఆకారంగల గొట్టంలో పై పంగలు రెండూ ముక్కులో పెట్టుకొనే వారని, కిందిగొట్టంలో పొగాకు కాలుతూ ఉండేదని ఒకరు తెలిపారు. ఈ గొట్టానికే 'టుబాకో' అని పేరన్నారు.

పొగాకు నమలడం స్పెయినువారు దక్షిణ అమెరికాలో మొదట చూసింది 1502 లో. తర్వాత అమెరికావాసులంతా దీనికి అలవాటుపడం చూశారు. నశ్యం వేసుకోవడమూ ఉండేది మెక్సికోలోను, అమెరికాలోని తక్కిన ప్రాంతాలలోను.

ఉత్తర దక్షిణ అమెరికాలలోని కొన్ని సమాధులలో ఎంతో పురాతనం గల పొగాకు గొట్టాలు (చిలుములు) దొరికాయట. కొన్ని గొట్టాలపై ఉత్తర అమెరి

# సాహితీ సుగతుని స్వగతం

"తేనఖోపనసమయేన ఆయుష్మన్తో పిలిందవచ్ఛస్స సీసాభితాపో హోతి — అనుజానామి భిక్ఖవే ముద్ధని తేలకంతి, నక్ఖమనీయో హోతి — అనుజానామి భిక్ఖవే నత్థుకమ్మంతి.........................నక్ఖమనీయో హోతి — అనుజానామి భిక్ఖవే ధూమం పాతుంతి. తఞ్ఞేవ వట్టిం ఆలింపేత్వా పిబంతి - కంఠం దహతి - అనుజానామి భిక్ఖవే ధూమనేత్తంతి - తేన ఖోపన సమయేన ఛబ్బగ్గియా భిక్ఖూ ఉచ్చావచాని ధూమనేత్తాని ధారేంతి. సంఖనాభిమయాని - తేన ఖోపన సమయేన ధూమనేత్తాని అపారుతాని హోంతి, పానకా పవిసంతి - అనుజానామి భిక్ఖవే అపిధానంతి - తేన ఖోపన సమయేన భిక్ఖూ ధూమనేత్తాని హత్థేన పరిహరంతి - అనుజానామి భిక్ఖవే ధూమనేత్తథవికంతి - ఏకతో ఘంసియంతి - అనుజానామి భిక్ఖవే యమకథవికంతి - అంసబంధకో న హోతి - అనుజానామి భిక్ఖవే అంసబంధకం బంధనసుత్తంతి" (ఓల్డెన్‌బర్గ్-వినయ సంపుటం-1, పుట 204)

ఆయుష్మంతుడైన పిలిందవచ్ఛునికి భిక్షువుకు శిరోభితాపం (తలనొప్పి) అయితే ఏమిచేయాలనే ప్రశ్నకు సమాధానంగా తథాగతుడు, తలమీద నూనె పెట్టుకోవడానికి, నస్యకర్మ చేసుకోవడానికి, ధూమపానానికి అనుమతిస్తాను. "నస్యకర్మ చేసుకున్నప్పటికి గుణహీనమైతే ఏమిచేయాలి - ధూమపానం చేయడానికి అనుమతిస్తాను. వత్తిగా చేసుకొని ధూమపానం చేయాలి. గొంతులో మంట అయితే ఏమి చేయాలి? చిలుము (ధూమ నేత్రంలో) తాగడానికి అనుమతిస్తాను. ఈ చిలుముగొట్టాలు అపవిత్రమైపోయి, పురుగులు దూరితే ఏమిచేయాలి? ఆ చిలుము గొట్టాలకు మూతలు పెట్టుకోవడానికి అనుమతిస్తాను. ఒకప్పుడు వాటిని చేత్తో తీసుకునిపోవడం కష్టమైతే ఏమిచేయాలి! దానికి బంధనసూత్రం (తాడు) కట్టి భుజానికి వేలాడవేసుకోడానికి అనుమతిస్తాను." అని అన్నాడు.

సంస్కృత సాహిత్యంలో ధూమవర్తిపానం, రోగనివారణకోసమూ, స్వస్థవృత్తికోసమూ, విలాసంకోసమూ ఆచారమైనట్టు ప్రమాణాలు చాలా ఉన్నాయి. తారాపీడుడు 'పరిపీతధూమవర్తిః' (ధూమపానం చేసి) విశ్రాంతి తీసుకున్నట్టు కాదంబరిలో ఉంది.

వైద్యక గ్రంథాల్లో నస్యధూమపాన ప్రక్రియలు శాస్త్రోక్తంగా వర్ణించబడ్డాయి. ఈ ధూమపానం ఔషధ ద్రవ్యాలధూమపానం. ఇది ఎలా ఎప్పుడు చేయాలనేది చరకుడు చెప్పిన విధమిది.

"స్నాత్వా భుక్త్వా సముల్లిఖ్య
క్షుత్వా దంతాన్నిఘృష్య చ,
నావనాంజన నిద్రాంతే
చాత్మవాన్ ధూమపో భవేత్."
(చ. సూత్రస్థా. 5,28)

స్నానం చేసిన తర్వాత, భుజించిన తర్వాత, జిహ్వాలేఖనానంతరం, తుమ్మిన తర్వాత, పళ్ళుతోముకున్న తర్వాత నస్యం తర్వాత అంజనం వేసుకొన్న పిదప, నిద్రలేవగానే, శ్రద్ధగా ధూమపానం చేయాలి. ఎలా తాగాలి?

"ఋజ్వంగచక్షుః తచ్చేతాః
సూపవిష్టః త్రిపర్యయం,
పిబేచ్ఛిద్రం పిధాయైకం
నాసయా ధూమమాత్మవాన్." (42)

సరిగా నిటారుగా కూచుని, తదేకచిత్తంతో, ఒక ముక్కుపుటం మూసుకుని మూడుమార్లు ముక్కుతో పీల్చాలి. ఇక చిలుముగొట్టం ఎలాఉండాలి అన్న విషయమై కూడా నిర్వచనాలున్నాయి:

"చతుర్వింశతికం నేత్రం
స్వాంగులీభిర్విరేచనే,
ద్వాత్రింశదంగులం స్నేహే
ప్రయోగే చాధ్యమిష్యతే." 48.

ధూమనేత్రం - చిలుముగొట్టం విరేచనక్రియకైతే 24 అంగుళాల పొడవు ఇలాగే...

కనుక, మనకు ధూమపానం చాలాకాలంనుంచే ఉండడం స్పష్టం. పొగతాగడం కూడా అమెరికాలోని పూర్వవాసులు చేస్తున్నట్టే మనవారూ ముక్కుతోనే పీల్చేవారని అనడాన్ని గ్రంథాచార్యులు తెలిపారుగదా. కాలంతోపాటు మనదేశానికి విహారాలలో ఈ ధూమపానమూ శాస్త్రీయంగా వచ్చిఉంటుందేమో! (వైద్యకంలో ఉండనే ఉందాయె.) ఈ అభ్యాసం ఎలానూ ఉంది గనుక కొత్తగా వచ్చిన పొగాకు పాతిగంజాయినీ, ఔషధధూమవర్తిని తోసిరాజనింది.

కాగా, పొగాకు మనదేశంది కాదు; కలంజం గంజాయి కానీ, పొగాకు కాదు; పొగాకు ఇటీవలిదేనని వృక్షశాస్త్రజ్ఞులు, ఇతరపండితులు చెప్పడం ఎంతైనా సమంజసం.

ఇదిదేశంలో నాలుగుమూలలా వ్యాపించినతర్వాతనే రకరకాల చాటువులు పుట్టాయి.

—రామచంద్ర.

# ప్రాకృతభాష: శ్రీ పరవస్తువారి సేవ

శ్రీ నిడుదవోలు వేంకటరావు

శ్రీమద్విజయనగర మహారాజ సంస్థాపిత సంస్కృత కళాశాలాధ్యక్షులై, తరువాత, శ్రీ దివ్య తిరుపతి క్షేత్రమున సంస్కృత కళాశాలాధ్యక్షులుగను, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయాధ్యక్షులుగను ప్రసిద్ధిగాంచిన పరవస్తు వేంకటరామానుజస్వామిగారి వంటి సంస్కృత విద్యార్థిగాని, విద్వాంసుడుగాని లేరనుట యతిశయోక్తి కాదు. సంస్కృత ప్రాకృత భాషలయందేగాక, ఆంధ్రాంగ్ల శాస్త్రీయ (జర్మను) భాషలయందు పండితులగుటచేత, రామానుజస్వామిగారాంధ్రవిద్వల్లోకమునకేగాక భారతదేశమునందలి ప్రాచ్యవిజ్ఞానపరిశోధకుల కెల్ల కృతపరిచయులు. వారు రమారమి నాల్గేండ్లక్రిందట మొన్నటి సెప్టెంబరు తే 14 దిని వైకుంఠవాసులగుటచేత ప్రాచ్యభాషా సంస్కృత పరిశోధనమునకు, ముఖ్యముగ ప్రాకృతభాషా వాఙ్మయ ప్రపంచమునకు తీరని కొఱత వాటిల్లినది.

శ్రీ రామానుజస్వామిగారాంధ్రదేశమునందేగాక యావద్భారతవర్షమున,[1] ప్రాచ్యభాషా సంస్కృత పరిశోధక పీఠమని ప్రఖ్యాతిఁగాంచిన యార్ష గ్రంథాలయ భవనమున పరవస్తు పండిత వంశమున జన్మించిరి. ప్రసిద్ధ దేశీయ వైష్ణవులగు వీరి పూర్వులలో శ్రీనివాసాచార్యులనువారు వేంకటగిరి ప్రాంతమునుండి విజయనగర ప్రాంతమునకు, అప్పటి విద్యాధికులఁ గోరి రావించి, ఆ కాలమున విశాఖపట్టణమున శ్రీ గోడె వెంకటజగ్గారావు జమీందారుగారి ప్రోత్సాహమున వచ్చి అచ్చటనే స్థిరనివాస మేర్పఱచుకొనిరి.

శ్రీనివాసాచార్యులవారే తొలుత సంస్కృత భాషలో నకారాదిగా నిఘంటు రచనకు ప్రారంభకులు. వారు రచించిన నిఘంటువు [2]సర్వశబ్ద సంబోధిని యనునది. వారు క్రీ. శ. 1832లో కీర్తిశేషులగుటకు ముందుగనే యది పూర్తియైనది. వారి కాలము క్రీ. శ. 1770-1832. తర్వాత నది క్రీ. శ. 1875 సంవత్సరమున ముద్రితమైనది. అది తెలుగు లిపితో, సంస్కృతాంధ్రార్థములతో వెలయుచున్నది. శ్రీనివాసాచార్యులవారి కుమారులు జగద్గీతకర్తలు వేంకటరంగాచార్యులవారు. మహాసముద్రమువంటి సంస్కృత భాషలో "శబ్దార్థ సర్వస్వము" అను విజ్ఞాన సర్వస్వమును నిర్మించిన మహావిద్వాంసులు; భారతవర్షమున నాంగ్లప్రభుత్వమువారిచే ప్రథమమున మహామహోపాధ్యాయ బిరుదముచే నలంకృతులైన పండితావతంసులు; అసాధారణ ధారణా సంపన్నులు; అత్యద్భుత ప్రతిభావిభాసితులు; అనంత శిష్యప్రశిష్యులకుఁ గల్ప మహీరుహములు నగు శ్రీ రంగాచార్యులవారిని గూర్చి విశేషముగ ప్రశంసించుట సూర్యుని కాగడాతో చూపుట వంటిది. వారి పుత్రులు శ్రీనివాస జగన్నాథస్వామి అయ్యవార్లంగారు. వీరును పాండిత్యమున తండ్రిని మించిన పుత్రులు. శ్రీనివాస జగన్నాథస్వామి అయ్యవార్లంగారికి నలువురు పుత్రులు. వేంకట రంగనాథస్వామి 1875-1918. వేంకట రఘునాథస్వామి 1884-1916. లక్ష్మీనరసింహస్వామి 1887. వేంకట రామానుజస్వామిగారు 1895-1959.

రంగాచార్యులవారి పౌత్రులందఱును వారి యశస్సునకు స్తంభాయమానులై నిలచిరి. కీర్తిని గూర్చి సుప్రసిద్ధాంధ్ర దేశీయ సంస్కృత వాఙ్మయ పరిశోధకాచార్యులు శ్రీ యీయుణ్ణి వేంకటరఘునాథాచార్యులవారి కతికే ఆంధ్రపత్రిక ఆంగీరస (1932) సంవత్సరాది సంచికయందు విశేషించి వ్రాసియున్నారు. పై వారిలోఁ గడపటివారగు శ్రీరామానుజస్వామిగారినిఁ గూర్చి ప్రస్తుత మీ వ్యాసము.

శ్రీ రామానుజ స్వామిగారు, సంస్కృతము ప్రధానముగా పట్టపరీక్షయందు కృతార్థులై యూ

---

1. క్రీ. శ. 1908లో పాశ్చాత్య పండిత ప్రకాండుడు, వైదిక సంస్కృత విద్వాంసుడునగు నాచార్య - డాక్టరు ఏ. ఏ. మాక్డొనాల్డు తన భారతవర్ష సారస్వత యాత్రలో విశాఖపట్టణమునున్న యీ గ్రంథాలయమును సందర్శించినాడు.

2. ప్రసిద్ధాంధ్రభాషా నిఘంటు కర్తలు, బహుజనపల్లి వారు తమ నిఘంటువున సంస్కృతపదములను చాలవఱకు నీ నిఘంటువునుండి గ్రహించిరి.

# ప్రాకృతభాష శ్రీ పరవస్తువారి సేవ

వెనుక, సంస్కృతమే ప్రధానముగా శాస్త్రాచార్య (M. A.) పట్టమును క్రీ. శ. 1917 లో బడసిరి. వీరి కాచార్యులు విజయనగరమున నాంగ్ల గీర్వాణ కళాశాలలకు రెంటికి నధిపతులు, సంస్కృతాంధ్రాంగ్ల భాషాపారంగతులు, కీర్తనీయులు నగు శ్రీ కిడాంబి రామానుజాచార్యుల వారు (M. A.B. L) (1853-1929). రామానుజస్వామిగారు ప్రథమమునుండియు వంశక్రమాగతమైన సంస్కృతమునందే గాక ప్రాకృత భాషయందును పరిశ్రమ గావించుచుండెడివారు.

వారి కాంధ్రభాషయందును ప్రవేశము నాడే కలిగినది. పరవస్తు విద్వద్వంశమున, విశేషములలో నది యొకటి. పరవస్తువంశీయు లెందరు సంస్కృతభాషా విద్వాంసులో తెలుగుభాషాసంప్రదాయములను, రచనా విధానము నంతగా నెరిగిన ధీవర్యులు. పరవస్తు రంగాచార్యులవారి యాంధ్రభాషాపాండిత్యము, కవితా గరిమ, వచన రచన శాకుంతలనాటకాంధ్రీకరణము చేతను, నిశ్శంక చరిత్రమను మనుచరిత్ర వచన చేతను, సంగ్రహాంధ్ర నిఘంటువునకు బైగా వారు ప్రకటించిన హైందవ విజ్ఞాన విషయక గ్రంథముల చేతను విదితమైయున్నది. శ్రీ భట్టనాథస్వామిగారును తెనుగున, యూరోపు తత్త్వోపన్యాసము మొదలగు నుపన్యాసములను వ్రాసియున్నారు. కావున మన రామానుజస్వామిగారికి నాంధ్రభాషా రచన యబ్బిన దన్న యెడ నించుకయు వింతగాదు.

రామానుజస్వామిగారు క్రీ. శ. 1915 సంవత్సరమున విజయనగర సంస్కృత కళాశాలలో, నాంధ్ర భాషోపాధ్యాయులుగా ప్రవేశించి, యావెనుక, సంస్కృత వాఙ్మయ చరిత్రము, సామ్యభాషాతత్త్వ శాస్త్రము (Comparative Philology) బోధించుచుండెడివారు. క్రీ. శ. 1918 లో నా కళాశాలలో నుపాధ్యక్షులైరి. అవెనుక క్రీ. శ. 1929 లో కళాశాలాధ్యక్షులగు శ్రీ రామానుజాచార్యులవారు స్వర్గస్థులైన వెనుక కళాశాల కధ్యక్షులై, క్రీ. శ. 1942 వరకు నా పదవియందుండిరి. వీరికాలమున నా కళాశాల మహోన్నత దశ నంది కీర్తి వల్లి విరాజిల్లుచున్నది. ఆంధ్రదేశముననే కాక భారతవర్షమునం ప్రఖ్యాతి కెక్కిన మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు, వ్యాకరణాలంకారాధ్యాపకులు శ్రీ వేదూరి వెంకటశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, తర్క పండితులు గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు, ఆంధ్రవైయాకరణసార్వభౌములు వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు, నా కళాశాల నలంకరించిన పండితులు. ప్రాచీనపండితులకు నగాధ పాండిత్యమేగాని నవీన పాశ్చాత్య వైజ్ఞానిక సంస్కారము లేదనియు, పాశ్చాత్య విద్యా విజ్ఞాన సంస్కారము బడసి, పృథగ్గుణులైనవారికి పాండిత్యము కొఱవడు ననుమాట లన్నియు వీరికాలమున నర్థములేనివైనవని చెప్పుట సత్యోక్తియే. అగాధ పాండిత్యము, అద్వితీయమైన సంస్కృతివికాసము సమైక్యము నొందిన విశిష్ట సంస్థగా సంస్కృతకళాశాల రూపొందినది. ఈనాడు దేశమున నివసించు ప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు: కవులు పెక్కురీ సంస్కృత కళాశాలకు సంబంధించినవారే.

రామానుజస్వామిగారు విజయనగర సంస్కృత కళాశాలాధ్యక్షపదవియందున్నప్పుడు సంస్కృత కళాశాలాచరిత్రమును సువర్ణాక్షరములతో లిఖింపదగిన రెండు మహాకార్యములు జరిగినవి. 1 మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి పాదుల షష్టిపూర్త్యుత్సవము. 2. సంస్కృత కళాశాలా సువర్ణోత్సవము.

క్రీ. శ. 1942 వ సంవత్సరమున, శ్రీ రామానుజస్వామిగారు తిరుపతియందు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయాధ్యక్షులుగను, దేవస్థాన సంస్కృతకళాశాలాధ్యక్షులుగను నియమితులై యా పదవియందు పండ్రెండేండ్లు వ్యవహరించి, క్రీ. శ. 1955 సంవత్సరమున, విశ్రాంతి గైకొనిరి. ఇట్లు వారు నలుబది సంవత్సరములు అవిచ్ఛిన్నముగా నధ్యాపకత్వమున, పరిశోధనమున జీవితము గడపిరి. విశ్రాంతి గైకొన్నను వారు తమ జీవితాంతమువఱకు పరిశోధన, భాషాసేవ గావించుచు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకవర్గసభాసభ్యులై యుండిరి.

శ్రీ తిరుపతి క్షేత్రమున, మహావిద్వాంసులైన, మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గారలు వీరికాలమున పరిశోధనసంస్థయందు ప్రవర్తిల్లిరి, సంగీతసాహిత్యకళాపారగులు, విమర్శకావతంసులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు వీరున్నప్పుడే నియమితులగుటయు, వీరి జీవితమున నొక యదృష్టము.

వీరికాలమున నా యీ సంస్థలో విశేషము లుద్భవిల్లినవి.

1) శ్రీ వేంకటేశ్వర పరిశోధనాలయ పత్రికకు సంపాదకులై దానిని ప్రథమశ్రేణిలోని పరిశోధన పత్రికగా పెంపొందించిరి.

2) వీరికాలమున శ్రీ ప్రభాకరశాస్త్రి గారి మూలమున శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులవారి యొత్తి నములేర్పడి వెలికిరి కన్పట్టుచున్నవి.

3) తిరుపతి క్షేత్రమున హిందూమతవ్యాప్తికి, బోధనకు, ప్రచారమునకు, నొకపాఠశాల యేర్పాటైనది. దాని ప్రణాళికను వీరే తయారుచేసిరి.

వీరిట్లు బహుముఖముగా తామున్న సంస్థలకు సంస్తవనీయమైన సేవ గావించినను, కీర్తిప్రతిష్ఠల కాసింపని తత్త్వముగలవారు, స్వార్థనిర్వ్యపేక్ష కర్మఠులు, మితభాషులు. సౌజన్యపురుషులు, పరమశాంతస్వభావులు. వీరినిగూర్చి కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారిట్లు చెప్పుచుండెడివారట.

"మిన్ను విఱిగిపడిన మీదను తొందర
పాలుగారు ప్రిన్సిపాలుగారు."[3]

శ్రీ రామానుజస్వామిగారు సంస్కృతాంగ్లభాషలయందు పరిశోధన వ్యాసములు వ్రాసియున్నారు. వారు ప్రాకృతభాషయందు సిద్ధహస్తులైన పండితులు. ఇక జర్మనుభాషయందు పరిశ్రమ చేసిన తెలుగువారిద్దరు ముగ్గురులో వారు గణనీయులు.[4] వారి పరిశోధన విజయనగర మహారాజాంగ్ల కళాశాల పత్రికతో ప్రారంభమైనది. వారి పరిశోధన వ్యాస వివరము లివి.

సంస్కృతము—సంస్కృత వాఙ్మయమున నాటకములనుగూర్చి వీరు హెచ్చుగా పరిశ్రమించిరి. శ్రీ హర్షుని నాటకత్రయమగు నాగానందము, ప్రియదర్శిక, రత్నావళి యను మూడింటికి నాంగ్ల భాషలో మూలముతో, వివరణములతోను సుసంస్కృతములగు ముద్రణములను ప్రకటించిరి. మఱియు నాటక సంబంధములగు నీ క్రింది వ్యాసము లాంగ్లభాషలో రచించిరి.

1. సంస్కృత నాటకములయందలి కాలవిభజనము—(Time Analysis in Sanskrit Plays.) ఈ వ్యాసమున కాళిదాసాది ప్రసిద్ధనాటకములు పరిశీలన చేయబడినవి.

2. సంస్కృత నాటకములలో విదూషకపాత్ర. (Vidushaka in Sanskrit Plays.)

ఇవి రెండును విజయనగర మహారాజాంగ్ల కళాశాల పత్రిక 2, 3, 4 సంపుటములలో ప్రకటితములైనవి.

3. సంస్కృత నాటకములయందలి కాలద్వయవాదము (Double time theory in Sanskrit Plays. K. B. Pathak Commemoration Volume)

4. సంస్కృత నాటకముల హాస్యరసము—(Humour in Sanskrit Plays. Journal of Sri Venkateswara Oriental Institute Vol V No I.; Vol VII No. 1.)

5. కాళిదాస శూద్రకుల తారతమ్య పరీక్ష. (Kalidasa and Sudraka. A Comparative study. Gopalakrishnamachar Commemoration Volume).

6. లఘు శబ్దార్థ సర్వస్వము. (Laghu Sabdartha Sarvasvamu J. S. O. R. Vol X) ఇది వారి తాతగారైన వేంకట రంగాచార్యుల వారి గ్రంథమును గూర్చినది.

ఇట్లు వ్యాసములేకాక, "చాళుక్య చరిత్రము" అను పేర సంస్కృత శాసనములలోనున్న చాళుక్యరాజ చరిత్రాంశములను సంగ్రహించిరి. ఇంకను [illegible] యతినిగూర్చి వ్యాసములను, సంస్కృతగ్రంథ సమీక్షలను గావించిరి.

ప్రాకృతము—శ్రీ రామానుజస్వామిగారి కీర్తి ప్రాకృతభాషకు వారొనర్చిన మహత్తర సేవపై నాధారపడియున్నది. సుప్రసిద్ధజైన మతాచార్యుడగు హేమచంద్రాచార్యుని "దేశీనామమాల"ను వీరు భండార్కరు పరిశోధనసంస్థనుండి ద్వితీయావృత్తిని వెలువరించిరి. ఇందు వారు ప్రాకృత దేశీపదములకు సదృశములగు సాజాత్యములైన ద్రావిడ భాషా పదముల

---

3 దీనిని శ్రీ తిమ్మరాజు కోదండరామయ్య గారు నా కెఱుకపఱచిరి.

4. జర్మను భాషయందు పరిశ్రమ చేసినవారిలో మదరాసులో చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు నడుపుచున్న డాక్టరు వి. యస్. శర్మగారొకరు. వీరు జర్మనీ భాషయందు పండితులు—సీతారామాంజనేయ సంవాదాదిగ్రంథములను జర్మనుభాషలోనికి అనువదించిరి.

వ్రాసిరి. నేటి యాంధ్రభాషాతత్త్వ శాస్త్రవేత్తలకీ గ్రంథ మత్యంత ముపాదేయము. మఱియు నీ క్రింది వ్యాసములు వ్రాసిరి.

1. ప్రాకృత భాషాకళాపరిణామము. (The Evolutionary Phase of Prakrit Languages)

2. ప్రాకృత భాషా విభాగములు. (The Division of Prakrit Languages)

3. ప్రాకృత వ్యాకరణమునందలి మతద్వయము (The two achool of Prakrit Grammar) పై మూడును విజయనగరమహారాజ కళాశాలాంగ్ల పత్రికలో ప్రకటితమైనవి.

4. కుందమాలలోని ప్రాకృతము (Prakrit in Kundamala) ఇది సర్ జార్జ్ గ్రియర్సన్ సన్మాన సంచికలో ప్రకటితమైనది

5. హేమచంద్రుని దేశీనామమాల: త్రివిక్రముని వ్యాకరణమునగల దేశపద తారతమ్యనిరూపణము. (A Study of Desi words in Trivikrama's Prakrit Grammar in Comparison with these in Hemachanrdas Desi namamala.

6. త్రివిక్రముని వ్యాకరణమున దేశి పదములు (Desi words in Trivikrama's Gramer)

జర్మనుభాష: 1. వారు క్రి. శ. 1929లో డాక్టరు టి. కె. లాడు (బి. యే. పిహెచ్. డి) జర్మనుభాషలో రచించిన త్రివిక్రముని ప్రాకృతవ్యాకరణ ప్రవేశికను (Introduct;on to Trivikrama's Prakrit Grammar) నాంగ్లేయ భాషలోని కనువదించిరి. అది భండార్కరు పరిశోధన పత్రిక పదవసంపుటమున నాకాలముననే ప్రకటితమైనది.

2. జర్మను భాషలో ఫ్రుయిట్ అను పండితుడు రచించిన భాసుని ప్రాకృతము (Bhasa's Prakrit) అను వ్యాసమును వీరాంగ్లభాషలోని కనువదించిరి.

3. ప్రాకృతమునకు సంబంధించిన వే మఱిరెండు వ్యాసములను వీరు జర్మను భాషనుండి యనువదించిరి. J Waekernagal అను జర్మను పండితుడు రచించిన సంస్కృత వ్యాకరణమునందలి అచ్చులు (Treatment of vowels in Sanskrit Grammar) అను వ్యాసమును వీరనువదించిరి.

4. Willibald Kirjel పండితుడు జర్మను భాషలో రచించిన పురాణ పంచలక్షణ ప్రవేశిక (Introduction to Puraoa Panchalakshana) అను వ్యాసమును వీరనువదించిరి. ఇవి యన్నియు శ్రీ వేంకటేశ్వర పరిశోధన పత్రికయందు ప్రకటితములు.

తెలుగు: తెలుగు భాషను వీరు పెక్కురచనలు చేసిరి.

1. సంస్కృతోద్గ్రంథసమామ్నాయము. భారతి 7 సం. 1 సం. (1930 జనవరి)

2. సంస్కృత భాషయందలి సర్వనామములు భారతి 8 సం.

3. సంస్కృత ప్రాకృతభాషలు. ఈ తెలుగు వ్యాసము. శ్రీ టి. కె. వేంకటాచార్యులవారిచే సంస్కృతీకరింపబడినది.

4. అస్త్రోపలక్షితములగు సనువాదికొంత పదములు. ఈ తెలుగు వ్యాసమును సంస్కృతాంధ్రీకరణమును వేంకటేశ్వర పత్రికయందు ప్రకటితములు.

5. అన్యదాపిత భాషలు. ఆంధ్ర పత్రిక తారణ సంవత్సరాదిసంచిక. ఇట్లు సంస్కృత భాషా విషయకమేగాక, తక్కిన వానినిగూర్చి కొన్ని వ్యాసములు గలవు.

6. ఆంధ్రులు: సంస్కృత భాషాసేవ. భారతి రజతోత్సవ సంపుటము.

7. ఆంధ్ర సంస్కృత సంప్రదాయమునకు వారు వ్రాసియిచ్చిన సంస్కృత పండితుల జీవితములు. ఇంకను సంస్కృత భాషలోని వ్యాకరణ విషయములను గూర్చిన వ్యాసము లముద్రితములై యున్నవి.

వారి జీవితకాలములో తమ తాతగారి శబ్దార్థ సర్వస్వమహాగ్రంథమును కలుగులోనికి దిసకొని వచ్చుట కెంతయు పరిశ్రమజేసిరి. దానిని ముద్రించుట కనువగు ప్రణాళికను తయారుజేసిరి. కాని యది కొనసాగలేదు. నేడు మనము వారికి కృతజ్ఞత శాశ్వతము చేయుటకు నీ క్రింది కార్యము లొనర్పవలసి యున్నది.

1. పత్రికలయందు ప్రకటితములైన వారి వ్యాసము లన్నింటిని, అముద్రితములైన వానిని సంగ్రహించి ప్రకటించుట.

2. ప్రాకృతభాషకు సంబంధించిన వ్యాసములను నాంధ్రభాషలోని కనువదించుట.

3 శబ్దార్థ సర్వస్వ మహాగ్రంథప్రకటనమునకు దోహదమొసంగుట.

సంస్కృత భాషా ప్రాముఖ్యము కరతలామలకమైన యీదినములలో రాష్ట్రీయ కేంద్రప్రభుత్వము వారీ మహాకార్యములకు దోహదమిచ్చి, సంస్కృత ప్రాకృతాంధ్ర భాషావాఙ్మయములను సర్వతోముఖముగ నభ్యుదయము ప్రసాదింతురుగాక!

# వార్తలు

## చంద్రుని వెనుకభాగం

రష్యా ప్రయోగించిన రాకెట్ తీసిన చంద్ర మండలం పశ్చాద్భాగం ఫోటోలు మాస్కోలో ప్రచురించబడ్డాయి. ఈ భాగంగురించి ఇదివరకు ఎవరికీ ఏమీ తెలీదు. ఈ భాగం చదునుగా ఉన్నది. నల్లని పెద్ద మచ్చొకటి, సుమారు 12 చిన్నమచ్చలు ఉన్నాయి. భూగోళంవైపు ఉన్న భాగంలో మిట్టపల్లాలు, అగ్నికుండాలువంటివి ఉన్నాయి. వెనకభాగం ఎక్కువ కాయవలె ఉన్నది. వెనుకభాగంలో ఉన్న పెద్దమచ్చ అగ్నికుండమని, దీనివ్యాసం 187 మీటర్లని, దీనికి 'మాస్కో సముద్రం' అని పేరుపెట్టారని, చిన్నమచ్చలలో ఒకదానికి ఫ్రెంచి పదార్థ విజ్ఞానశాస్త్రవేత్త ఫెడరిక్ జోలియో క్యూరీ పేరుపెట్టారని రష్యా ప్రకటించింది.

## బ్రిటన్‌లో ఎన్నికలు

అక్టోబర్ నెలలో జరిగిన బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలలో ప్రస్తుతం అధికారంలో ఉన్న కన్సర్వేటివ్ పార్టీ గెలుపొందింది. యుద్ధానంతరం ఈ పార్టీ ఎన్నికలలో గెలుపొందడం ఇది మూడవసారి. కన్సర్వేటివ్‌లకు క్రితంసారికంటె రెట్టింపు మెజారిటీ వచ్చింది.

## మరల చైనా దురాక్రమణ

మన దేశం సరిహద్దులో తిష్ఠవేసిన చైనావాళ్లు అక్టోబరు 21 వ తేదీన లడఖ్ ప్రాంతంలోని చాంగ్ చెన్మో లోయలోని మన గస్తీదళాలపై కాల్పులు సాగించి తొమ్మిదిమందిని చంపివేసి, 10 మందిని అరెస్టుచేశాయి. దీనికి భారతప్రభుత్వం తీవ్ర నిరసన తెలిపింది.

లడఖ్‌కు ఉప్పు సరఫరాచేసే అమోఘుర్ సరస్సును, మరికొన్ని పచ్చిక బీళ్లనుకూడా చైనా దళాలు ఆక్రమించాయి. ఇటీవల కొందరు చైనా గూఢచారులు పశ్చిమ బెంగాల్‌లోని కాలింపాంగ్ ప్రాంతంలో ప్రవేశించి విషయాలు సేకరించ సాగారని, వారినధికారులు తెలిసేలోగా కీకారణ్యాలలోకి కాలికి బుద్ధిచెప్పారని తెలుస్తున్నది.

## ఆంధ్రలో ప్రధాని పర్యటన

భారత ప్రధాని పండిట్ నెహ్రూ అక్టోబరు 10 వ తేదీ-మహానవమి నుండి నాలుగు రోజులపాటు ఆంధ్ర ప్రదేశ్‌లో పర్యటన జరిపారు. ఆరోజు ఆయన వరంగల్లులో కేంద్ర ఇంజనీరింగ్ కళాశాలకు శంకుస్థాపన చేశారు. అక్కడినుంచి విమానంలో హైదరాబాదుకు వెళ్ళి మరునాడు షాద్‌నగర్‌లో అధికార వికేంద్రీకరణకు జరిగిన పంచాయతీ సమితి ప్రారంభోత్సవం జరిపారు. ఆ సాయంత్రం వనపర్తి కి వెళ్ళి అక్కడి సాంకేతిక విద్యా శిక్షణ సంస్థకు ప్రారంభోత్సవం జరిపారు. మూడవనాడు [illegible] నాడు బహిరంగసభలో ప్రసంగించారు. ఉదయం మాచెర్లకు వెళ్లి నాగార్జునసాగర్ కు శంకుస్థాపన చేశారు. ఆ ప్రాంతానికి 'విజయపురి' అని నామకరణం చేశారు. నాల్గవరోజు ఉదయం రైలులో తిరుపతికి బయలుదేరి దారిలో తెనాలిలో సహకార నూలుమిల్లు భవనానికి శంకుస్థాపన చేశారు. తిరుపతి చేరి శ్రీ వెంకటేశ్వర దర్శనం చేసుకొన్నారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇంజనీరింగు కళాశాలకు శంకుస్థాపన చేసి [illegible] కళాశాలకు ప్రారంభోత్సవం జరిపారు.

## అఖిలభారత రచయితల మహాసభ

అఖిలభారత రచయితల మహాసభ ఈ సంవత్సరం డిసెంబరు నెలలో మద్రాసులో జరుగనున్నది. [illegible] నుంచి దక్షిణ భారత భాషలలో వెలువడిన గ్రంథాల వివరాలను ఈ సభ సమావేశకులు సేకరిస్తున్నారు. ఈ వివరాలను "అఖిలభారత రచయితల మహాసభ, [illegible] కార్యాలయం, 63, [illegible], తిరువళ్లిక్కేణి, మద్రాసు-5" చిరునామాకు పంపాలని సమావేశకులు కోరారు.

## ఇండో-పాక్ తూర్పుసరిహద్దు

ఇండియా-పాకిస్తాన్ తూర్పుసరిహద్దు (అస్సాం, పశ్చిమబెంగాల్-తూర్పు పాకిస్తాన్ సరిహద్దు) వివాదాలు అక్టోబరు 23 వ తేదీ పరిష్కారమయ్యాయి. ఢిల్లీలో ఈ విషయమై జరిగిన చర్చలలో ఇండియా పక్షాన కేంద్ర ప్రభుత్వమంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్, పాకిస్తాన్ పక్షాన లెఫ్టినెంట్ జనరల్ షేక్ పాల్గొన్నారు.

## డాక్టర్ జి. వి. సుబ్బారావు మృతి

సుప్రసిద్ధ నటులు డాక్టర్ గోవిందరాజు సుబ్బారావుగారు అక్టోబరు 23 వ తేదీన చెన్నపురిలో స్వగృహంలో మరణించారు. వీరి వయస్సు 64 సంవత్సరాలు. డాక్టర్ సుబ్బారావుగారు తెనాలి వాస్తవ్యులు. వైద్యులుగా, నటులుగా పేరుగడించారు. బుస్సీ, యుగంధరుడు, గిరీశం పాత్రలను అనన్యసామాన్యంగా నిర్వహించారు. 1938 లో సినిమారంగంలో ప్రవేశించారు. "మాలపిల్ల" చిత్రంలో సుందరామశాస్త్రి; "బాలనాగమ్మ" చిత్రంలో మాయలమరాఠీ పాత్రలు తెలుగువారు విస్మరింపరానివి.

# ద్విపద భారతము: బాలసరస్వతి లోపాలు

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

ద్విపద భారతకర్తలలో గణింపదగినవాడు బాలసరస్వతి. ఇతడు తిమ్మయార్యుని (ఆదిపర్వకర్త) శిష్యుడో శిష్యప్రాయుడో అయి ఉండునని యు, అందుచే వారతనిని సహాయునిగా గొని యీ రచన నుపక్రమించి యుండునని యు, తా నాదిపర్వ రచన నారంభించి సభాపర్వ నిర్వాహణము నితనిపరము చేసియుండునని యు, నితని రచన యంతసరిగా లేకపోవుటచే నంతతో నితని నాపనినుండి విరమింపజేసి తిమ్మయయే ఆరణ్యపర్వము మొదలు గ్రంథసమాప్తము ప్రవర్తించి యుండునని యు నభిప్రాయపడుటకు వీలుగానున్నది. మొత్తము గ్రంథములో నొక్క సభాపర్వమునమాత్రమే బాలసరస్వతిపేరు కన్పట్టుట, ఆదిపర్వ నిర్వాహణాంతమున అరణ్యపర్వాదులు మరల తిమ్మయకృతులుగానే తెలియుటయు నా యూహకు కొంతవరకు కారణములు. ఏమైననేమి, ద్విపద భారత కర్తలలో ఈతనికిని ఒకింతచోటు దొరికినది. ఆ మహాగ్రంథమునందు ఈ బాలకవి పేరు చిరస్థాయిగా నిలచినది.

అయితే, ఆ స్థానమెట్టిది? అతని రచనావిధానమే తీరున నున్నది? తక్కిన యిర్వురితో నీతడు చేతులు కలిపినాడా, లేక ప్రత్యేకముగా నిలిచినాడా? అను విషయములను కూర్చి యించుక చర్చింతును.

ఇతడు కావ్య నాటకాలంకారాగమము చదివినవాడై యుండవచ్చునని సభాపర్వగద్యాంతములందలి "అసమసాహిత్యవిద్యాదక్షుండు" యను విశేషణము చాటుచున్నది. కాని యాంధ్రభాషా పరిజ్ఞానము గాని, తెనుగు కవితయందును అంత యెక్కువ పరిశ్రమ కలవాడుగా చూపట్టడు. తిమ్మయగారియొద్దనుండి యితడు పోకపై ఛందస్సు నేర్చుకొని యేదో కవితయల్లుటమాత్రమెకింత యభ్యసించియుండును. 'సాహిత్యవిద్యాసూరిణుడుగదా! అపాటి ద్విపదకవిత యల్లలేడా' యను విశ్వాసముచే తిమ్మయ సభాపర్వరచన యాతనిపరము చేసియుండును. 'సంస్కృతములో సాహిత్యము కలదు గదా అపాటి తెనుగుముక్కలు ద్విపదలో వ్రాయలేవా!' అను "ధీమా"తో ఈతడా కార్యమునకు సిద్ధపడియు నుండును. కాని యాతని ప్రయత్నమంత సార్థకము కాలేదు. సంస్కృత సాహిత్యమును దేశిరచనల కుపయోగించు నేర్పు ఇతని కున్నట్లు తోపదు. అసలు, సంస్కృత పాండిత్యబలము వేరు; తెనుగులో జాతీయముగ కవిత చెప్పుట, అందును దేశిరచన సాగించుట వేరు. కేవల పాండిత్యబలము గలిగి, ఛందస్సు మాత్రము నేర్చుకొని, ఆంధ్రకవితాస్వరూపమును, తెనుగు నుడికారము సొంపును కోదనుట్టగా వారిచేతబడిన దేశిరచనలు మత్తగజముల చేతబడిన మల్లెదండవలె నలినలియగును.

అట్లని, ఆంధ్రకవితకు సంస్కృత సాహిత్యమక్కరలేదనియు, సంస్కృతపండితులు తెలుగు కవిత నల్లలేరనియు నైమాటలకు విపరీతార్థకల్పనము మాత్రము చేయకూడదు. "తెనుగులుగకు సంస్కృతము తేనె మెఱుగు"వన్నదానిని తెలియనివాడను గాను. అయితే సంస్కృత సాహిత్యముపస్కారకముగా నున్నంతవరకే దేశికవిత రాణించును గాని, లేకున్నచో ఆ కృతి యాకృతి చెడుటయే గాక అందలి యందమును మందగించును. లేదా, కేవల పాండిత్యబలము గలదుగదా యను నహంభావముతో దేశిరచనల తీరుతెన్నులు తెలియక కేవల ఛందోజ్ఞానముతో వానిని రచింప సాహసించినచో అవ్వానిలు నీరసముగా చప్పగా నుండుననియే నా యభిప్రాయము.

ఇంచుమించు ఈ పరిస్థితియే బాలసరస్వతి రచనకు తటస్థించినది. ద్విపదభారత రచనా గౌరవములో నొకపాలు పంచుకొనజాలి, గంటము పట్టినాడే గాని యాతడాంధ్రకవితాస్వరూపమును గాని, దేశిరచనావైశిష్ట్యమును గాని గుర్తించినట్లు తోపదు. అందును సంస్కృతభూయిష్ఠమగు మార్గకవితగా వెలసిన కవిత్రయభారతమును ద్విపదలోనికి కవతరింపజేయుటలోని ప్రయోజనమునే మనసున నిడుకొన్నట్లగపడదు. అందుచే చిత్తమువచ్చినతీరున నేదో 'గొలికి' పార

# కథావస్తువు పోయింది!

శ్రీ కె. బాబూరావు

కథా వస్తువు పోయింది.
ఎంత ప్రమాదం!

అందబోతోన్న ప్రేయసి పెదాలు ఒక్క-
సారిగా అదృశ్యమయినంత!
వికసించబోతోన్న మల్లె
రాలి పోయినంత!
అర్ధరాత్రి ఓటమితో ఆత్మహత్య
చేసుకున్న యువజీవితమంత!
అగ్నిపర్వతం బ్రద్దలైనంత
అంతేకాదు!
భూమి పరిభ్రమిస్తూనే
గతి తప్పినంత!

నా హృదయం భగ్నమైంది.
మంటలు లేచాయి.
గాలి వేడెక్కింది
రొప్పుతున్నారు జనం
చేతుల్లో కవనాలు
కవనాల్లో కల్లు
మరి ఫైరింజను?
'దేవా!' ఎక్కడో ఓ భక్తురాలు.

ఏమైంది?
అయ్యో! ఏమ్రా! ఏం చేసేవ?
చేయి జారిందే!
ప్రియురాలా!—కాదు
అందమా!—?
మరి?
ఆనందం!
ఎక్కడ?

ప్రేమగాథేమో!
అబ్బాయి అమ్మాయిని కలుసుకున్నాడు
గాలి వీచింది.
సుహాసాలు—
మత్తెక్కింది వాతావరణం.
నక్షత్రాలు నాట్యం చేస్తున్నాయేమిటి?
ఎబ్బే! కాదు. ఇది ఆక్రోశం.
అయ్యో! ఆక్రోశం కాదు చిట్టితండ్రీ
విరహం!—వైరాగ్యం-?

దేని కేది పొత్తు?
ఏమనాలి?
అంతా అయిపోయింది.
అందం భ్రమసింది.
కళ్లు నెత్తికెక్కాయి.
లేకపోతే—
బాబో—ఎలా—
అవును—ఆకలి
తుచ్ఛమైన కోర్కె
పరమేశ్వరుడు సత్యం!

అబ్బ! అలాగేం?
ఏం?
ఈ అమానుషత్వం
ఈ వైషమ్యం
ఈ దోపిడి
ఈ దారిద్ర్యం
ఏమైనా యంటావ్?
'పో రా!'
ఆc!

ప్రేయసి కనుకొలకుల్లో నీళ్ళు చూడు
కాముకి కళ్ళల్లో దైన్యం కన్పడలా!
ఆశల తుంపులు
విసిగిన ప్రాణాలు
వాడిన పూలు
చస్తోన్న బ్రతుకులు
బీటలీసిన పొలాలు
బ్రతికున్న హృదయాలు
విరిగిన పాలు
వీరందరి జీవాలు
కవి కల్పించిన కావ్యకన్య
'ఆ అమ్మాయి! ఎవరు?'
అవునూ —
ఆ కన్నె కళ్ళల్లో బ్రతుకు చూడు
ఆ వెనక దారిద్ర్యం చూడు
జీవనం మన భావం
భావం వెనుక నిశ్చయం.

నిశ్చయంలో ఆశ
ఆశలో నిరాశ
నిరాశ వెనుక వ్యవస్థ
వ్యవస్థ?
వ్యవస్థ వృద్ధు —
అయ్యో! పండిన వృద్ధు కాదు
అదే లోపం -
సాక్షిగా ముసిల్దెంది

జ్ఞానం శూన్యం
భాష అహం
కాయం స్థూలం
ధ్యేయం గతం
కాదు
అవును
అవును
కాదు

పిల్లలు—ఆశాదీపికలు
గతాన్ని ప్రశ్నించారు
నేటిని నిలవేశారు
ముందేదో వుందన్నారు.
అమ్మమ్మ ఏమందంటే
నాలుగు మొట్టింది
కవ్వం తాడుతో
కట్టివేద్దామనుకుంది.
పాపం! అవ్వ ఆశ
(మనకు నిరాశ)
అయితే ఫేలయింది.

సముద్రం ఎందుకో వుప్పొంగింది.
ఆకాశంలో ఇంకో నక్షత్రం
కాంతి సంవత్సరాల్ని అధిగమించింది
మానవుడు వాతావరణాన్ని
ఛేదించాడు.
ఎందుకో ఆకాశంలోకి ప్రయాణం
సమకట్టాడు.
విచిత్రం కాదయ్యా!
నక్షత్రాలకు సమీపంగా -

కంటిపాపలో ఎర్రని జీర
కోపమా!
అనురాగం కదూ!
అనాగరికం ఆరోగ్యమా?
ఆడవాళ్ళ అందం జామపండా!
అందం నాగరికమా!
నాగరికం అందం
బియ్యంలో రాళ్ళు
దేహంలో కాళ్ళు
గుండెల్లో రైళ్ళు -
కుళ్ళింది ప్రపంచం
మళ్ళింది వెనక్కు—
వెళ్ళింది త్రిశంకు -

# కథావస్తువు పోయింది!

ఆశల భూతం
అపజయాల రాకాసి
రాకాసి - భూతాల
రణరంగం
పీనుగుల పెంట.
బుద్ధి రాలేదూ!
నే చెప్తే విన్నా!
ఏమన్నావ్!
యుద్ధ నినాదం
శాంతి పునాది
హు! అవునా?
చెప్తా విను.
    శాంతే పూస్తుంది
    పూవులు అందం
    అందం ఆనందం
    ఆనందం అర్ణవం
    క్రొత్త జీవనం
నినాద ఫలం కాదు
శాంతి ఫలం మాత్రం
కాదిది అసత్యం
నిజమైన నిజం.
    అబద్ధాల పుట్టలో
    నిజాల అనుమానం
    ఇది అనాదిదే
గెలీలియో చచ్చిపోయాడు
    ప్రేమకోసం పాపం-!
    బ్రతుకోసం అయ్యో-!
కాదు బాబూ!
నిజంకోసం
నిజమైన నిజం
నిజంగా చెప్పాడు.
    'వురే! వెధావాయ్
    అబద్ధాలకోరివి కావూ!
    మరీ మాటల గారడీ!'
అర్థం కాలా—!
నేను ఆదికవిని
సుకవిని
కుకవిని
భావకవిని
ఇంకో— ఇంకో కవిని
కాదు.
నేను చేసే—
ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్థపౌరుణ్ని
అందుకే ఇదంతా నాది
ఈ జీవితం నాది
ఈ వ్యవస్థ నాది
ఈ దుర్మార్గం నాది
ఈ ఇనుప తెర నాది
నా వెనుక
లో లోపల
నాలో
నామదిలో
నా హృదిలో
నా శరీరంలో
ఏముంటే అదే ఇది
నీకేం! ఎన్నయినా చెప్తావు -
ఒడ్డున కూర్చున్నావు.
అనుక్షణం నాలో ప్రవహించే
జీవనగీతం - నా వాణి
ప్రకృతికి పరిసరాలకి
నాకేదో సంబంధం
సాహిత్యానికి జీవనానికి
వున్నట్టే వుందని
చెబ్తూంటుంది - నారాణి
మేల్కొలుపుతూంటుంది.

నా రాణి నయనాల్లో
నా ప్రతిబింబం చూస్తే
'ఇన్నినాళ్ళ నాలోని ఆవేశాలు
మాక్కు కావాలనే భావాలు
మంటలోన్న అగ్నిజ్వాలలు'
చెప్పకుండ వుండలేను
(మనది రహస్యసమావేశం కాదుసుమా!)
ఈ స్వప్నం జయమవుతుంది.
కళ్ళల్లో కల అలలు
ఎగిరెగిరి పడిరాయి.
నా జీవన భానుడు
వుదయించెను
తెచ్చితిచె అందుకో
కలల మల్లెల మాల
రాబోయే రోజుల
అందాల కోవెల —
చీకటిని తోలే కాపు
నక్షత్రాల మధ్య
ఆకాశంలో
(శూన్యం కాదు-మనలో ఎంతవిశాలం)
అంతర్లోకాల
అంతర్గత భావాల
అంతులేని అలల
అంబరమంతా తనది
అందమంతా తనది
ఇదే మనందరి అవధి.
కాదంటం నీ వాదం
సారంలో చవిటిభూమి
సారం చేసే అగామి
నేటి మన రైతు
నాగేటి చాటున
నాగుల కాట్లల్లో
విషం! విషం
రైతుకు పాపం -
చెమటలు
నురగలు
మునకలు
క్షణంలో శాస్త్రకారుడు
ఏమయ్యా! ఏమంటావ్!
మాత్రం నిమిత్తం లేకుండా
చింతనిక్కలు రాల్చాడు.
తాటాకిళ్ళు
వీధి బళ్ళు
నీరెల బీళ్ళు
పోయి
పచ్చని పైర్లు
కారు పైర్లు
పెంకుటిళ్ళు
వచ్చాయంటే
ఏమంటున్నావ్!
విధా!

వీధిలో కద్దా
ఛీ! అబ్బబ్బ!
ఏమి టీ దోమలు!
ఇక్కడుండే దెలా?
ఇదంతా ఏమిటి నాలో?
ఎక్కడా మొదలు?
కథా వస్తువుకదూ పోయింది?
అవును—!
మరి
మరోటి వచ్చిందే
అదే చిత్రం -
విచిత్రం
పాత పునాదిపై
కొత్త స్వప్నాల భవనం
వింత కాంతితో
ఉదయిస్తుంది.

# కథకళి సాహిత్యము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

[గతసంచిక తరువాయి]

కథకళి సాహిత్యములో నలచరిత్ర నాటకమొకటి. దీని రచయిత 'ఉణ్ణాయివారియర్'. ఔచిత్యము జీవాతువుగా గణించెప్పిన ప్రముఖ కవులలో నితఁ డొక్కఁడు. కథాఘటనము, పాత్రసృష్టి మొదలగు సన్నివేశముల నీత డెంతయో చక్కఁగా పోషించెను. ఈ యుగములలో నితనిబోలు సాహిత్యకారులు చాల కొద్ది. ఆట్టకథాకారులలో నిట్టివారు లేరనే చెప్పవచ్చు.

ఉణ్ణాయివారియర్ కాలమును గూర్చి విమర్శకులలో నే పలుచర్చ లున్నవి. 'తుల్లల్' వ్రాసిన కుంజయన్ నంబియారుతోను, నితనికిని గలిసి, కొంతకాలము తిరువనంతపురమున గడిపిరని చెప్పుదురు. కేరళ రాజులలో ఘూతిల వీరమార్తాండవర్మ మహాప్రసిద్ధుఁడు. అతని కాలమునందే వారియర్ తిరువనంతపురమునకు వచ్చెనందురు. అతఁడు చక్కని రాజాదరణను బొందినది 'కార్తిక తిరునాళ్ రామవర్మ' రాజు కాలమున. 'వారియర్' నాటకములు వ్రాయుటకు బూనియున్నచో, సంస్కృత నాటకకర్తల సందుకొనియుండునని వారందురు. 'ఆట్టకథ'లో నీతఁడు ప్రవేశపెట్టిన నాటకలక్షణము లట్టివి! ఈతని పాత్ర లెంతయో స్వాభావికముగ ప్రవర్తించును. శబ్దార్థములతో భావకులను మెప్పించుటకంటెను జీవితరంగములు, జీవితానుభవములు వివరించి హృదయమును గరగించుటయే యీతనికి ప్రీతి. మొదటిరాత్రి కథలో సరస్వతితో గవి యిట్లనిపించినాఁడు:—

[13]కవక్కు మర్థవుమ్, బుధకణక్కప్పదవిరయుం
అవర్గళిం, యమకవు మనుప్రాస ఉపమాది
ఇణక్కం కలర్న్న, రమ్యం నల్ సారస్వతం"

కవి, ఈ మాట లెందు కనిపించవలసివచ్చెనో కాని యాతని రచనలో వీని ప్రభావము చాల తక్కువ. కవికన్న వీనికతీతమైన యౌచిత్యమందును తదనుగతమైన రసమందును కథావస్తువుగ 'నలచరిత్ర' నెన్నుకొనుటలోనే మన మాతని దృష్టిని కొంత గమనింపవచ్చును. జీవితములో దురూహములైన యెన్ని భావములనో యతఁడు వివరించును; కరుణరసమును జిత్రించుటకు, ఇట్టి కథ మఱియొకటి దొరకదు; కాని యంత మాత్రమే 'వారియర్' వ్యక్తిత్వము గాదు. ఈ కథను వ్రాసిన కవు లెందరో యున్నారు. మొదట వ్యాసభగవానుఁడు దీనిని వివరించెను. హర్షు డీ కథను మహాకావ్యముగ సృష్టించినాఁడు. మలయాళమునందే 'నైషధ చంపు' వొకటున్నది. వ్యాసులకథ యెట్టున్నను తక్కినవారెవ్వరును 'వారియర్' వంటి హృదయ పరిపాకమున్నవారుగారు. సుకుమార కోమలమైన యీ కథను వ్యాసభగవానుఁడు యుధిష్ఠిరునిమిత్త మధ్యాయములలో వర్ణించినాఁడు. హర్షుఁడు దీని నిరువదిరెండు సర్గలలో ప్రపంచించెను. ఈ కథ నింత విస్తరించుటలోనే దాని భావదార్ఢ్యము పలుకబడిన దనవచ్చును. హర్షుని రచనము జదివినప్పుడు పాండిత్యమల్లుడైన యొక విద్వాంసుని శబ్దార్థముల యింద్రజాలమే మనకు గనపడును. కథ యాతని వ్యుత్పత్తికి నొక యంగము మాత్రమే. మలయాళ చంపూరచయిత యీ కథలో శృంగారమును నింపివేసినాఁడు.

మూలగ్రంథములో ముఖ్యాంశములైన కథాగాత్రమును గ్రహించి, 'వారియరు' దానిని కృతి కోమలమైన యొక కళాశిల్పముగా మలచెను. కథ నెంతయో సంక్షేపించినాఁడు. చెప్పవలసిన భావములను ఔచిత్యమును విడువక సూటిగా బలుకును. అతని రచనలో నప్రసక్తమొక విషయము దొరకదు. ఔచిత్యము లేని యొక సన్నివేశము, సంభాషణము లేదు. ఈ ఆట్టకథను చదువుచున్నప్పుడు మన తిక్కనార్యుని కళాశిల్పలేశమును బంటికొని కేరళమున నెవఁడో పుట్టినట్లు మనము భ్రమింతుము. బ్రహ్మాండమైన కథనంతయు నాతఁడు నాల్గు ఖండములలో ముగించినాఁడు. దీనితో గథ కెంతయో గాంభీర్య

---

13 చక్కని యర్థము, బుధులు గమనించు సద్గుణశబ్దసంపత్తియు, శబ్దార్థాలంకారముల యందము గలిగినదే చక్కని సారస్వతము.

పుట్టెను. కాని యవి రాజుల మనోవినోదముకొరకు మాత్రమే వ్రాసినవి. కష్టములు దీరినవెంటనే—యథా ప్రకారము—రాజులు భోగలాలసులైనారు. రాజప్రాసాదములయందే 'కథకళి' సంరంభములు జరిగెడివి. వారి చిత్తవృత్తుల ననుసరించుటయే కవులకు ధ్యేయము. జనరంజకమునకై పాటుపడిన స్వతంత్రవ్యక్తియొక్కడుగూడ నప్పుడు పుట్టలేదు.

స్వాతి తిరునాళ్ కాలము మలయాళ సాహిత్యమునకు వసంతము; అతడు గొప్ప వాగ్గేయకారుడు; గీర్వాణకవి; భాషాపోషకుడు. అతని సభలో నెందరో విద్వాంసులుండిరి. వారిలో ప్రసిద్ధులిద్దరు. మొదటివాడు యిరయిమ్మన్ తంపి; కోయిత్తంబురాన్ రెండవవాడు. ఇద్దరుగూడ నాట్టకథలను వ్రాసిరి.

ఇరయిమ్మన్ తంపి చక్కని భావనాశక్తి గలవాడు, అందమును జూచును. లాలసతతో జూచును. అతడు వ్రాసిన పాటలకు లెక్కలేదు. వానికన్న ప్రధానముగ సామాన్యముగాను కొన్ని శృంగార పదములు కూడ 'నిరయిమ్మన్' వ్రాసినాడు. మన 'క్షేత్రయ్య'లోని గుణము వానిలో నెక్కువ. అతని సుకుమారపద రచనలలో నేనో యొక స్వప్నలోకమును సృష్టించినదే కాని వాస్తవజగత్తునకు దిగిరాదు.

నాటి తిరువనంతపురము నాటక రంగస్థలోకము. అక్కడ ప్రదర్శింపబడని లలితకళ లేదు. సంగీతము నాటకములు నృత్యములు విస్తృతిలో చాలరేగినవి. భారతదేశ విద్వాంసుల కన్నుల నన్నిటి నది యానాడాకర్షించినది. 'కీచకవధ'లో 'ఇరయిమ్మన్‌తంపి' విరాటరాజధాని యందలి లావణ్యాంగనలను వర్ణించినాడు. ఆ వర్ణన నాటి తిరువనంతపురమునకు ప్రతిచ్ఛాయయే. అది యిది:

నాళీకలోచన మారే; 21 నామ్ ప్రిసఖ కళ్ఞు 22
విపిన మోదా
కేళిక ళాడి మురారాగమాలక 23 పాడి కరం 24 కొట్టి
చ్చాలవేచాడి, తిరుముం 25 నిల తాళత్తోడు 26
మేళత్తోడు మేళిచ్చను
కాలతోడు, మాళిక లేనటనం చెయ్యేణం 27
నల్లకళి జగత్తిల్ వళర్త్తిడేణం 28
హృద్యతర మెన్ను పాడియు మవా నురాగ
మేతుంకులైయ్యారుతే 29
విద్యుల్లతాంగీ! చొల్లితుగ 30 గద్యంగళ్ భంగి
కలర్న్న 31 నీ
సద్యోమతంగి! ఘణంతిక తద్ధిమి తత్తయ్య
తిత్తోతిత్తో మెన్ను మర్దళం నాదయ చంద్రశేఖే! నల్ల
పద్యంగళ్ చొల్లు 32 నీ రత్నశేఖే!
పాణివళికళ్ 33 కిలుక్కిడవే పాదం చేణుత్త 34
కొంకకులుక్కిడవే
వేణియాజిక్షుం 35 సఖి! హేకల్యాణి! ఘనవేణి శుక
వాణి! సుశ్రోణి! నామాలిక్కకుక్కుమ్మ 36 అడిచ్చి
కేణం నన్నాయ్
దీక్షణు కుమ్మియడిచ్చి డేణం' 37

'తంపి' వ్రాసినవి మూడాట్టకథలు. 'కీచకవధ' మొదటిది. తక్కినవి ఉత్తరాస్వయంవరం, దక్షయాగములు. మూడును విద్వాంసు లాదరించినవే. 'ఉణ్ణాయి వారియరు' కున్న భావగాంభీర్య మీతనికి లేదు. లాలిత్య మీతని సొమ్ము, సుకుమారమైన భావములనే యేరి వాడుకొనును. సుశ్లిష్ట యాదవము దెమ్మని చెప్పను. అప్పటిమాలిని స్థితిని కవి యిట్లు వర్ణించినాడు.

"క్షోణీంద్రపత్నియాడే, 38 వాణీం సశిమ్య పున
రేణవిలోచన నకా 39 క్షే మిడి, యినకలక్షే 40
విరళయిట్టిల్ నుజ్జే 41, పలతెవ్వ 42 మతిను 43 పున
44 రలోడు పరఞ్ఞళవు 45 పురుష మొజి 46 కేట్టు 47
నక్షే—
దాస్యం సమస్తజనహాస్యం నినమ్మ 48 నిజమాస్యం
నమిమ్మ పునరేషా. శ్రమసలిలబహుళాంతర
నయనజలమతి లుపెనమజా 49 కి బత! మలినతర వేషా.
గాత్రం విరచ్చి 50 తతిమాత్రం కరస్త్రిలనపాత్రం

---

21 కమలనేత్రీరా! 22 సిగ్గువలి నావాకళిలు చూపించి. 23 గానమువచ్చి 24 చేతులుతట్టి, చక్కగ పాడి 25 మహారాజునుండు 26 తాళ మేళములతో కలిసి 27 నటించవలె 28 వ్యాపింప జేయవలెను. 29 తక్కువ కారాదు. 30 చెప్పిరేయుము 31 అందము జొనిపి 32 చెప్పుము. 33 చేతుల గాజులు ధ్వనింపజేయుము. 34 విస్తృతమైయొదను కుదికింపుము. 35 వెంద్రుకలను చెవర్చుము 36 తాళముతట్టి యాడవలె. 37 అందముగ వంగి యాడవలె.

38. యొక్క; 39 వగలాడు. 40 కనుమూపులు కలగను. 41 ముడిగను. 42 చాలసారులు. 43 దానిని మణల 44 ఆమెతో 45 చెప్పి, 46 పలుకు. 47 వినినట కేవది; 48. తలచి 49 వంచి. 50 ముడిగ.

51స్విద్యతి నిన్యా. పరిభోక్తుం52వశేన్యా పథి కిమపి కినిన్యా; హారిణిరివ వరసహిత దరియిలిహాపోకు మొరు

54హారిణీయుడౌ వివశతికలయ్యా —

నిశ్వస్య దీర్ఘం, మన విశ్వస్య నాథమపి, విశ్వస్య చేతసి సుజాతా, స్మృతిహితచేతా, స్మృతిపులికజాతా, మూర్తిమతీ మణినికేతన మతిలతేవ చెన్న 55 స్థితి పరితాప పరిభూతా.

అప్పటి ద్రౌపది చిత్తవృత్తికిని, యీ దండకములోని పదముల ధ్వన్యంతికను సంబంధమేలేదు. శైలిని పోషించుటయందే చూపుంచిన రచయిత - యౌచిత్యమునకు దిలాంజలి యొసగినారు. ఒకానొక భావమును విస్తరించి చెప్పుటయు, నాంగికములైన వికారములకు ప్రాధాన్య మొసగుటయు నాటక నాయికుని గుణము. అది అతనియందులో నున్నది. సంస్కృత సాహిత్య చరమ కాలమందు దీర్ఘ రచనలు చేసినవారందరో యున్నారు. భావతపస్విత కలవారు కృష్ణనివారు మాత్రమే యీ యుత్ప్రేక్షలములకు దిగుదురు. కేరళీయులు మాత్రమిది కూడ ఘనమైన రచనయే యందురు. మన తెలుగులో నిట్టి కవులకు దారిద్ర్యమే లేదుగదా!

కోయిత్తంబురాన్ స్వాతీ తిరునాళ్ నకు బాల్యసఖుడు; సతీర్థ్యుడుగూడ. పాండిత్య మల్లుడే గాక మల్లవిద్యలోగూడ కృతపరిశ్రముడట! కాని యాతడు బ్రతికినది కొద్దికాలమే. ముప్పదినాల్గవ యేటనే మరణించినాడు. అంతటి చిరువయసులోనే గీర్వాణసాహిత్యమునందును, సంగీతమందును గొప్ప కృషి యొనర్చినాడు. 'ఇరయిమ్మన్ తంబి' కన్న నీతని శైలి కొంత గంభీరము. భావములు గూడ లోతు గలవి. అతడింకను గొంతకాలము బ్రతికియున్నచో గొప్పరచనలు బయలుదేరెడివి. కాని యంతలోనే కాలము కబళించి వేసినది. 'రావణ విజయము' కథకళి యాతని ముఖ్యమైన కృతి. ఈ కృతిలో నాతడు పాత్రవ్యక్తులకంటె గొప్ప చాతుర్యమును గనుపరచినాడు. 'ఉణ్ణాయివారియరు'తో సమానుడనిపించికొన్నాడు.

రామాయణమునందు వాల్మీకి రావణాసురు నెంతో యుదాత్తముగ చిత్రించెను. ప్రతినాయకుని వాల్మీకివలె సానుభూతితో జూచినవారరుదు. తరువాతి నాటకకర్తలు రావణ దుర్యోధనులను పాడు చేసిరి. వేణీ సంహారకర్త దుర్యోధనునకు గల్పించిన స్థితి శోచనీయమైనది. 'కోయిత్తంబురాన్' రావణు నొక యాదర్శపురుషుడుగ గాకున్నను మనుష్యస్వభావము నిండిన ప్రాణిగ సృష్టించెను. ప్రతినాయకుడుగ ప్రసిద్ధుడైన రావణున కొక నాయకపద మొసగుట సామాన్యమైన సాహసముగాదు. రంభాప్రవేశ రంగమున నవతరించిన రావణు డాట్టకథలో నొక రసికుడైన శృంగారపురుషుడు. రావణునివలె బలాత్కరించి యనుభవించిన రసికులు పురాణములలో నెందరో యున్నారు. రావణుడును వారివంటివాడే. పైగా రంభ యభిసారిక. దేవతలకు గూడ నప్రాప్యమైన రావణుని పరాక్రమసిద్ధిని కైలాసము నెత్తుట మొదలగు వానిమూలమున గవి ప్రశంసనీయముగ వర్ణించెను. వానిలోని శివభక్తి పారమ్యమునుగూడ నిండుగ జూపించినాడు. నాయకునకు గావలసిన గుణములు రావణుని యందున్నవని వర్ణించుచు బోయినాడు. వాని కపటరక్షకులుగ పురాణములందు వర్ణింపబడిన యంశములలో గవి నిమ్మళముగ దాటిపోయినాడు.

రావణవిజయమున నున్న దెక్కువ సంస్కృతకవిత్వమే. చిన్ననాటనుండియు నాతని కా భాషపై రక్తియు, శక్తియు. పైగా, రాజసన్నిధానమునకు వచ్చు పండితుల నిరంతర సంపర్కముతో నా ప్రౌఢిమ యింకను సానలుదీరినది. రావణ విజయము ప్రదర్శింపబడినదియు రాజప్రాసాదమందలి విద్వాంసుల యెదుటనే. కనుక నాతడు రచనమున విద్వదామోదమునే యెక్కువ పాటించెను. రంభ నలకూబరునికొఱకై పోవుచున్నది. "అతి మృదు పదన్యాసై ర్యాతీ" అని యారంభించిన యీ కవిత్వమున మంత్రము సంస్కృతమయముగనే సాగినది. ఆ సంస్కృత మెంతో లలితమైయున్నది. హఠాత్తుగ రావణుడు రంగమున నవతరించును. చకితహృదయయైన రంభ సంభ్రమముతో "తొడరుదే" యని చేతులను మొగిడ్చి యాచింప నారంభించినది. రావణుడు రంభమాటలు వినలేదు. వాడపచరితము వేయొనర్చెను. కాని—కవి యొనర్చిన చిత్రమేమనగా—నీ సమయమున రావణు డొనర్చిన యనౌచిత్యము మన హృదయములకు దోపకయే పోవునట్లు చేయుట. రంభ

---

51 స్వేదించు. 52 అటనుండి. 53 అల్లనసహించెను. 54 నిలచెను; సింహమున్న గుహలోనికి బోవుచున్న, హరిణియొక్క మనస్థితిగలిగెను. 55 పోయెను.

రావణుని ప్రార్థించు సందర్భములో కరుణరసమున కంటెను మాదకమైన శృంగారమునకే కవి యెక్కువ ప్రాధాన్య మొసగెను. రంభ పలుక మిది—

"ఆనీలనీరద దరాంతరితేందు బింబ
లీలానుకారి వదనం నిజ మాదధానా,
సంజాత వేపథుమతీ, శిరసా ప్రణమ్య
మందం జగాద ముకుళీకృతపాణిరేషా"

ఆ నిలుచుట ఆ పలుకుట—రావణునకు దయను గాక కామోద్రేకమునే కలిగించినది. వాడు—

"56కాంచుం మొజి నాళి మియు న్నిహ
కించన నీ వదనం తాళి
పుంసితి కాంసియి! సమున్నపయం
వందనకెంతా తీసున్నింతే"

అని యామె వదులుచున్నాడు. రంభయెంత నిషేధించినను జరుగవలసినపని జరిగియే పోయినది. ఆ సంగమును కోయిత్తంబురాన్ మాత్యమువంటి యీ శ్లోకముతో ముగించెను.

"హా హా స్పృశేతి ముహు రప్యనయా చితోఽపి
రాజీవ కోశక కరాంజలి ముద్రయైవ,
హా! హా! త్వదప్సరసి; కామసమాతురాత్మా
చిక్రీడ తన్నిశి నిశాచర కుంజరోఽయం."

తామరమొగ్గవంటి హస్తముద్రతో 'నను తాకవల దని నిషేధించుచున్న రంభపై రావణుడు బలవంతముగ నేనుగువలె బడినాడు. అనర్థమగుంటె—మనసి కతయే యీ సందర్భమున కవిదృష్టి యెక్కువగా గలచినది కాబోలు!

సంస్కృతమున నేగాక — మలయాళరచనయందును తంబురాన్ సమర్థుడు, నీలవస్త్రాచ్ఛాదితయై పోవుచున్న రంభను గన్నప్పుడు రావణునకు దోచిన భావము లీక్రిందివి.

"నీలనిచోళేన నిహ్నుత మెంగిలుం
57చాలనే కాణున్ను; చారు తరమంగం
కాళింది వారియిల్ 58 గాహనం చెయ్యుగ
కాంచన శిలాక లత్ కాంతియుమ పోలవే
నారీకులాభరణ హీరమణి యాయునీ
ఆరోమలే సుదతీ! ఆర్ రమయో! రతియో!
ప్రకృతిజితపల్లవం. పీయూష పూరితం
సుక మొజి, పొజి, స్మితం, సుస్మిత శ్రీపదం"

పై మలయాళ రచనకూడ ప్రౌఢ మనోహరమైయున్నది. తెనుగు కవులవలెనే మలయాళ కవులును—సంస్కృతమును విచ్చలవిడిగ వాడుదురు అందునను—మధ్యయుగమున నా యభ్యాసము మిక్కుటమైనది. మణిప్రవాళ కవుల పలుకుబడియది. కోయిత్తంబురాన్ ఆట్ట కథలే గాక 'తుళ్ళల్' కథలనుగూడ కొన్నిటిని వ్రాసెను. అతని 'సంతానగోపాలము' చాల ప్రసిద్ధమైనది. ఇందులో 'తంబురాన్' విభిన్నమైన శైలి ననుసరించెను. ఈశైలి సామాన్యులకు గొంత యందుబాటులో నుండును.

ఆ తరువాత కేరళమున నాంగ్లవిద్యాప్రభావ మెక్కువైనది. గద్యరచనకు గౌరవము హెచ్చినది. నాటకరచనము గూడ నారంభమైనది. 'కిళిప్పాట్టు' 'వంజిపాట్టు' మొదలైన యేవో కొన్ని రచనలు తప్ప కథకళి సాహిత్యము నిలచిపోయినదనియే చెప్పవచ్చును. కాని నేటికిగూడ నాజనులకా సాహిత్యముపై గౌరవము తగ్గలేదు. వాని జూచుటయందలి యభిలాష పోలేదు.

---

56. జంకుచు మాటాడుచు, తలనువంచి, పూలవంటి చిరునవ్వులతో నన్నెందుకు వంచించుచున్నావు?

57. నీలనిచోళ నిహ్నుతమైనను నీయంగము కాళిందీ పూరమున గాహన మొనర్చిన కాంచన శిలాకాంతివలె చారుతరమున నున్నది. నాగకులాభరణ హీరమైన నీ వెవ్వరి సుతవు? రమవా! రతివా! చిలుకపలుకులు బలుకుచు, జితపల్లవమై, సుస్మిత శ్రీపదమైన నీ పెదవి యెంతబాగున్నది!!

# విప్రయోగి

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

నా కనుల కెన్ని యెన్ని సంధాన పడియె
నన్నియును వన్య వైశ్వానరాభ రుచులు
చటుల వర్షా నభోన్మత్త జలద మత్త
ఒక్కొ బర్హాభ్ర మింద్ర చాపంబె లేదు!

ప్రాగ్దిశోదిత ముగ్ధ చంద్ర ప్రరోహ
మెదిగి గగనాన మల్లికా వృష్టిగురిసె;
మల్లెవానన గ్రీష్మ సంబంధి యొకడు
సాగె తాపంబుగొనుచు జంఝానిలుండు.

ఊహ యొకండు సాగి ప్రణయోజ్జ్వల భావము నాటికొన్న చా
లై హరిదంతసీమల వెలార్చిన కార్తిక చంద్రికా వధు
వ్యూహము వీడిపోయి హిమపుంజ సమాకృతి పేరి యోదా ప్ర
త్యూహ నిరుద్ధమై విరహ దోహద శీలము భావ మేచెనుగ్.

ఉభయ సంధ్యల కంఠ్ఠలో నూహ చేసి
చేసి సుడిగొన్న జారె విశీర్ణ జీవ
నాశ లల్లిన కన్నిటి హారయష్టి
గ్రుడ్డి తనమున తెలిమంచు గుడ్డపోలె.

ఆకురాలిన చెట్లు సన్న్యాసులట్లు
నిల్చిన విదేమి వైరాగ్య నిష్ఠ! - నిజమొ?
గుండె లోతుల కత్తితో గొట్టి చూడు
పచ్చి వలపులు నిలువెల్ల విచ్చి చూపు!

ఈ మాధుర్యము దోచుకొందుమని తా మెన్నెన్ని యూహాల్ మదిన్
వ్యామోహమ్ములు పెల్లురేగినవిలే! హైమాద్రి పర్యంత ము
ర్వీ మాలాకృతియూచు సర్వ జగదావిష్టోత్సవన్మధు రే
ఖా మోద ప్రకరమ్ము లాక్రమిత శంకా దిఙ్నభస్సీమముల్.

# నన్నెచోడుని వర్ణనలలో వన్నెలు చిన్నెలు

శ్రీమతి వి. రాజేశ్వరి

ఆంధ్రకవిచరిత్రలో సామ్రాజ్యాధిపతులకు కొదువ లేదు. కవితాసార్వభౌములకును లోపములేదు. కాని సాధారణముగా రాజై కవియగుట అరుదు. రాజును కవియునై సామాన్యుల జీవిత తత్త్వమును సమగ్రముగ నెరుగుట ఇంకను అరుదు. ఆంధ్ర సారస్వతమునందు అట్టి శ్రేణికి చెందఁగలిగిన కృష్ణరాయ రఘునాథ రాయాదుల నేకొలదిమందినో వ్రేళ్ళపై లెక్కపెట్టవచ్చు. వారిలో ముఖ్యుడుగా నెన్నదగినవాడు నన్నెచోడుడు. ఈ కవిరాజశిఖామణి గ్రంథమును సావకాశముగ చూచినచో ఆ వర్ణనలలో శాస్త్రవిద్యా వైదగ్ధ్యమే గాక లోకానుభవమును పుష్కలముగ గోచరించును. ఈతడు కేవలము సంప్రదాయసిద్ధములగు నగరార్ణవశైలాదుల సమాజస్థితి నెంత సంప్రదాయానుసారముగ వర్ణించెనో అనుభవైకవేద్యములగు సామాన్య మానవజీవితపు లోతులను అంత నిశితముగ పరికించినాడు.

కవిరాజశిఖామణి అగుటచే నాల్గు విద్యల నారితేరి రాజ్యతంత్రమంత్రాంగముల నెరిగిన ప్రౌఢు డతనికి జలక్రీడ ఎంతసుగమమో రణక్రీడ అంత యలవడినవిద్య. ఋష్యాశ్రమ వాతావరణమునందు మునుల తపశ్చర్యాగతుల నెంత సాత్త్విక కాంతిప్రసారముగ వర్ణించినాడో, విటవిటీవిదూషక కామాదికాముకజనుల విలాసములను కామశాస్త్ర కళాశాస్త్రముల వెల్లువలలో అంత నేర్పుగ నడపగలిగినాడు. రాజై, కవిరాజై, రసరాజై ముక్తిసామ్రాజ్యాభిరతుడై హరునిలీలను స్థలపురాణము వలె వర్ణించి తృప్తిపడినాక అనిమిషుల మనస్తత్త్వము, కౌమారావస్థలో నున్న దంపతుల సంసారగోష్ఠి మొదలుకొని పేలాలు వేచుపద్ధతినుంచి వెన్నపూస మెదిపి కాటుక దిద్దుకొను సామాన్యకుటుంబిని దినచర్య వరకు వర్ణించి కుమారసంభవమను నాదికావ్యకథను రసవత్తరముగు కావ్యముగ సంతరించినాడు. అందు కవి ప్రదర్శించిన కావ్యశిల్పమెంతయేని కలదు. అదంతయు అటుంచి, ఒక్క వర్ణనల విషయమును కనుక ప్రత్యేకముగ చూచినచో అందు కవి ప్రదర్శించిన వర్ణనా వైవిధ్య మెంతయేని గోచరించును. ఒకప్పుడు రసవత్తరముగు అపూర్వభావము వ్యక్తీకరింపబడె, మరియొకప్పుడు అతి ప్రసిద్ధములగు సామాన్యవస్తువులే నిత్యనూతనముగ భాసించును. ఒకచో ప్రాచీనకవినిబద్ధప్రౌఢభావ కల్పనలు చమత్కారావహములగుచుండ, వేరొకచో కావ్యమందలి ప్రసిద్ధములగు సన్నివేశకల్పన లెన్నియో కవి స్వకీయప్రతిభలో క్రొత్తరూపు నంది వింత వెలుగును పొందినవి. పయిరీతుల వర్ణనలలో స్థాలీపులాక న్యాయముగ కొన్నిటిని చెప్పుట ఈ వ్యాసోద్దేశము.

## భావ వ్యక్తీకరణములు

పార్వతి తపశ్చర్యలో గ్రీష్మఋతువు రాగా ఆమె పంచాగ్నిమధ్యమునందు తపము గావించును. ఆ విషయమును, తదతిశయమును చెప్పుటకు కవి గ్రీష్మఋతువుయొక్క ఉగ్రతను సుందరముగా వర్ణించును. "విలయానిలమువలె నెండకాయు గాన సంక్రుద్ధ కాలాగ్నిరుద్రరౌద్రోచ్ఛ్వాస సమేతమో" అనునట్లున్న దని చెప్పుచు నిట్లు వర్ణించినాడు.

"ఉరునిదాఘాతపాహతి గజుల తలలు
వ్రస్సి లోపలి ముత్యముల్ వరుస వీసి
మంగలములోని ప్రేలలభంగిఁ దూలి
ప్రేలిపడెఁ గాచె కష్టంపు విసువరించి"

పార్వతి తపముచేయు వనమందున్న ఏనుగుల యొక్క కుంభస్థలములు గ్రీష్మాతపమునకు విచ్చిపోగ, అందు వరుసలలో నున్న ముత్యములు ప్రేలి పేలాల వలె తూలి క్రిందపడినవట. ఆ వేడికి ఏనుగు కుంభస్థలములే విచ్చిపోగ ఇక మిగిలిన జీవరాసుల గతి చెప్ప నక్కరలేదనుట సామాన్యార్థము. ఈ పద్యమునందు ప్రేలు-తూలు శబ్దములు సాభిప్రాయములు.

గ్రీష్మాతపమునకు ఏనుగు కుంభస్థలములు విచ్చిపోయినవి. అంతతో ఆ వేడి ప్రభావము ఆగిపోలేదు. ఇంకను లోనుండి అమితముగ వేడి పెల్లుబుకుచునే యున్నది. కావుననే అందలి ముత్యములు పేలాల వలె ప్రేలి, తూలి క్రిందపడినవి. అట్లుకాక ఆ వేడి ఏనుగు కుంభస్థలమును పగులకొట్టుటతో నాగిపోయినచో

విచ్చిన స్థలమునుండి ముత్యములకు జారుపాటేకాని తూలుపాటునవసరములేదు. ఆభావము వ్యక్తము చేయుటకే కవి ప్రత్యేకముగ తూలు శబ్దమును వేసికొనినాడు. అదే శబ్దసార్థక్యము.

అంతియే కాదు, పయి ఉపమానముచే కవి యింకొక వాంఛితార్థమునుకూడ సాధింపకల్గినాడు. అట్లు గ్రీష్మాతపమునకు ఏనుగు కుంభస్థలములు విచ్చిపోగా వానియందలి ముత్యము లన్నియు నేలపాలై పోయినవి. ఆ హిమవన్నగవనాంతమం దెక్కడజూచినను ముత్యములే. అనగా ఆ ప్రదేశ మంతయు ముక్తామయమైనదనుట. అది యుగుట విలువతగ్గుటకు చిహ్నము. ముత్యము లన్నియు అమితముగా క్రిందపడి పొరలాడ అవి వెలగింజలకంటెను చవుకై పోయినవి. కావుననే ముత్యములు వెలాలైనవనుట. అది వాచ్యార్థము. ఇక అతఃపూర్వమే పార్వతి జన్మకు కారణభూతమను హిమవన్నగముయొక్క విభూతి అతిశయము ముక్తాసమూహవర్ణనచే ధ్వనితము.

## హేమంత ఋతువర్ణనము

హేమంతఋతువున పార్వతి ఋతుధర్మమునకు వ్యతిరేకముగ ఉదకవాసతత్పరయై తపము సాగించుచున్నది. ఆమె శరీరమంతయు నీటిలో మునిగిపోయి ఒక్క ముఖము మాత్రమే పైకి తేలియున్నది. నిర్మలమగు ప్రదేశమునందు నిశ్చలమగు జలములో పార్వతి ధ్యానమగ్నమైయున్న సమయమది. ఆ ప్రశాంత వాతావరణమున తటాకమధ్యస్థ పార్వతిముఖము కవికి సాక్షాత్కరించిన విధమిది.

"తనరు హేమంత మునను పద్మంబు లడంగి
పోయెం బోయిన గొలనొక్క పువ్వుతనకు
విత్తుగా దాచికొనియున్న విధముపోలె
శైలసుతముఖ ముదకవాసమున నొప్పె"

మంచుతాకిడికి పద్మసంపద హతము కాగా ఆసరోవరలక్ష్మి పార్వతి ముఖకమలమును విత్తుగా దాచికొన్నదని భావము. ఈ సందర్భమున కాళిదాసు:

"ముఖేన సా పద్మసుగంధినా నిశి
ప్రవేపమానాధర పత్రశోభినా,
తుషారవృష్టి క్షతపద్మ సంపదాం
సరోజసంధాన మివాకరో దపాం"

అని హిమబిందు పాతముచేత పద్మసంపద నశించిపోగా శోభతగ్గిన ఆ కొలనికి పార్వతిముఖము పద్మసంధానము కలిగించుచున్నదను భావమును వ్యక్తీకరించినాడు. నన్నెచోడుడు ఆ సందర్భమున మంచుపడి పద్మములన్నియు నశింగిపోవునపుడు పరేంగితయగు వాసరోవరలక్ష్మి తన సంతతి నిలువదేమో యను భయముచేత పార్వతి ముఖకమలమును విత్తునకై దాచికొనినట్లున్నదని చెప్పి, విషయమును రసవత్తరము గావించినాడు.

సంస్కృతాంధ్ర గ్రంథములు రెంటింటియందును పార్వతి ముఖము కమలాకరమునకు శోభనిచ్చుచున్నదను విషయము సమానమే. రెంటియందును ముఖమునకు పద్మసామ్యము చెప్పబడినది. కాని నన్నెచోడుని గ్రంథమున పార్వతిముఖమును ఆసరోవరలక్ష్మి విత్తుగా దాచికొన్నదనుటలో విశేషము కలదు. ఉన్నవానిలో కల్ల శ్రేష్ఠమైనదాని నేరి కదా విత్తనమునకు ఉపయోగించుట లోకసిద్ధము. అట్లే ఆసరోవరలక్ష్మి సంతతికి విత్తువంటిదగుటచే పార్వతి ముఖపద్మము ఉన్న పద్మములలో కల్ల శ్రేష్ఠమైనదను భావము ధ్వనితము. కాళిదాసు గ్రంథమునందు ముఖమునకు పద్మసామ్యము మాత్రమే సిద్ధింపనిందు పద్మాధిక్యము కూడ కల్గినది. ఇది ఉపమానముకంటె ఉపమేయమునందగు ఆధిక్యము.

## శరదృతువు

శరత్కాలమునందు జలజోత్పలముల శోభను వర్ణించుచు ఒకచోట కవి యిట్లనినాడు.

"జలవాసులైన హరి ల
క్ష్ములు వర్షనిశావసానమున మేల్కని క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలగుచ్ఛములు మెరసె శారదవేళన్"

ఆ శారదవేళ మెరయుచున్న జలజోత్పలముల శోభను జలవాసులైన లక్ష్మీనారాయణులు వర్షానిశావసానమందు లేచి కన్నులు విప్పి చూచుచున్నట్లు లున్నవట. లక్ష్మీనారాయణులు జలవాసులు. పాలసముద్రమునందుందురు. వారు వర్ష ఋతువునకు ముందుగా వచ్చు ఆషాఢశుద్ధ ఏకాదశినాడు పాలసముద్రమునందు శయనించి, శరత్కాలమునందు వచ్చు కార్తికశుద్ధ ఏకాదశినాడు మేల్కాంచునని ప్రాచీన భారతీయసంప్రదాయము. కావుననే ఆషాఢ శుద్ధఏకాదశి శయనైకాదశి యనియు కార్తికశుద్ధ ఏకాదశి ఉత్థానైకాదశియనియు వ్యవహరింపబడుచున్నది.

పయిపద్యమునందు 'వర్షనిశావసానమున'— అను సమాసము మిగుల అర్థవంతము. వర్షనిశావసాన

# నన్నెచోడుని వర్ణనలలో వన్నెలు చిన్నెలు

మనగా వర్షావసానము నిశావసానము అని అర్థము. ఇటవర్ణనీయవిషయము శరదృతువుయొక్క శోభ. శరదృతువునకు ముందువచ్చిన ఋతువు వర్షఋతువు. శరదృతువునకు ఆరంభవేళ వర్షఋతువునకు అంత్యవేళ యగును. శరదృతువురాక వర్షఋతువునకు అవసానము గుర్తు కల్గును కాన అట్టి వర్షావసానమగుచున్నది. అటుచో నిశావసానమన నేమి యని ప్రశ్న. నిశావసానమన నిశకు అంత్యదశ. అనగా తెల్లవారుజాము. వర్షనిశావసానమనగా శరదృతువుయొక్క ఆరంభమునందలి ఒక తెల్లవారుజామని భావము: ఆ సమయమునందు హరియు లక్ష్మియు కన్నులు విచ్చి మేల్కొనుచున్నట్లు ఉన్నవట జలజోత్పలములశోభ. అటుచో నిటనొక చిన్న సందేహము. పగలు వికసించునవి జలజములు, రాత్రి వికసించునవి ఉత్పలములు. భిన్నకాలములలో వికసించి శోభించు జలజోత్పలములశోభ ఏకకాలములో నెట్లు కల్గినదని ప్రశ్న. దీనికి సమాధానము కూడ 'నిశావసాన' మనుపదమునందే కలదు.

నిశావసానమనగా వేకువజామని చెప్పుకొంటిమి. అప్పుడు రాత్రియంతయు వికసించియున్న ఉత్పలములకు అరమూసుకొనిన దశ. జాములో వికసించనున్న జలజములకు అర్ధవికసితదశ. అట్టి జలజోత్పలములు రెంటికిని అరవిచ్చిన సంధికాలమగుచున్నది. కావున నే వర్షనిశావసానమున, జలజోత్పలశోభితమైన ఆ వసంతవేళ లక్ష్మీనారాయణులకు మేల్కొలుపైనది. దీర్ఘనిద్ర చెంది అప్పుడే కనులు విప్పిన లక్ష్మీనారాయణుల కనులను అరమోడ్పుగనే యుండును. అరమోడ్పు కనులకు అరవిచ్చిన పూరేకులుగను. ఇట్టిది, కవివరేణ్యుడు తిలకించిన శారదశోభ.

## "ఉపమా నన్నెచోడస్య"

మన్మథదహనానంతరము నిటలాక్షుడు విరక్తచిత్తుడై అచ్చోటు వీడు, హిమవంతుడు తనే తుదమే వచ్చి పరాభవాగ్నిచే దందహ్యమానమగుచున్న నిజాత్మజను ఎత్తుకొని అంతఃపురమునకు తీసికొనిపోవును. ఆ దృశ్యము కవిరాజశిఖామణికి "కలుప్రపిదిలి తటిల్లత నేలబడ శారదాభ్రము మగుడ దాని నెత్తికొని పోయినట్లు" గోచరించినదట. ఇట పార్వతి తటిల్లత; హిమవంతుడు శారదాభ్రము. విద్యుల్లతను గర్భీకరించుకొను సామర్థ్యము ఒక్క శారదాభ్రమునకే కల్గినట్లు అప్పటి పార్వతి హృదయతాపమును శాంతిదాయైన చల్లదనమునకు ఆ చలిమలగాడే తగినవాడు. శీతలత్వముచేత నేమి, పావనత్వముచేత నేమి, హిమవంతుని శారదాభ్రముతో పోల్చుట సందర్భోచితి కంతయేని తగియున్నది. కవికులగురువగు కాళిదాసుకూడ ఈ సన్నివేశమును ప్రత్యేకముగ వర్ణింపదలచి

"సపది ముకుళితాక్షీం రుద్రసంరంభభీత్యా
దుహితరమనుకంప్యా మద్రిరాదాయ దోర్భ్యాం,
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దంతలగ్నాం
ప్రతిపథగతిరాసీద్వేగదీర్ఘీకృతాంగః"

అనినాడు. ఇందు హిమవంతుడు ఆత్మజను బాహువులతో పొదిగి తీసుకొనిపోవుట దంతలగ్నమైన పద్మినిని ఐరావతము తీసికొనిపోవునట్లున్నదను భావమును 'సపది ముకుళితాక్షీం' మొదలైన విశేషణములతో వ్యక్తపరచినాడు. ఐరావతముతోడి సామ్యమువలన హిమవంతుని యందలి గాంభీర్యమెంతవ్యక్తమగుచున్నదో పద్మముతోడి సామ్యముచేత పార్వతియొక్క సౌందర్య సౌకుమార్యమంత ప్రకటితమగుచున్నది. కాని నన్నెచోడుని గ్రంథమున హిమవంతుడు శారదాభ్రముతో పోల్చబడుటవలన ఐరావతమునందలి గాంభీర్యాదాత్యములే కాక శీతలత్వమను మరియొక ప్రత్యేక లక్షణము కూడ స్ఫురించుటచేత ప్రసంగానుకూలముగ పార్వతియందు తాపము ప్రతీయమానమగుచున్నది. అదిగాక సంస్కృతగ్రంథమందు చెప్పిన పద్మినీ ఐరావతముల సంబంధముకంటె ఆంధ్రగ్రంథమందలి విద్యుల్లత మేఘమాలికల సంబంధమునందు ఔచిత్యము మెండు. మేఘము లేనిదే మెరుపులుండవు. తండ్రి లేనిదే పుత్రిక లుండదు. ఆ భావమిందు సుస్పష్టము. ఐరావతపద్మినుల కట్టి అవినాభావసంబంధము లేదు; ఒరికదా ఐరావతము పద్మినిని పెకలించును. మేఘములుగాక విద్యుల్లతను గర్భీకరించుకొనును. ఏ విధముగ చూచినను కవిరాజశిఖామణి ఉపమానైపుణి మూలానికాయితరయొప్పుచున్నది.

## మనస్తత్త్వ పరిశీలనము

మన్మథదహనానంతరము, పార్వతి విరక్తచిత్తయై స్థిరనిశ్చయముతో తపమునకు పోవుసమయమున తల్లి మేనాదేవి ఆ ఘోరవిపత్తునకు తల్లడిల్లిపోయినది. ఆకుసుమకోమలికిని ఆ కఠోరదీక్షకును సమన్వయమే కానిచింతించి ఆత్మజను మెల్లగ చేరజీరి "అమ్మా!

# గ్రంథవిమర్శనము

## వెన్నెలవాడ

[గేయనాటికలు : కర్త : శ్రీ సి. నారాయణరెడ్డి. ప్రకాశకులు : సరోజా ప్రచురణలు, హైదరాబాద్. పుటలు : 95, వెల 1-50. ప్రాప్తిస్థానం: ఆంధ్రా బుక్ హౌస్, సుల్తాన్ బజారు, హైదరాబాద్.]

చెవిలో శ్రవ్యకావ్యం 'మాచి', కంటితో రూపకం 'విని' ఆనందించే రోజులివి—కాలగతిలో ఇది తప్పనిసరి మార్పే కావచ్చును. దీనితోపాటు ఈ అర్థశతాబ్దపు సంధికాలంలో సాహిత్యపరివర్తన పరిణామమార్గంలో ఏర్పడిన అవ్యవస్థ ఈనాటికీ సుస్థిరంగా ఉన్నట్లే కనబడుతుంది. నాటకం దశవిధరూపకాల్లో ఒకటని ఎవరికీ తెలియని సంగతి కాదు. నాటిక పదునెనిమిది ఉపరూపకాల్లో ఒకటని ఎవరికీ తెలియని సంగతి కాదు. కేవలం సంప్రదాయాన్ని అలంకారశాస్త్రాన్ని పాటించే ఏ విశ్వనాథ సత్యనారాయణగారి వంటివారో తప్ప ఆధునికులమని చెప్పుకొనే రచయితలెవరూ ఆ శాస్త్రం వైపు తిరిగి చూడటంలేదు సరికదా ప్రదర్శనోద్దేశంతో వ్రాసిన ప్రతిదానినీ పెద్దదయితే నాటకమని, చిన్నదైతే నాటిక అని అంటున్నారు. ఇది సామాన్యంగా దృశ్యకావ్యాల సంగతి.

ఇంక, గేయరూపకాలనేవి ఏ పేరు పెట్టుకోవలెనో తెలియక తంటాలుపడుతున్నాయి. కొందరు నృత్యనాటికలని అక్షరాలు ఉన్నర్తనంచేసే పేరుతో పిలువగా, మరికొందరు సంగీతరూపకాలని సాగదీసి పిలుస్తున్నారు. ముద్దుగా కొందరు గీతినాటికలంటే మురిపెంగా కొందరు గేయనాటికలంటున్నారు. ఈ అవ్యవస్థ కంతటికీ రెండు కారణాలు కనబడతాయి—పూర్వసాహిత్యాన్ని పరిశీలించకపోవడం; ప్రాతవో క్రొత్తవో తాము వ్రాసే ప్రక్రియ స్వరూపాన్ని నిర్ధారించి నియమించకపోవడం.

నాటకం సమాహారకళ. అందులో మాటకూ చేష్టకూ ఎంత ప్రాధాన్యం ఉందో ఆటకూ పాటకూ కూడా అంత అవకాశం ఉంది. కాని ఆట, పాట మాత్రమే ప్రధానంగా ఉండే రూపకాలు మనకు లేవా? పాశ్చాత్యుల నృత్య ప్రధానమైన 'ఆపెరా'ల్లాంటివి, 'మ్యూజికల్స్' లాంటివి మన పూర్వరూపకాల్లో లేకపోలేదు. అందులోనూ తెలుగులో దేశి మార్గపద్ధతుల్లో రెండిటిలోనూ మనకిటువంటి రూపకాలున్నాయి. యక్షగానాలు దేశిపద్ధతికి చేరితే మన కూచిపూడివారి 'పారిజాత'లనబడే కలాపాలు మార్గపద్ధతికి చెందిన ఉపరూపకాలు. ఆచార్య హేమచంద్రుడు కొన్ని ఉపరూపకాలను 'గేయాని' అని 'మ్యూజికల్స్'గా పేర్కొన్నారు. వీటిలో సంగీతమూ నృత్యమూ సమప్రధానములైన శ్రీగదితము మొదలైనవీ ఉన్నవి. రాసకాదినృత్య ప్రధానములూ ఉన్నవి. మన కూచిపూడివారి (సత్య) భామాకలాపం శ్రీగదితమనే ఉపరూపకం. ఇందులో పాఠ్యం, స్థితపాఠ్యం, ఆసీనపాఠ్యం ఇత్యాదిగా నిల్చొని పాడటం, కూర్చొని పాడటం మాత్రమేగాక వాద్యం పెట్టుకొని 'కచేరి' చేసే అవకాశంకూడా ఉంది. నృత్యంమాట సరేసరి. కాని ఆనాటి యక్షగానాల్లో, ఉపరూపకాల్లో ఉండే పాటలకు సంగీతానికి లక్షణం, పద్ధతి ఉన్నాయి. ఏలలు, దరువులు మొదలైనవికూడా ఒక పద్ధతికి లొంగివచ్చినవే.

ఈనాటి గేయరూపకాలలో నియమితమైన వస్తుసంవిధానం కనబడదు. రసభావములమీది దృష్టి ప్రాయశః కొంచెం. రచన సాధారణంగా పదో పదునైదో ఇరవయ్యో మాత్రలని కొంపసరుత్తగా వస్తాయి గేయాలు. వాటికి త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి అనే ఏగతీ పట్టదు. వాటిని పాడేవారో లేక వాటికి ఆడేవారో వాటిని విరుచుకోవాలి. ఈమధ్యలో అర్థం, దానికడుపులో భావం, ఏమౌతాయో ఎవరికీ తెలియదు. ఈ గేయరూపకాలు వ్రాసే కవులు సాధారణంగా జనరంజకంగా ఉంటాయనుకొన్న ఒకచారిత్రిక గాథనో ఒక కల్పననో ఎన్నుకొని లలితపద విన్యాసంచేసి సంతోషిస్తున్నారు. సినిమాల పుణ్యమా అని ఈనాటిసంగీతానికి శాస్త్రమెట్లా అక్కరలేదో ఈ గేయరూపకాల్లో నృత్యాలుకూడా అభినయశాస్త్రాన్ని విడిచిపెట్టి అక్కరలేదంటున్నాయి. కాని కవులు మాత్రం ఒక్క ఉపకారంచేసి బ్రతికించినారు. ఈ గేయరూపకాల్లో కవిత్వం ఉండాలనేది వాళ్లు మరచిపోలేదు. గేయరూపకాల్లో కవిత్వం ఎంతవరకుండాలి, అసలు గేయరూపకానికి తగినవస్తు వేది, భావానుగుణంగా ఛందోవిన్యాసం చేయడమెట్లా అనేవి మనవా

త్కారం లేవు. దివ్వెలసంగీతంలో చమత్కారం గాని, ప్రయోజనం గాని కన్పించవు.

రెడ్డిగారు సున్నితంగా ఊహచేయగల భావుకులు. కలువల కలగానవల్ల చంద్రుడిని వసుల్లో కల వరమేర్పడినదట! దీపావళినాడు మేదినిపై వెలుగుల జలపాతములు! ఇటువంటి చక్కని సున్నితమైన ఊహలు ఉన్నా అక్కడక్కడ భావానికి విజాతీయంగా కనిపించే మాటలు గోర్లించడం పాఠకుని మస్తు చెదరగొట్టాయి. వెన్నెలవానలో చంద్రుడు 'మీ యూరోపమ్ము గుండె లోపలోన మార్మోగెను' అనడం ఏమంత బాగుండదు. నంద్రవగోళంలో పల్లెలుండవచ్చు, నృత్యం చేసే వ్యక్తి నేటి నాట్య పరిభాషలో 'జెర్క్' చేస్తుండేలా ఉయాలు చూపించే అవకాశమూ ఉండవచ్చు. అసలు భావానికి లోయలకు ఏమీ సంబంధము లేదు. అల్లే: దివ్వెలసంగీతంలో ప్రేయసి అంటున్నది:

'ప్రాంచలె మూసుకొన్న
ఇగుల తెరల పారద్రోల
వలపు దివ్వె లంకించవె
వెలిగించుమ మనసు దాని'

ఇందులో విరహానికి ఇగులకు ఉపమానోపమేయ భావం చెప్పి తర్వాత వలపుదివ్వెని గూపకం. తెనుంపగా అక్కడ ప్రేయునికి గాని తనకు గాని విరహం ప్రసక్తి లేదు. వాండ్లకు తెలిసిన ప్రణయ స్వభావంలో మాటాడుతున్న దనుకున్నా, వలపు వంటి దివ్వెలంటే స్పష్టంగా ఉంటుంది.

'సంక్రాంతి'లో లక్ష్మి మగనితో 'ఈనాడు సంక్రాంతియా నా ప్రియుతిమా, కలలబడువున నేను మరచినాను సుమా' అనడం కొంచెం అసహజంగా కనబడుతుంది. అల్లే 'నిండు మెప్పిన వలపులు నూరినాను' అని లక్ష్మి మగనితో అనడంలో రచయిత ఏదో విచిత్ర విశేషం ఉందని భ్రమపడినాడా అనిపిస్తుంది. నిజానికది సున్నితమైన భావం కాదు. ఈ కల్పనలో రెడ్డిగారు కొన్ని ప్రసిద్ధమైన పాటలు ఇతివృత్తంలోని వానిని నాగు—గొబ్బిళ్ళపాట, చందమామపాట. వీటి కర్తలెవరో ఉదాహరించడం న్యాయం. నవ్వని పువ్వులో 'ఉదయ భానుకరాల సుడులు జారెవేళ' అనటం సంప్రదాయానికి క్రొత్త.

ఇటువంటి కల్పనలకు కొదలేని లలితపదాలు, గేయాలతీర్పు, మెత్తని యూహాలు కవికి సమృద్ధిగా ఉన్నాయి. అలరించి మురిపించే నేర్పు ఉన్నది. ప్రతిదాన్నీ ఊహామనోహరంగా మాటలకన్నా ఉన్నది కానైతే వస్తువుకు లోతులు సంతరించడం, ఉరకించే ఊహలని ముద్రాముపట్టి మురిపెంగా నడిపించడం, భావానికి వ్యాఘాతాలు దొర్లకుండా చూసుకోవడం కొంచెం అవసరమనిపిస్తుంది. అప్పుడు కల్పన లేప్రాసిన వాల్టర్ డి లా మేర్ ప్రాసినట్లు లోతుపాతులు, వెలుగు నీడలు మాస్తే రెడ్డిగారి రచనలు ఇంకా బాగా రాణింప గలవు.

## రా గ హృ ద య ం

[రాగహృదయం: రచన: కె. వీరభద్రాచారి, పి. యస్. ప్రకాశితక్షితులు. ప్రతులకు: విజ్ఞానప్రభాస, భీమవరం. 33 పుటలు. వెల. 12 అణాలు]

ఈ గేయరూపకం 24-11-55 భీమవరం కళాశాల సంస్కృతి ఉత్సవాలలో తొలిసారిగా ప్రదర్శింపబడినది. సాకేతనగరంలోని సువర్ణాక్షి అనే వితంతు కుమారుడైన అశ్వఘోషుడు ఆ యూరిలోని ఆస పాడ నేర్చిన ప్రభాదేవి అనే యువన వ్యాపారి కూతురైన ఒక కళాగోష్ఠిలో కలుసుకొని ప్రేమిం చడం, కొడుకు ప్రేమలో పడితే మహాకవి కాలేడని తలచిన సువర్ణాక్షి కోరికచే ప్రభాదేవి అతనిని వంచి వైవోగడం. తర్వాత నేను వేదాంతాన్యునితో వాదం చేస్తుండిన అశ్వఘోషుడు ప్రభక్కై పరితపించి తర్వాత కాలంలో సౌందరనందాది గొప్పకావ్యాలు వ్రాయడం ఇందలి ఇతివృత్తం. దీనికి చారిత్రకాధారం లేదు. అయినా ఉత్తరదేశంలో ఇది 'ప్రచలితగాథ' అట. ప్రదర్శనకోసం వసంతోదయం, కళానిలయం, వల్లరీవనం, బౌద్ధవిహారం, శిశిరసంధ్య అని ఆయిదు రంగాలుగా ఉన్నదీ రూపకం. విద్యార్థులు తాము నేర్చిన ఆటపాటలతో ప్రదర్శించుకోడాని కిది బాగా నేయుంది. ఇందలి గేయాలు అర్థ విచారం చేయక ఏవో జిలుగు పదాలు కూర్చుకోవడంవల్ల భావానికిగా బాధపడని వాండ్లకు శ్రవణపేయంగానే ఉంటాయనవచ్చు. మరీ 'లాకూగుణ లపిత చరణ పద్యావతీ స్వాగత మనవే' 'భువనభవన జన మోహనకంఠికి', 'జాలువారు నవపువ్వు మంజరి వ్రాలుమన్న విడె మత్త మధుపము...', 'విదితమ్ము విమలాలు' మొదలైనచోట్ల అన్వయమూ అర్థమూ కూర్పో విచార్యంగా ఉంటున్నది.

కళానిలయంలో కళాతపస్వుల గోష్ఠిలో ప్రభాదేవి అశ్వఘోషుడు పాడే విజయశ్రీపతాకను గెల్చుకొన్న ఆ రెండు గేయాలు చిత్రగించండి.

ప్రభాదేవి:

పరిహసిత యమునాలోలలావణ్య
లహరీ విహారిత జటాజూట
పరివలితగాంగ తరంగ శిశిరీకర
విలసిత వాక్పూర
ప్రాభాత శైశవ సౌభాగ్యశ్రీ
శోభివాంఛిత వైభవోపస్విని
హ్యాసనసక్తనగాల
మృగులమోహన శీల
నటరాజ రాజేశ్వరా

అశ్వఘోషుడు:

అతిలోకమనోజ్ఞ భావ
భంగ్యంతర వ్యంగ్యవైభవ
రసాంచిత కావ్యకథా సరోజప్రశాంతి
తుషారబిందు కళికావృత దివ్యలోచన
విలోలాలకా, లోలలోచన
విపంచిధారిణి మనోవినోదిని వాణీ
విశ్వసౌందర్య శోభారాణీ
అశ్వఘోష హృత్పద్మస్థిత
భావప్రభమణిణీ.

ఆనాటి అనాటి సభ్యులవలె కంఠశోషణలు చేయడం తప్ప చేయగలదేమీ లేదు. Imagination rumming riot అంటే ఇదే గాబోలు!

## కావ్యమాల

[కావ్యమాల: కర్త: శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, ఆంధ్ర, సంస్కృత భాషోపన్యాసకులు, ఆర్. బి. వి. ఆర్. ఆర్. కళాశాల, హైద్రాబాద్. 124 పుటలు. వెల రు 1-50 న.పై.]

శిరోమణి. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తెలుగునాట కవిపండితలోకానికి ఎంతో చిరపరిచితులు. ఆయన సవివరణంగా ప్రకటించిన కావ్యాలంకార సంగ్రహము, పంతరించిన తత్సను చంద్రిక చదువని సాహిత్య విద్యార్థియుండడు. ఆయన గోవర్ధన సప్తశతీసారము, అలంకారశాస్త్రంలోని రసవంతమైన శ్లోకాలకు చేసిన అమృతకణములనే అనువాదములు, కీరసందేశకావ్యము చదివి యానందింపని సాహిత్య రసికులుండరు. వారి జాతకకథా గుచ్ఛము కూడ పండితలోకమున ప్రశస్తి పాత్రమైనది. శాస్త్రిగారటు గొప్ప వైయాకరణులు, ఇటు కవియునైనవారు. వారు రచించిన పద్యకథాసంపుటి ఈ కావ్యమాల.

ఇందులో పది కథలున్నవి. తెలుగువాడైన కుమారిల భట్టు వాదు విజృంభించియుండిన బౌద్ధము నరికట్టుటకు ప్రచ్ఛన్నవేషమున బౌద్ధధర్మము నభ్యసించి పిదప బౌద్ధుల నోడించి సుధన్వుడను రాజు నాస్థానమున పరీక్షకు నిల్చి వైదికమతమును స్థాపించి బౌద్ధగురువునకు చేసిన ద్రోహమునకు చింతించి తుషాగ్నితప్తుడై మరణించిన కథ మొదటిది. రెండవది భారతప్రసిద్ధుడగు ఏకలవ్యుని కథ. మూడవది ఉపమన్యుభక్తి. నాల్గవది మాధవ విద్యారణ్యులు హరిహరబుక్కరాయలచే విద్యానగరము కట్టించి ఆంధ్రసామ్రాజ్యము స్థాపింపజేసినకథ. ఐదవది శాపానుగ్రహసమర్థుడగు వేములవాడ భీమకవి రాజకళింగగంగును జోగిగజేసి మరల రాజ్యమునిచ్చినట్లు చేసినకథ. ఆరవది నారదతుంబురులు సంగీతమున తాను గొప్పయన్న తానే గొప్పయని స్పర్ధరాగా హనుమంతుడు తన భక్తిగానముచే రాలుకరిగించి వారినందరిని కించిచేతనైనచో మీరుకూడ రాలుకఱుగునట్లు పాడి బయటకు రండని గేడిపించినకథ. ఏడవది మునికుమారుడైన రురుడు ప్రమద్వరయను గంధర్వాప్సరస్సంజాతయైన కన్యను కలిసి యామె మృత్యువువాతబడగా తన యాయుస్సున సగమిచ్చి యామెను బ్రతికించికొని వివాహమాడిన ప్రసిద్ధభారతకథ. ఎనిమిదవది తాన్‌సేనకథ. అక్బర్ అంతఃపురములోని యొక హైందవ కుమారి తాన్‌సేనును ప్రేమించి విఫలురాలై అతనిమీది యనురాగముచే దర్బారీ రాగమును సాధించి రాజసభలోని శత్రువు లభిచారము చేయగా నకాలమరణము బొందిన తాన్‌సేను విద్యను నిలిపినకథ. తొమ్మిదవది ఒక బ్రాహ్మణుడు సమర్పించిన జరామరణము లేని పండు కారణముగా స్త్రీస్వభావము నరయవచ్చి సంసారము రోసి ముముక్షువైన భర్తృహరి కథ. పదవది దీపావళినిగురించి ఉత్తర, పశ్చిమభారతములందు వ్యాప్తిలోనున్న ఒక రాకుమారి కథ.

ఇందులో కొన్ని పురాణకథలు, కొన్ని గాథలు, కొన్ని చరిత్రప్రసిద్ధాలివి. ఈపదింటిని కథాకావ్యాలుగా తీర్చడంలో శాస్త్రిగారు రెండువిశేషములు చూపినారు—మొదటిది ప్రతిపద్యములోను తెలుగు పలుకుబడులు చిమ్మడం. రెండవది అనేకంగా వైయాకరణ విశిష్టములైన ప్రయోగాలు వాడడం. ఈకథలు చదవడంవల్ల ఇటు తెలుగుపలుకుబడి అటు ప్రయోగ విజ్ఞానము సాహిత్యవిద్యార్థులకు కలిగితీరుతుంది. శాస్త్రిగారికృషి ఈ విషయంలో శ్లాఘాపాత్రము.

# గ్రంథ విమర్శనము

ప్రయోగవిజ్ఞానాన్ని కల్గించడానికి పాటుపడిన శాస్త్రిగారి రచన అంతటా ప్రసన్న మధురము. మచ్చునకు దీపావళియను కడపటి కథనుండి యొక పద్యమును, తర్కసేనీయమునుండి యొక పద్యమును చిత్రింపుదును.

'అది లేదని యిది లేదని
మది వగవక దైవ మిచ్చె మనకిది యనుచున్
ముదితా మణి తనభర్తకు
ముదమిచ్చెను బ్రహ్మ కామ పాల్కె సతితమున్.'

'శ్రవణపేయమైన సంగీతవిద్యకుఁ
దక్షిణీయమైన యానందమునకుఁ
జిత్రపేయమైన శీలంబునకు దాను
దలిరుఁబోఁడి క్రీతదాసి యయ్యె.'

ఇందలి యేకలవ్యుని కథలో మాత్రము శాస్త్రిగారు కొన్ని మార్పులు చేసినారు. నిషాదునకు ద్రోణుడు విలువిద్య నేర్పననుటకు కారణ మింకు క్రొత్తది. ఏకలవ్యుడు నిషాదుడు గనుక అస్త్రమంత్రముల నాతడు సరిగా నుచ్చరింపలేడనియు సరిగా నుచ్చరింపనిచో అవి విపరీతఫలము నిచ్చి చెరుపు చేయగలవనియు ద్రోణుడు చెప్పును. యాదృచ్ఛికముగ నేసిన కొర్కె నెరవేరగలదని యాశీర్వదించును. రెండవది అర్జునుని గొప్పజేయుటకై ఏకలవ్యుని బొటనవ్రేలు కోసి గురుదక్షిణగా నిమ్మని ద్రోణుడడుగలేదు. అర్జునుడే ద్రోణునకు తెలియకుండ ఈ కార్యము నిర్వహించినట్లు తీర్చబడినది. ఈ మార్పులతో శాస్త్రిగారు ద్రోణాచార్యుల ప్రవర్తనకు కళంకలో త్రప్పింపజూచినారు. మార్పులు ఈ కథలోని పరిధికి లోబడినంతవరకు ఔచిత్యమునకు కొరవ లేదు. విలువిద్య నేర్పనిదే గురుదక్షిణ యడుగరాదనుట న్యాయ్యమే కాని ద్రోణునికి సంక్రమించిన ఈ మార్పుల వల్ల గలుగు చివరిఫలమేమి? ఆయన దోషము అర్జునుని జుట్టుకొన్నది. ఇంతకును ఏకలవ్యవృత్తాంతము ద్రోణుని జీవితమున ఒక సంఘటన. ద్రోణుడు భారతమునందలి అసంఖ్యాకపాత్రలలో నొకడు—భారతమును విడిచి ఏకలవ్యకథకుగాని, ద్రోణునకుగాని నిలుచుటకు శక్తి చాలదు. ద్రోణునియం దాదోష మున్నంతమాత్రమున ప్రత్యేకముగా వచ్చిన నష్టము కొన్నిపడు. గురువు చేతిలో నంతటి యన్యాయమునకు పాత్రుడుగుటచేతనే—పాత్రుడగుట—ఏకలవ్యునిపై సానుభూతి, అతని గురుభక్తికి దీప్తి కలుగుచున్నది గదా! అర్జునునివలన నాపట్లయ్యె నన్నచో నది మెరుగుతగ్గ ననిపించును. ఏతావతా ఈ మార్పులలో గాన్పించునది శిష్యవాత్సల్యముగల శాస్త్రిగారి గురుహృదయమని నాతలంపు.

రురుడు ప్రమద్వరను బ్రతికించుకొన్న కథలో శాస్త్రిగారి తీర్పు రసోచితముగా హృదయంగమముగా నున్నది.

భర్తృహరి కథలోని రాణి ప్రవర్తనమునందలి స్వైరతి తెరమరుగు వృత్తాంతమును టార్చిలైటువేసి చూపినట్లు ప్రౌఢముగా తిప్పినారు శాస్త్రిగారు.

ఇట్లీ కావ్యమాలలోని పది కథలును సర్వులు చదివి యానందింపదగినవి. సాహిత్యవిద్యార్థుల కవశ్యము చదువదగిన, పాఠ్యగ్రంథముగా నుండదగిన పుస్తకమిది.

## గాంధీగీత

[గాంధీగీత : కృతికర్త. గొట్టిపాటి సుబ్బరాయులు. ప్రతులకు : విశ్వప్రచురణాలయము, అనంతపురం. 52 పుటలు. వెల. రు. 1.]

పరిమితమైన భాషాపాండిత్యంతో ప్రబంధాలు వ్రాయడం కష్టమేమోగాని ప్రతిభతో జిలుగైన పద్యం వ్రాయవచ్చు. పాండిత్యాన్ని సాధించడ మెంత కష్టమో తన శక్తిసామర్థ్యాల పరిమితిని తానెరుగుటకూడ అంత కష్టము—కొండొకచో పట్టుబడితే మతికొండెకిది పట్టుబడుతుంది. "గాంధీగీత" అనే చిన్న కావ్యాన్ని వ్రాసిన గొట్టిపాటి సుబ్బరాయులుగారీ రెండవ తెగకు చెందినవారు. గాంధీగారి జీవితాన్ని 'సీటు' గా తేటగీతులలో వ్రాసి జిలుగైన చిన్న కావ్యంగా సంతరించినారు. గాంధీగారిజీవితాన్ని వ్రాయదలచుకున్నవారు రాజకీయాలను చరిత్రను తప్పించుకోలేరు—ఈ కృతికర్త కవితావృష్టితో చరిత్ర ఫలానికి రంగు వేయగల దిట్ట.

'చంపఁబడినంత మాత్రాన చావబోరు
సత్యజీవిత పథమున సన్న్యసైన
అమరజీవులు ఈ జగత్తలరునాక
మంచితన మను గుణము జీవించుదాక.'

'శక్తికు త్తేజనమ్ము, ప్రశక్తి కూత,
కవికి నుత్కంఠ, వీరుల నవలి వెంట
సాహసమ్మును, త్యాగికి సాహసమ్ము
కూర్చినా విన్నిటను మార్పు దార్చినాడు.'

మహాత్మునిగూర్చిన ఇట్టిభావములతో కవి యీకావ్య రచనకు పూనుకొన్నట్లు స్పష్టము. రచన ఆద్యంతము తేటగానున్నది. మూర్ఖులో జిలుగుగూడ తక్కువ. అచ్చపు దెలుగు పలుకుబడి తాను మెచ్చిన త్రోవ. ఇతివృత్తమునకు రచనా పద్ధతి కిట్లు నిరాడంబరతలో పొత్తు కుదిరినది.

'చోరవ జరిగబట్టి తూత్తేజ ముడిమి కుడిసె
పక్కులడిగెను కత్తికి తొక్కలెదిగ'

అన్నచోట పలుకులలో వాడి, సాహ ఱెంతగా మెండుకొన్నదో చిన్న వాడు ప్రయోగాలై లంకెనుకుపోయిన గాంధీ—

'ఆంగ్లమున కుంటుబడక మాటాడలేదు
బహువిధంబుల భోజనభాజనముల
పద్ధతులగూర్చి యెఱుగడు పాప మతని
కంతియును వింత చెవదల పంతియయ్యె'

వనుటలో గూడ వంతటి సొగసున్నది.

భోగభాగ్యాల తులదూగు భూరిరాజ్య
దర్పవిన్యాస మంతియు తగ్గితగ్గి
ఒక్కమాసిసి చేవ్రాలు నొక్కతోడ
పక్కునం జెలి ద్రక్కలు ముక్కలయ్యె.

గాంధీ—ఇర్విన్ సంధిఫలాన్ని చెప్పే పై పద్యం లోని ఉక్తి బలమెటువంటిదో రౌండు టేబిల్ సమావేశాలు వ్యర్థమైనాయని చెప్పే ఈక్రింది పద్యంలో మెరిసే అలంకార విన్యాస మటువంటిది.

'వాదముల తీరు ప్రతివాద వైఖరులును
కంఠశోషయె; ఫలితము గగన కుసుము
ములును మెఱపులతో నెట్టు తొలువునిండు
ఉత్తిమాటలతో నెట్టు పొత్తుగుదురు.'

కావ్యం చిన్నదైనా గుణానికి చిన్నది కాదు. అక్కడక్కడ దొరలిన తెప్పులు మలిముద్రణంలో సవరించుకుంటే బాగుంటుంది. ఈ కావ్యం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారి కంకితము.

ఎస్. కె.

## కైకేయి

కర్త. చిట్టిప్రోలు కృష్ణమూర్తి; ప్రతులకు: కర్త పేర—గామాలపాడు. వయా - దాచేపల్లి, పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా. 7: పుటలు విల: రు. 1-50 న.పై.]

యౌవరాజ్య పట్టాభిషేకం చేసుకోబోతున్న శ్రీరామచంద్రుని అడవులకు బో జేసిన కైకకు తరువాత ఎప్పుడో అతిశంగా కలిగిన పశ్చాత్తాపంగా ఈ చిన్న కావ్యం సంతరించబడింది. శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తి గారీ గ్రంథం వ్రాసినవారు. 'మనవి'లో వారిట్లా వ్రాస్తున్నారు: "పండిత లోకంలో కైకేయిపట్ల సదభిప్రాయమే ఉన్నా జనసామాన్యంలో మాత్రం ఆమెపట్ల నిరసనభావం పాతుకొని పోయింది. 'గయ్యాళి'కి 'కైక'ను పర్యాయపదంగా వాడేటంతటా పోయింది ఈ దురభిప్రాయం. ప్రజాబాహుళ్యంలో వేళ్ళునిన్న ఈ దురభిప్రాయాన్ని తొలగించడమే ఈ కావ్యరచనోద్దేశం."

ఈ ఉద్దేశంతో గ్రంథకర్త కైకేయి తలపోతలో రాముని బాల్యమాదిగా పాదుకా పట్టాభిషేకం వరకు నడచినకథను ఆవృత్తిచేయించినారు. రాముల అడవికి పంపిందని ప్రజాబాహుళ్యం కైకను నిందింపవచ్చు. తెలిసినవారు సానుభూతి చూపనువచ్చు. మరి సీత నడవుల ద్రోచినమాట వచ్చినప్పుడు శ్రీరాముని నిందింపని వారు ఎవరు? కైక పశ్చాత్తాప పడటం చాల సహజమె. ఆమెనుగురించిన అపోహ లోకంలో తగ్గిపోవాలనే గ్రంథకర్త కోరిక. ఆయన కామెమీద గల సానుభూతిని మాత్రమే నా పుత్రుండిగాని కొన్నివేల యేండ్లనుండి కైక చెడ్డది అనుకొంటూవస్తున్న లోకం మారుతుందనే ఆశ సమీక్షకునికి లేదు. ఏదో ఒక నెపంతో రాముకథ అంతో ఇంతో పలికిన గ్రంథకర్త నభినందిస్తున్నాను.

గ్రంథకర్త వృత్తం నడపడంలో చేయి తిరిగిన వారు. ఈ కావ్యమంతా చంపకోత్పలాలు మత్తేభ శార్దూలాలుగా నడచింది. తెలుగుసంస్కృతాలు సమపాళంగా వాడిన ఈ రచన పశ్చాత్తాపాని కనువైన నెమ్మదనంతో ఆ వుద్వేగానికి తగిన పద్యబంధంతో చక్కగా సాగిపోతుంది.

'చతురప్రజ్ఞలు సర్వమానవ మన
స్తత్త్వమ్ము లూహించు పం
డిత మూర్ధన్యులు చేసు నా హృదయవా
టన్ దీవ్ర ఝంఝూనిలో
ద్ధతిపీచుల్ చెలరేగి యేనిటులం బ
స్తాయించు టూహించి సం
తతసంక్షుబ్ధము నా యెడంద విలయిం
చన్ సుంత యార్పిందరా'

# గ్రంథ విమర్శనము

చివరకు కైకేయినోట అనిపించిన ఈ మాటలు ఎంత శిల్పమార్గమున సంధానింపబడినప్పటికిని కవిగారి కుపయోగించినంతగా కైకేయి కుపయోగింపవేమో!

గ్రంథకర్త కైవారమునకు పద్యంలోని ధారాశుద్ధికి ఈ పద్యం చిత్తగించండి.

ప్రాతస్సంస్మరణీయమై భయదపా
 పచ్ఛేదకంబై జగ
త్ఖ్యాతంబై రఘురామ నామమును అ
 స్తోక ప్రపంచ ప్రజా
వ్రాతవ్యాహృత నింద్యమై స్మరణమా
 త్రసాధ్యసంహాస్కర
ఖ్యాతిత్వంబయి నాదు నామమును నా
 కల్పంబు వర్తించెడిన్.

రామనామ మాకల్పము పాపచ్ఛేదకంగా నిలువవలెననీ కైకమ్మ చెడ్డపేరు పోవలెననీ అంటూ కోరవలసిందే. తథాస్తు!

## చకోర సందేశము

[చకోరసందేశము కృతికర్త: శ్రీ మోటూరి వేంకటరావు. బి. ఏ., ప్రకాశకులు: శోభా ప్రచురణలు. ప్రతులకు: శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ. 64 పుటలు వెల: రు. 2.]

చకోరసందేశమనే ఈ కావ్యం శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు కావ్యపరిచయంలో తెలివిచ్చినట్లుగా కాళిదాసు మేఘసందేశానికి 'దేహాంతరతుల్య సంవాదం'గల కావ్యం. కొన్ని సంవత్సరాల క్రిందట వేంకటరావుగారి హిమగిరమనే ఖండకావ్యసంపుటిని నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రచురించటం పాఠకులు మరచి ఉండరు. నిన్న మొన్నటి వారి 'సింహబలి' కావ్యం తద్జ్ఞుల మన్ననలందినది. ఏడాది తిరుగక మునుపే వేంకటరావుగారి చకోరసందేశాన్ని పాఠకలోకానికి సమర్పిస్తున్నారు.

'హిమగిరము' 'సింహబలి' 'చకోరసందేశము'— ఈ మూడూ మూడురకాలైన కావ్యాలు. హిమగిరములో వెంకటరావుగారి కాల్పనిక కవితామార్గ విలసితమైన సంయమశీలమైన వ్యక్తిత్వం తెలుస్తుంది. సింహబలిలో వీరరసం ప్రధానం. చకోరసందేశంలో విప్రలంభశృంగారం. వెంకటరావుగారి బహుముఖప్రజ్ఞ ఈ కావ్యవైవిధ్యంలోనే తెలుస్తుంది.

మేఘసందేశం చదివి ఆనందించని సాహిత్యరసికులుండరు. ఈ చకోరసందేశంలో ఇంకొకరు కాదు, ఆ యక్షుని ప్రియురాలే ప్రియునకు చకోరికతో సందేశం పంపటం ఇతివృత్తం. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ కావ్యశిల్పాన్ని సమీక్షిస్తూ వ్రాసినట్లు ఇది 'చమత్కారముగా చెప్పినచో తోటాను త్రిప్పి కొట్టుటవంటిది.' ఇతర భాషలందువలె తెలుగులోను మేఘసందేశానికనువాదాలు, అనుకరణలైన సందేశకావ్యాలు ఎన్నో ఉన్నవి. కాని వేంకటరావుగారి ఈ కృతి విలక్షణమైనది; చమత్కారవహము; రసవంతమునైనది.

కాళిదాసురచన జ్ఞాపకాలతోనే ఈ కావ్యారంభం. యక్షప్రియుని స్మరించి పాడుకోబోయి కన్నీటిబొట్లు జారి వీణాతంత్రుల శ్రుతి భంగపరపగా, గోడకున్న దర్పణంలో 'అతికృశాంకిత నిజాకృతి' నమ్మలేక లేచి వెళ్లి వాతాయనసన్నిధి కూర్చుంటుంది. వెన్నెలలో మరీచికవలె కన్పించిన చకోరికతో మెల్లగా తన సొద వెళ్ళబోసుకుంటుంది.

'వినవే చకోరికా! వినవె నా చెల్లి!
వినిపింతుఁ గన్నీటి విరహగీతికల—
అనుకంప నీకు ప్రత్యేకముగాఁ దోఁచక
వినదింతు నేనె నిల్వన గరంగుమను'

అనే ఈ మాటల ఆవృత్తితో ప్రథమఖండమంతా సాగుతుంది.

'స్మృతులు నా జీవన స్రోతులై కలంచ
మతిమాలి నాసొదల్ మళ్ళీ చెప్పుకొందు'-అంటుంది.
'ఎన్నినాళ్లో కదే ఈ బాధ నన్ను
విన్నంటె ఈ రీతి వేధించె! ఇంక
ఎన్ని నాళ్ళని ఓర్వ విష్వంగవలెనొ
చిన్నారి నా చెల్లి! చెప్పవే తల్లి!'అనిమూలుగుతుంది.

ప్రియునికి సందేశమందించి వచ్చి—

